



విశాఖపట్నంలో జూన్ 22న జరిగిన శ్రీశ్రీ శతజయంతి సభలో 'శ్రీశ్రీ సాహిత్యం సమకాలీనత' పుస్తకాన్ని ప్రముఖ కవి రామతీర్థ ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో ఎం.ఎల్.సి. ఎం.వి.యస్. శర్మ పుస్తక రచయిత, ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి, విశాఖ జిల్లా సిపిఎం కార్యదర్శి సి.హెచ్ నర్సింగరావు



విశాఖపట్నంలో ఘనంగా జరిగిన
శ్రీశ్రీ శతజయంతి సభ.





సాహిత్య
# ప్రస్థానం
సంపుటి : 8 జూలై, 2009 సంచిక : 44

# విఖ్యాత, విషాదాంతం...

ప్రపంచ పాప్ సామ్రాట్ మైకెల్ జాక్సన్ కన్నుమూత కళాభిమానులెవరినైనా కదిలిస్తుంది. ఓ కన్నీటి బొట్టు మౌనంగా జారిపోతుంది. నలుపు తెలుపు మేళవించిన విశ్వ కళా సంచలనం ఆయన. తన చిటికెన వేలు కదిలిస్తే వేలం వెర్రిగా ఎగబడిన కోట్ల మంది సంగీతాభిమానులు ఒకవైపు.. ఆ ప్రతి కదలికనూ అక్షరాలా కోట్ల డాలర్లలోకి మార్చిన సామ్రాజ్యవాద ధనస్వామ్య సంస్కృతి మరోవైపు కళ్లముందు నిలుస్తాయి. వాటన్నిటినీ లోతుగా తర్కించే సందర్భం కాదిది. ఆయన అసాధారణ ప్రతిభ కృషి ప్రప్రథమంగా స్మరించుకోవలసినవి. అవే లేకపోతే ప్రపంచం ఆయనను ఇంతగా ఆరాధించేది కాదు. అయితే సదరు ప్రపంచంపై రాజకీయ ఆర్థిక ఆధిపత్యం సాగిస్తున్న శక్తులే సాంస్కృతిక ఆధిపత్యమూ చలాయిస్తున్నందున అన్ని చోట్లా ఆయన పేరు మార్మోగింది. చిరంజీవి, ప్రభుదేవా వంటి వారు ఆయనను తాము ఎలా అనుసరించిందీ ప్రకటిస్తున్నారు. తెరపైనే గాక నిజజీవితంలోనూ ఆ పాప్ వరవడి ప్రపంచాన్ని అమితంగా ప్రభావితం చేసింది. ఇప్పుడు ఏ ఛానల్ చూసినా పిల్లలతో కూడా పిచ్చి పిచ్చి గెంతులు వేయించడం చూస్తూనే వున్నాం. ఆయన ఆదాయం విలాస వైభవ జీవితం గురించిన కథలకు అంతేలేదు. కళాకారుల ప్రసిద్ధికి ఇవన్నీ కొలబద్దలు కావడం కూడా మార్కెట్ సంస్కృతి ఫలితమే. జాక్సన్ నల్లజాతి గుండెచప్పుడుగా మొదలై దేహ వర్ణంతో సహా తెల్లజాతి సాంస్కృతిక ప్రతీకగా మారిపోవడం వెనక ఒక పెద్ద సామాజిక సందేశమే వుంది. చివరి దశలో ఆయన ఎదుర్కొన్న సమస్యలూ, సంక్షోభాలూ కూడా కళారంగంలో చొరబడిన కాలుష్యాన్ని పట్టి చూపిస్తాయి. పాల్ రాబ్సన్ వంటి నల్లజాతి గాయకుల జీవితాలకు భిన్నమైన ధోరణి జాక్సన్‌ది. దీనంతటికీ వ్యక్తిగతంగా ఆయన బాధ్యుడు కాదు. అయితే నమూనాగా నిల్చి పోయాడన్నది నిజం. విపరీత ప్రచారమిచ్చే మీడియానే వికృత కథనాలను కూడా విస్తృతంగా వ్యాపింప చేయడం ఈ సంస్కృతిలో భాగం. వాటన్నిటి మధ్యనా ఆయన చివరకు అనుకోని విధంగా కన్నుమూయడం విషాదాంతం. ఆయన అసాధారణ ప్రతిభా ప్రస్థానానికి జోహార్లర్పిస్తూ అందులోనుంచి అనివార్యంగా నేర్చుకోవలసిన పాఠాలు నేర్చుకోవాల్సిందే. మనను వదలకుండా వెంటాడే జాక్సన్ ఆట పాటల్లో అనుక్షణం ఆ సందేశం మార్మోగుతుంటుంది.

కవర్‌పేజి పెయింటింగ్ : వైకుంఠం
బొమ్మలు : శివాజి, వెంకటేష్, లక్ష్మీనారాయణ, బి.వి.ఆర్. చారి,

## ఈ సంచికలో...



సంపాదకవర్గం
తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
ఎ.సత్యభాస్కర్
వీరప్రసాద్
ఎం.నరహరి
కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in

# కానుక



- పుప్పాల కృష్ణమూర్తి

వారం రోజులు పట్టింది అరకు నుండి భీమ్లీ దాకా చూడ్డానికి. లాస్ట్‌డే ఈవెనింగ్ కైలాసగిరిపై ఉన్నాం. ధవళ కాంతుల్లో మెరిసిపోతున్న శివపార్వతుల ముందు నిలబడి ఫోటోలు తీసుకున్నాం. కొండంతా తిరిగి కోరుకున్న యాంగిల్స్‌లో వీడియో తీసుకున్నాం. కాళ్లు నొప్పిపుట్టి, అలిసిపోయి, పక్కనే ఉన్న గార్డెన్‌లో కూలబడ్డాం. అక్కడ మాలాగే చూడ్డానికి వచ్చిన ఫ్యామిలీస్, స్టూడెంట్స్, టూరిస్టులు, కొత్త దంపతులు కూర్చుని చిరుతిండ్లు తింటున్నారు. మేమంతా కనుచూపు మేర దాకా కనిపించే నీలి సముద్రాన్ని చూస్తూ, చిప్స్‌లో దాని అందాల్ని అద్దుకోసాగాము.

మా ముందు పచ్చగడ్డిలో షుమారు రెండేళ్ల వయసున్న బాబు బుడి బుడి అడుగుల్తో, బంతిని తంతున్నాడు. దూరంగావెళ్లిన దాన్ని పట్టుకుని పకా పకా నవ్వుతున్నాడు. బొద్దుగా, తెల్లగా, నీలి కళ్లతో మనోహరంగా ఉన్నాడు. వేసిన డ్రెస్సు, బూట్లు కూడా కాస్ట్లీగా ఉన్నాయి. వాడ్ని చూడగానే మా పాప "అబ్బ బాబు చూడమ్మా ఎంత బావున్నాడో!" అనుకుంటూ పరిగెత్తుకెళ్లి, వాడి రెండు బుగ్గలపై ముద్దు పెట్టుకుంది. వాడు అదేం పట్టిచ్చుకోనట్లు బంతి మీదే దృష్టి నిలిపి, మళ్లీదాన్ని తన్నడానికి తయారవుతున్నాడు. నల్లని పొడవైన వెంట్రుకలు వాడి లేత ముఖంపై పడుతుంటే, చంద్రునికి అడ్డం వస్తున్న కరి మబ్బుల్లా అనిపించింది. వాడి ఫోటోలు కేలండర్స్‌గా రిలీజ్ చేస్తే లక్షల్లో పోతాయనిపించింది.

శివ తన డిజిటల్ కెమరాతో బాబును రకరకాల యాంగిల్స్‌లో ఫోటోలు తీస్తున్నాడు. కొత్తగా పెళ్లైన అమ్మాయి భర్త పక్కనే దిగువకు వెళుతూ, బాబు బుగ్గలు పుణికి మరీ వెళ్లింది. బహుశా, తనకు అలాంటి బాబు పుట్టాలని మనసులో కోరుకుని ఉంటుందనిపించింది. ఇంతలో మా బాబు గబాల్న పరిగెత్తుకెళ్లి, బంతిని పట్టుకుని, బాబును ఎత్తుకుని మేం కూర్చున్న దగ్గరకు పట్టుకొచ్చాడు. ఐస్‌క్రీం బండి దగ్గర్నుంచి పాప ఆరు ఐస్‌క్రీంలు పట్టుకొచ్చింది. మా అందరికి తలోటి ఇచ్చి, బాబుకు మరోటి ఇవ్వబోయింది.

"వద్దమ్మా. వాడికి జలుబు చేస్తుంది" వినిపించిందో మృదువైన స్త్రీ కంఠం.. అప్పుడు చూశాము వెనక్కు.

కాస్త దూరంగా రుద్ర గన్నేరు చెట్టు నీడన కూర్చుని ఉన్నారా దంపతులు. సింపుల్‌గా ఉన్నా రిచ్‌గా అనిపించారు. ఆయన ఫుల్ హేండ్స్ మీద టక్ చేస్తే, ఆమె పింక్ కలర్ బార్డర్ వున్న ఆకుపచ్చ ధర్మవరం చీరకట్టుకుని నిండుగా ఉంది. చూడగానే నమస్కారం పెట్టాలన్నంత సంస్కారవంతంగా ఉన్నారిద్దరు. పక్కనో పదిహేనేళ్ల అమ్మాయి కాస్త ఎడంగా ఓ బుట్ట పట్టుకుని కూర్చుంది. అందులో వాటర్ బాటిల్స్, ఫ్రూట్స్, నేప్‌కిన్స్ కనిపిస్తున్నాయి.

అంతవరకూ బాబు తలిదండ్రులెవరో కూడా మేము పట్టించుకోలేదు వాడి ఆటల్ని చూస్తూ.

"పోనీ బిస్కెట్లివ్వచ్చా అంకుల్" అన్నాడు మా బాబు.

వాళ్లు లేచి దగ్గరకొస్తు, "వద్దు బాబు. వాడి కివ్వాల్సిన మెనూ మధ్యాహ్నమే పూర్తయింది. ఓన్లీ వాటర్. అది కూడా మేం ఇంటివద్ద నుంచి తీసుకొచ్చిన బాయిల్డ్ వాటర్ మాత్రమే."

"చూశావా రమా. డబ్బున్న వాళ్లు తమ పిల్లలని ఎంత జాగ్రత్తగా పెంచుతారో? మనకో టైంటేబులుండదు. మెనూ ఉండదు. ఏది పడితే అది, ఎప్పుడు పడితే అప్పుడు తినేయడమే" అన్నాను.

ఐస్‌క్రీం తింటున్న మా పిల్లలిద్దరూ, కాస్త సిగ్గుపడ్డారు.

బాబు కోసమన్నట్లుగా వాళ్లిద్దరూ లేచి మా వైపు రాసాగారు. ఇక బాబుని తీసుకుపోతారని చెప్పి, చివరిసారిగా తనివితీరా అందరం తలో ముద్దు పెట్టుకున్నాం గట్టిగా.

బాబును ఎత్తుకుని వాళ్ల కందిస్తూ, "చాలా అందంగా ఉన్నాడు. మీ మనవడా?" అన్నాను.

"ఊహూ.. కాదు" అన్నాడు నిలబడి.

"మరి మీ బాబా?" అన్నాను.

"ఊ.." అన్నాడు తల ఊపుతూ.

'యాభై దాటినట్లుగా ఉన్నారు. వీరికింత చిన్న బాబా?' నాకు ఆశ్చర్యమనిపించింది. పైకనలేదు. అయినా పేపర్లో చూడ్డం

లేదు. 'అరవయ్యేళ్ల బామ్మకు కవలపిల్లలు పుట్టారని.' మనసుకు సమాధానం చెప్పుకున్నాను.

"ఇంతకూ పేరేంటంకుల్" అడిగింది మా పాప.

"పేరా? పెట్టలా" అన్నాడు చేతిని అటీటు ఊపుతూ.

"ఏం బాబుకు ఇరవయ్యొకటి చేయలేదా?" అడిగాను ఆశ్చర్యంగా.

"మీరు జర్నలిస్టా?" అడిగాడు నా ముఖంలోకి కుచ్చినట్లుగా చూస్తూ.

"కాదు. పంచాయతీ రాజ్ డిపార్టుమెంట్‌లో సూపరింటెండెంట్‌గా చేస్తున్నాను. నా పేరు శ్రీనివాస్" పరిచయం చేసుకుంటూ చేయి చాపాను.

"వరప్రసాద్. షీ ఈజ్‌మై వైఫ్ డాక్టర్ హేమలత" పరిచయం చేశాడు. ప్రతి నమస్కారం చేశాను.

"చెప్పుకోడానికి కాస్త మొహమాటం కదండి. కథలు రాస్తుంటారు. కొన్ని అవార్డ్సు కూడా వచ్చాయి అప్పుడప్పుడూ ఉమన్ ఓరియంటెడ్ ఎస్సేస్ కూడా రాస్తుంటారు. అందుకే ఆ యాంగ్జటీ.." అంది రమ నా గురించి.

"ఐ లైకిట్. సృష్టికి ప్రతి సృష్టి చేసే విశ్వామిత్రులన్నమాట" అన్నాడు చిరునవ్వుతో నా భుజం మీద చేయివేసి, పక్కనే కూర్చుంటూ. మేడం డాక్టర్ గారి పక్కన కూర్చుంది.

"ఇంతకూ, బాబుకు పేరెందుకు పెట్టలేదో చెప్పనే లేదు" అడిగాను డాక్టర్‌గారంత చొరవ చూపడంతో.

డాక్టర్ కానీ, వారి మిస్సెస్‌గానీ వెంటనే మాట్లాడలేదు. కొద్ది నిమిషాలు నిశ్శబ్దంగా ఉండి పోయారు. లవ్‌లీగావున్న వాతావరణమంతా ఒక్కసారే గంభీరంగా మారి పోయింది.

"చెప్పకూడందైతే వద్దులెండి" అన్నాను వారు సందేహిస్తుంటే.

"అదేం లేదు. మొదటి బాబుకు పేరు పెట్టాం. వీడికి పెట్టొద్దనుకున్నాం. గిఫ్ట్ అని పిలుస్తాం"

"స్కూల్లో అదే పేరు ఎక్కిస్తారా? సతీషనో, హరీషనో పెడతారుగా" అన్నాను.

"వీడు స్కూలు దాకా వెళ్లక పోవచ్చు. ఐదేళ్ల లోపే చనిపోతాడు" అన్నాడు కూల్‌గా.

"అయ్యో! అదేంటి సార్? ఇంతమంచి బాబు చనిపోతాడా?" నేనూ మా ఆవిడ ఒకేసారి అన్నాం. మా అందరి ముఖాలూ వివర్ణమయ్యాయి. బాధ, జాలితో సింపతీగా మారిపోయాం.

"తప్పకుండా చనిపోతాడు. ఎందుకంటే వాడికొచ్చిన జబ్బులాంటిది'

"ఏం జబ్బండి. బ్లడ్ కేన్సరా?" అన్నాను.

"అదైనా, అమెరికా దాకా వెళ్లి నయం చేయించేవాళ్లం. యైటీ పర్సంటేజ్ దాకా కేన్సర్ కేసులు సక్సస్ అవుతున్నాయి. కాని అంతకంటే భయంకరమైన జబ్బు"

"ఏంటండి అంత పెద్ద జబ్బు" మా అందరిలోనూ ఉత్కంఠ

"ఎ.. యి.. డ్స్"

వేమందరం ఒక్కసారే, బాంబు మీద కూర్చున్నట్లు ఉలిక్కిపడ్డాం. గబాల్న బాబును డాక్టర్‌గారికందించాను భయంతో.

కామ్‌గా బాబునందుకున్నాడు. విరక్తిగా పెదాలపై ఓ చిరునవ్వు, విరిసీ విరియనట్లుగా మెరిసింది.

"ఇంత చిన్న బాబుకు ఎయిడ్స్ వచ్చిందంటే నమ్మలేక పోతున్నాం" అన్నాను కళ్లు విశాలం చేస్తూ.

"మీరే కాదు. మొదట మేమూ నమ్మలేదు. కాని నిజం"

"బాబు తల్లిదండ్రులు మీరు కాదనుకుంటా?" అన్నాడు శివ.

మా రమకు బి.ఇడి., క్లాస్‌మేట్. శివ ఆహ్వానం పైనే మేం ఫ్యామిలీతో వైజాగ్ టూర్ ప్లాన్ చేశాం. శివ వాళ్లది పెందుర్తి. టౌన్‌లో కలిసే ఉంటది.

"తెలీదు. గవర్నమెంట్ హాస్పిటల్‌లో డెలివరీ అయి, ఎయిడ్స్ అని తెలిశాక వదిలేసి వెళ్లి పోయిందట తల్లి. ఇంచార్జ్ డాక్టర్ చారుమతి హెల్త్‌కేర్ సెంటర్‌కు అప్పజెప్పారు. అక్కడ్నించి తెచ్చుకున్నాం"

"అంటే, మీరు పాజిటివ్ అని తెలిసే తెచ్చుకున్నారా? లేక కొంత కాలం తర్వాత తెలిసిందా?"

"తెలిసే, కావాలనే తెచ్చుకున్నాం. అంతా హెచ్.ఐ.వి. పాజిటివ్ కేసులున్న పిల్లలే ఉంటారు ఆ సంస్థలో.

"సారీ డాక్టర్. మీరేమనుకోవద్దేం. నాకంత కన్‌ఫ్యూజన్‌గా ఉంది. పిల్లల్లేక తెచ్చుకున్నారా? అలాగైతే హెల్దీ బేబీనే తెచ్చుకుంటారు గదా. ఒకవేళ పిల్లలుండి తెచ్చుకున్నారంటే, ఏదో పెద్ద మోటోనే ఉంటది. మీ స్నేహితుడు కం స్నేహితురాలి కొడుకో... లేక బంధువులబ్బాయో.." అన్నాను నా రచయిత బుర్రతో విశ్లేషించి.

"సారీ డాక్టర్. మీరేమనుకోవద్దేం. నాకంతా కన్‌ఫ్యూజన్‌గా ఉంది. పిల్లల్లేక తెచ్చుకున్నారా? అలాగైతే హెల్దీ బేబీనే తెచ్చుకుంటారు గదా. ఒకవేళ పిల్లలుండి తెచ్చుకున్నారంటే, ఏదో పెద్ద మోటోనే ఉంటది. మీ స్నేహితుడు కం స్నేహితురాలి కొడుకో... లేక బంధువులబ్బాయో.." అన్నాను నా రచయిత బుర్రతో విశ్లేషించి.

హాయిగా నవ్వేస్తూ, "అలాంటిదేం లేదు. ఒక ఎయిడ్స్ వచ్చిన బాబును, చనిపోయేదాకా మేం పెంచాలనే కోరిక. అంతే"

"అదే ఎందుకు? మీకు పిల్లల్లేకా? జాలితోనా? ఇంకేదైనా మోటో ఉందా?"

"చెప్పడం మాకు పెద్ద అభ్యంతరం కూడా ఏమీ లేదనుకోండి. రచయితలంటున్నారుగదా. మీకేమైనా పనికొస్తుందేమో. వినండి" అంటూ డాక్టర్ హేమలత గారు నోరు విప్పారు.

వైజాగ్‌లోనే, మేం ప్రాక్టీసు పెట్టి ముప్పయ్యేళ్లవుతోంది. హేమా క్లినికని త్రీ స్టేర్‌బిల్డింగ్. హండ్రెడ్ బెడ్సు. నా పేరు మీదే ఉంది హాస్పిటల్. మా పిల్లలిద్దరూ డాక్టర్లై అమెరికాలో స్థిరపడ్డారు.

రెండేళ్లకో, మూడేళ్లకో వస్తుంటారు. వచ్చిన కాడ్నించి, అమెరికన్ ఫుడ్ తప్ప మన ఫుడ్ తినరు. నాకేమో మన వంటలన్నీ చేసి, తృప్తిగా పెట్టాలని. వీరికేమో పిల్లలతో బాగా ఆడుకోవాలని. కాని కాంప్లికేషన్స్ అంటారు, కడుపు నొప్పంటారు. దెబ్బలు తగులుతాయంటారు. వచ్చినంత వేగంగా వెళ్లిపోతుంటారు. మాకు చాలా అసంతృప్తిగా అనీజీగా ఉంటుండేది. మా పిల్లలు చిన్నగా ఉన్నప్పుడు చేయాల్సినంత ఎంజాయ్ చేయలేదు వాళ్లతో. ప్రొఫెషన్ డెవలప్ కావాలని, ఈవెనింగ్స్ కూడా పిల్లల కోసం టైం స్పెండ్ చేసేవాళ్లం గాదు. ఆయాకు అప్పజెప్పి, ఎప్పుడూ క్లినిక్‌లోనే కూర్చుండి పోయేవాళ్లం. అందుకే కాబోలు, మాతో ఎక్కువ ఎటాచ్‌మెంట్ లేదు. దూరపు ఫ్రెండ్‌తో బిహేవ్ చేసినట్లు, ఫోన్‌లో మాట్లాడుతుంటారు. వాళ్లపిల్లలన్నా ఇక్కడ వదిలేసి పొమ్మంటే, 'అమ్మో ఇండియా లోనా? అసలువాడ్ని వదిలిపెట్టి వాళ్ల మమ్మీ ఒక్కరోజు కూడా ఉండలేదు' అంటారు. 'మరి వేం ఎలా ఉండగలుగుతున్నామురా?' అనాలనిపించేది. కాని వాళ్లు బాధపడతారని అనేవాళ్లం గాదు. ఇప్పుడు మాకు చిన్నపిల్లలుంటే ఎంత బాగుండు. అమ్మా.... అమ్మా.... అని కొంగుపట్టుకుని తిరుగుతుంటే, ఎత్తుకొని ముద్దు పెట్టుకోవాలని నా కోరిక. క్లినిక్ టేబుల్ మీద కూర్చుబెట్టుకుంటే, మెళ్లో స్టెత్ లాగుతుంటే నవ్వుకోవాలని వీరి కోరిక. ఒక బాబును తెచ్చుకుంటే మన సరదా తీరిపోద్ది గదా. వాడ్నీ మనలాగే డాక్టర్ చేయొచ్చు' అనుకున్నాం. వెంటనే మా పి ఆర్ ఓ కు చెప్పాం. సొసైటీలో హానరబుల్ మెంబర్స్‌మి కాబట్టి, ఎవరూ అభ్యంతరం పెట్టలేదు. పైగా అప్రిషియేట్ చేశారు. అడాప్షన్ సెంటర్ నుంచి బాబును తెచ్చుకోవాలనుకున్నాం. ఏర్పాట్లన్నీ చకచకా పూర్తయ్యాయి. ఓ సండే బాబు కోసం వెళ్లాం. ముందే చెప్పున్నాం కనుక రెండేళ్ల వయసున్న పన్నెండు మంది పిల్లల్ని చూపించింది హౌస్ మేడం. ఒక బాబు మా ఇద్దరికీ బాగా నచ్చాడు. ఆ మూతి, ముక్కు, కండ్లు అచ్చం మా పెదబాబులా ఉన్నాడు. ఆ పిల్లవాడు కావాలని అడిగాం.

**ఒక బాబును తెచ్చుకుంటే మన సరదా తీరిపోద్ది గదా. వాడ్నీ మనలాగే డాక్టర్ చేయొచ్చు' అనుకున్నాం. వెంటనే మా పి ఆర్ ఓ కు చెప్పాం. సొసైటీలో హానరబుల్ మెంబర్స్‌మి కాబట్టి, ఎవరూ అభ్యంతరం పెట్టలేదు. పైగా అప్రిషియేట్ చేశారు. అడాప్షన్ సెంటర్ నుంచి బాబును తెచ్చుకోవాలనుకున్నాం.**

"ఎంత విచిత్రం మేడం. నిన్నటివరకూ అనాధ అనుకున్న సంజయ్, ఇప్పుడొకేసారి కోటీశ్వరుడయ్యాడు. మీ ప్రేమని, తన స్వంతం చేసుకోబోతున్నాడు. బెసాప్ లక్ మేడం" అని మాకు విషెస్ చెప్పింది మృణాళిని. బాబును కారులో తీసుకుని ఇంటికొచ్చాం" అంతవరకూ చెప్పి, మంచినీళ్లకన్నట్లు ఆగింది. బుట్టలోని వాటర్ బాటిల్ అమ్మాయందించగా, తాగసాగింది.

మిగతా సగం నేను చెబుతాను అంటూ డాక్టర్ ప్రసాద్ గారు చెప్పడం మొదలు పెట్టారు.

"మా క్లినిక్‌లో ఒక యం.డి, మరో యం.యస్, లేడీ గైనకాలజిస్టు పనిచేస్తున్నారు మేం కాక. సరిపోను సంపాదించుకున్నాం. కనుక డాక్టర్స్‌మీద వదిలేసి, ఎక్కువ టైం బాబుతోనూ, టూర్స్ చేస్తూనూ గడపసాగాం.

మేం ఎలా ఊహించుకున్నామో, అచ్చం వాడిలాగే బిహేవ్ చేసేవాడు. ఎత్తుకుంటే నా కళ్లజోడు, వాళ్ల మమ్మీ ముక్కు పుడక లాగుతుండేవాడు. వేల రూపాయల బొమ్మలు కొనుక్కొచ్చి, వాడి రూం నిండా నింపేశాం. వాడి ఆటలు, మాటలు, నడకలు, నవ్వులు ఫోటోల రూపంలోనూ, సి.డి.ల రూపంలోనూ భద్రపరుచుకున్నాం.

ఏమైందో తెలీదు. ఒకరోజు సడన్‌గా మోషన్స్ స్టార్టయ్యాయి. ఎన్ని టేబెట్లు వేసినా తగ్గలేదు. రింగర్ లాక్టెట్ సెలైన్ పెట్టాల్సి వచ్చింది. మూడు రాత్రులు మా కంటి మీద కునుకు లేదు.

నాలుగో రోజు డాక్టర్ శేషు అన్నాడు మెల్లగా. "మీరేమనుకోనంటే, ఓ సారి హెచ్.ఐ.వి. టెస్ట్ చేయడం మంచిది సార్" అని.

నాకెంత కోపమొచ్చిందంటే, డాక్టర్ దౌడ మీద ఒక్కటి వేయాలనిపించింది. "మేము ఫూల్స్‌లా కనబడుతున్నామా? హెల్త్ బేబీనే కోరి తెచ్చుకున్నాం. తను కూడా మాకు ఫ్యామిలీ ఫ్రెండ్. మమ్మల్ని మోసం చేయదు" అన్నాను డాక్టర్ వైపు చీత్కారంగా చూస్తూ.

"సింటమ్స్ అలాగే కనబడుతున్నాయి సార్. మీ ఇష్టం" అనేసి వెళ్లిపోయాడు. హి ఈజ్ గోల్డ్ మెడలిస్ట్ ఇన్ పి.జి.

"అన్ని టెస్ట్‌లు చేశాం గదండీ. ఆ ఒక్కటి చేస్తే, డౌటు కూడా తీరుద్ది" అంది తను.

"హేమా. వాడి శరీరంలో నీడిల్ కుచ్చుతుంటే నేను భరించలేను. ఇప్పటికే, వాడి నరాల్లోకి మెడిసిన్ పంపిస్తూ, ఎన్ని చిత్ర హింసలు పెడుతున్నాం?" అన్నాను ఉద్వేగంగా.

"డాక్టర్స్‌గా మనం ఎమోషన్ కాకూడదండి" అని ఓదార్చింది.

నేనక్కడ ఉండలేక, టెర్రస్ ఎక్కి, వెలిగిపోతున్న పట్టణాన్ని చూడసాగాను. టెన్షన్ తట్టుకోలేక సిగరెట్ వెలిగించి, ఎత్తుగా కనబడుతున్న ఆలయ గోపురం వైపుకు చూస్తూ, మనసులో భగవంతుని ప్రార్థించాను.

"దేవుడా... నా బాబుకు హెచ్ ఐ వి పాజిటివ్ రానీయకు. అది కాకుంటె ఏ డిసీజయినా, నేను బ్రతికించుకుంటా. ప్రాక్టీసు కొత్తగా స్టార్ట్ చేసినప్పుడు కూడా నిన్ను ఏమీ కోరుకోలేదు. మేమిద్దరము వృత్తిపట్ల డెడికేషన్ ఉన్నవాళ్లమే. తప్పక మేం క్లిక్కవుతామని నమ్మకముంది" అని మనసులో కోరుకున్నాను.

పావుగంట తర్వాత నర్స్ వచ్చి, "మేడం రమ్మంటుంది సార్" అని చెప్పింది.

నా కెందుకో వెళ్లాలనిపించలా. నా మనసు మూలలో ఏదో అనుమానం. నెగిటివ్ అయితే, తనే వచ్చి చెప్పేది. తన మనసు నాకు

బాగా తెలుసు. మనసంతా గాయం ముద్దగా మారిపోగా, చాలా సేపటికి మెల్లగా వెళ్లాను. దుర్వార్త వినాల్సొస్తుందేమోనని భయపడసాగాను.

నా రూంలోకి ఎంటరవుతున్నాను. కూర్చున్న హేమ అమాంతం లేచి వచ్చి, నన్ను గట్టిగా వాటేసుకుని పెద్దగా ఏడ్చింది. నాకర్థమైంది. నేనూ కన్నీరు పెట్టుకున్నాను.

"మన బాబుకు పాజిటివ్ ఏమిటండీ. అయ్యో దేవుడా? మా కెందుకీ శిక్ష విధించావయ్యా" అని తలబాదుకుంటూ బల్లమీద కూలబడింది. నేనూ ఏడుస్తూ, ఆమెను ఓదార్చ సాగాను.

వాడు దూరమయ్యాక కొన్ని నెల్లపాటు మేం మనుషులం కాలేక పోయాం. మాలో ఏదో అపరాధ భావం. ఉదయం తోటకు వెళ్లి మొక్కల్ని చూడ్డంలోనూ, సాయంత్రం గుడికి వెళ్లి గంటలకొద్దీ గడపటంలోనూ కాలం వెళ్లబుచ్చ సాగాం.

మరుసటిరోజు బ్లడ్ శాంపిల్స్, కన్ఫర్మేషన్ కోసం హైద్రాబాద్ లేబ్‌కు పంపాము. అక్కడా పాజిటివ్ రిజల్టే వచ్చింది.

మహా అయితే, ఇంకో ఏడాదో, రెండేళ్లో. అంతకంటే ఎక్కువ బ్రతకడు. చనిపోతాడని తల్లిదండ్రులకు ముందే తెలీడం ఎంత నరకం?

ఫారిన్ నుంచి తెప్పించిన మెడిసిన్స్ వాడుతూ, మంచి డైట్ ఇస్తూ, మూడేళ్లు కాపాడుకోగలిగాం.

ఒక ఉదయం వాడికి ఎంతకూ తెల్లారలేదు. అమ్మా అనే పిలుపు ఆగిపోయింది.

వాడు దూరమయ్యాక కొన్ని నెల్లపాటు మేం మనుషులం కాలేక పోయాం. మాలో ఏదో అపరాధ భావం. ఉదయం తోటకు వెళ్లి మొక్కల్ని చూడ్డంలోనూ, సాయంత్రం గుడికి వెళ్లి గంటలకొద్దీ గడపటంలోనూ కాలం వెళ్లబుచ్చ సాగాం.

"ఇలా జరిగిందేమిటి హేమా. భగవంతుడికి మనం బాబును పెంచుకోవడం ఇష్టం లేనట్లుంది" అన్నాను గుడిమెట్ల మీద కూర్చుంటూ.

"నేనలా అనుకోవడం లేదండీ. అక్కడున్నా సంజు ఉండకపోను. తనను తీసుకుపోయే ముందు, లోకంలోని ఆనందాల్ని, తల్లిదండ్రుల ప్రేమను చూపించాలనుకుని మన దగ్గరకు పంపించాడు అనుకుంటున్నాను. లేకుంటే, డాక్టర్స్ టెస్ట్ చేయకుండానే హెల్త్ రిపోర్ట్ ఇవ్వడమేంటి? వాడ్నే మనం తెచ్చుకోడమేంటి చిత్రం కాకుంటే." అంది ఫిలాసఫికల్‌గా.

నాకందుకే హేమ నచ్చుద్ది. నెగిటివ్ యాస్‌పెక్ట్‌లో ఏది జరిగినా, దాన్ని పాజిటివ్ నేచర్‌లో అప్లై చేసి చెబుతుంది. లేకుంటే నా చేతి మీద ఎన్నో కేసులు ఫెయిలయ్యాయి. శవం కాడ బంధువులు ఏడుస్తుంటే, బెడ్ రూంలో నేను కన్నీరు పెట్టుకునేవాడ్ని. నన్ను ఓదార్చి, ఎంతో ధైర్యం చెప్పేది పాజిటివ్ థింకింగ్‌తో.

నాకు సడన్‌గా ఓ ఆలోచన మెరిసింది. "నువ్వన్నదీ నిజమే హేమా. ఇలా బాధపడుతూ గడిపేకన్నా, మరో బాబును తెచ్చుకుంటే బాగుంటుంది గదా" అన్నాను.

"మీ ఇష్టమెప్పుడు కాదన్నానండి. ఆరోగ్యంగా ఉన్న పిల్లలు, నేడు కాకుంటే రేపైనా లోకంలోని ఆనందాల్ని అనుభవిస్తారు. కాని ఎయిడ్స్ సోకిన పిల్లలే, తల్లిదండ్రుల ప్రేమకూ ఆనందానికి నోచుకోకుండా వెళ్లిపోతారు. కాబట్టి మనం ఎయిడ్స్ సోకిన పిల్లల్నే తెచ్చి పెంచుకుందామండి" అంది.

నాకప్పుడు హేమా.... ఆకాశమంత ఎత్తు ఎదిగినట్లనిపించింది.

మరుసటిరోజే చారుమతి హెల్త్‌కేర్ సెంటర్ కెళ్లాం. ఎయిడ్స్ సోకిన ఈ బాబును తెచ్చుకున్నాం. వీడూ కొన్నాళ్లకు పోతాడు. అందుకే పేరు పెట్టడం ఇష్టం లేదు. గిఫ్ట్ అంటే, గాడ్ గిఫ్ట్‌న్నమాట. సాధారణంగా మనకు ఎవరేమన్నా కానుక లిస్తే కొంతకాలం పాటు మనతోనే ఉంటాయి. కాని, తరువాత పగిలిపోవడమో, ఎవరన్నా ఎత్తుకు పోవడమో జరుగుద్ది. శాశ్వతంగా గిఫ్ట్‌లెప్పుడూ మనతో ఉండవు. ఈ గిఫ్ట్‌ని భగవంతుడు తీసేసుకున్నాక, మరో హెచ్ ఐ వి పాజిటివ్ బాబునో, పాపనో తెచ్చుకుంటాం. ఇలా మాకు చేతనైనంత కాలం, మేం బ్రతికినంత కాలం చేద్దామనుకుంటున్నాం. అంతే గాదు! మా తదనంతరము మా హాస్పిటల్‌ను హెచ్ఐవి వారి కోసం డొనేట్ చేద్దామనుకుంటున్నాము." చెప్పడం ముగించి, సముద్రం వైపు చూడసాగాడు.

ఐదు నిమిషాలు అంతా నిశ్శబ్దం. బాబు అలసిపోయి, వాళ్లమ్మ మీద పడుకున్నాడు.

"కుష్టు రోగులకు సేవ చేసిన మదర్ థెరిస్సా గురించి, బాబా ఆమ్టే గురించి విన్నాం. కాని వారిని చూడలేదు. అదే కోవకు చెందిన మీ దంపతుల్ని ప్రత్యక్షంగా చూస్తున్నాము. మా ఈ టూర్‌లో అన్నవరం సత్యనారాయణ స్వామో, విశాఖ భద్రకాళి మాతనో జ్ఞాపకం ఉండరు. మా మనసుల మీద గాఢంగా ముద్ర వేసిన మీరు శాశ్వతంగా గుర్తుండిపోతారు." అన్నాను లేచి నిలబడుతూ.

బాబును భుజం మీద పడుకోబెట్టుకుని, తనూ లేచింది.

"సార్! వెళ్లే ముందు చిన్న రిక్వెస్టు. మీరు ఎయిడ్స్ సోకిన వారిపట్ల చూపిస్తున్న త్యాగానికి హేట్సాఫ్. మేము కూడా ఏదైనా చేస్తే బాగుంటుందనిపిస్తుంది. మమ్మల్నేం చేయమంటారు వారి కోసం" అడిగాను భక్తి భావంతో.

చిరునవ్వు నవ్వి "ఎయిడ్స్ అనగానే, మనసులో భయాన్ని, అసహ్యాన్ని నింపుకుని బాబును నాకిచ్చావు చూడు. అల్లా ఎప్పుడూ చేయకండి. వాళ్లను ఎప్పుడూ చీదరించుకోకండి. మన కుటుంబ సభ్యుల్లా, ఫ్రెండ్స్‌లా ఆదరించండి. ఇదే నేను మిమ్మల్ని కోరుకునేది. గుడ్ బై" అని షేక్‌హేండిచ్చి కారువైపు మళ్లాడు.

ఆది దంపతుల్లా సాగిపోతున్న వారి వైపు చేతులు జోడించి నిలబడ్డాము. ●

# ఒక ద్రోహి ఊరేగింపు

మౌనశ్రీ మల్లిక్

వాడు
దగాపడిన వ్యధాభరిత గీతాలను
క్షతగాత్రుల రోదనలను
సునాయాసంగా దాటుకుంటూ
వెళుతుంటాడు-
పక్కవాడి కడుపులో
ఆకలి లావాలో మరుగుతున్న పేగులవాసన
వాడి శ్వాసక్రియకు అలవాటైపోయింది-
పరాయి తనంలో రాటుదేలిన వాడిదేహం
మానవత్వపు దుస్తుల్ని విప్పి
చౌరస్తాలో నగ్నంగా వూరేగుతోంది-
వాడి మూడక్షరాల మనసు
ఎన్నిసార్లు ఆత్మహత్య చేసుకొని ఉంటుందో-
కుళ్లిపోయిన మనసు దేహానికి ఎరువుకదా!
రానీ వాడి మనసు చస్తున్న కొద్దీ
దేహం బలిష్టంగా మారుతుంది-
వాడి అంధత్వాన్ని నర్సరీ
చేసుకోవాలనుకుంటూనే
కూలింగ్ గ్లాసులు పెట్టుకొని
నిబ్బరంగా వెళుతుంటాడు-
చినిగిపోయిన స్వార్థపు నోట్లను అతికించుకొని



చెల్లుబాటు అవుతూనే ఉంటాడు-
కనీసం ఎవరి కన్నీళ్లు తాగుతున్నాడో
తెలుసుకోకుండా వాడి దాహం తీర్చుకుంటాడు-
అమానవీయ దేహంపై పట్టువస్త్రాలు కప్పి
పై మెరుగుల సౌరభాలతో తళుక్కున మెరుస్తాడు-
బరువులు వాడి జేబుల్లోంచి బ్యాంకు ఖాతాల్లోకి ప్రవహిస్తుంటాయి-
పడుకొన్న ప్రతిసారి వాడికి కనిపించేది
అనార్తుల చతిమంటలదృశ్యం-
అయినా వాడి చేతులు
టేబుల్ క్రిందకు వెళుతునేవుంటాయి-
నెలకోసారియిచ్చే రెండువందల
వృద్ధాప్యపించను కోసం రెండు యుగాల
నిరీక్షణ
ఫలాన్ని కోసుకుని చంపుకుతింటాడు-
ఆ మూడు కాళ్ల ముసలివాళ్ళు
వాడినేమి చేయలేకపోవచ్చు-
వాడి ద్రోహపు ద్రావక గాయాలు
ఎవరికీ కనిపించకపోవచ్చు-
కానీ మోసపోయివారి కన్నీళ్ళు
ఆ కిరాతకుడి నులి వెచ్చని సాయంత్రాల
గాజు గ్లాసుల్లో విషంగా మారి
వాడి ప్రాణాలను హతమారుస్తాయి-
అప్పుడు వాడికి జరిగేది అంతిమయాత్ర
కాదు!
అది ఒక నిలువెత్తు ద్రోహపు ఊరేగింపు మాత్రమే

# దగుల్బాజీ లోకం

- రుక్మాంగద రెడ్డి

హా! జీ!
ఈ దగుల్బాజీ లోకంలో-
ప్రతి ఒకడూ
ఒక దగాకోరు సిరంజీ
కుట్రలూ కుతంత్రాలతో
కుదుర్చుకుంటారు రాజీ-
ఎవడి ఒంట్లో విషం కక్కుదామా
ఎవడి ఇంట్లో వాసాలు లెక్కెడదామా
ఎక్కడ డొక్కనిండా మెక్కుదామా
ఎవణ్ణి పాతాళానికి తొక్కుదామా
ఏ చాప కిందకు నీళ్లు తెద్దామా
ఏ కాళ్ల కింద గోతులు తీద్దామా

ఎవడి కంటిలో దుమ్ము పోద్దామా
ఎవడి వొంటికి కారం రాద్దామా
ఇవే ఎత్తులు
ఇవే జిత్తులు
తేనే పూసినకత్తులు
విషం నింపిన తిత్తులు
ముందు దగా
వెనుక దగా
నిన్న దగా
నేడు దగా
బతుకంతా దగాదగా
చితిదాకా దగాదగా

గొంతుకెండిపోతున్నా
"సుజలా" అని పాడాలి
కడుపు మండిపోతున్నా
"సుఫలాం" అని పొగడాలి
ఎడారిలో వదలిపోతు
"సస్య శ్యామల" మనాలి
చీకటి భయపెడుతున్నా
"శుభ్రజ్యోత్స్నా" అనాలి
తరులు వాడిపోతున్నా
విరుల సౌరు మెచ్చాలి
రాళ్లను రతనాలనాలి
ముళ్లుకావు పూలనాలి
"తందులాలు నిండుకున్న"
సామెత పలకాలిగాని
గంజికూడ గతిలేదని
గట్టి నిజం చెప్పొద్దంటు
ఆకలి చావులు మొర్రో



అంటే దేశద్రోహివి
హక్కులు అని అరచావో
అవుతావ్ విప్లవ వాదివి
న్యాయమంటే వాదవాద
నవ్వుతారు వెర్రివాడ!
నీవుంటున్న సమాజం
నిజం, ఇదోకాననం
ఎంతమొత్తుకున్నగాని
అది అరణ్య రోదనం!!



# విశిష్ట విమర్శకుడు రా.రా

ప్రొ. వెలమల సిమ్మన్న

*"రాజీలేని మార్క్సిస్టు నిబద్ధత*
*నిర్భయమైన మానసిక తత్త్వం*
*కత్తివాదరవంటి శైలి*
*విమర్శకునికి అవసరమైన*
*విస్తృత శాస్త్ర పాండిత్యం*
*సుకుమారమైన కళాసంవేదన*
*ఉన్న విమర్శకుడు రా.రా"*

*- శ్రీ వల్లంపాటి వెంకట సుబ్బయ్య*

విమర్శకుడుగా, సమీక్షకుడుగా పత్రికా సంపాదకుడుగా, కథకుడుగా, అనువాదకుడుగా, రచయితగా, వ్యాసకర్తగా, రాచమల్లు రామచంద్రారెడ్డి గారు లబ్ధ ప్రతిష్టులు. వీరు 1922 ఫిబ్రవరి 28 న కడపజిల్లా సింహాద్రిపురం మండలం పైడిపాళెం అనే గ్రామంలో జన్మించారు. తల్లి ఆదిలక్ష్మమ్మ. తండ్రి బయపురెడ్డి. కడపజిల్లా పులివెందులలోని డిస్ట్రిక్ట్ బోర్డు హైస్కూల్లో చదువుకున్నారు. అనంతపురంలో ఇంటర్ చదివారు. తర్వాత చెన్నైలోని గాంధీ ఇంజనీరింగ్ కళాశాలలో చేరారు. ఇంజనీరింగ్ పూర్తికాలేదు. వ్యాపారం చేశారు. అందులో రాణించ లేకపోయారు.

1959లో మార్చినెల మార్క్సిస్టు సిద్ధాంత రాజకీయ మాసపత్రిక "సందేశం"లో "వ్యక్తి స్వాతంత్ర్యం – సమాజ శ్రేయస్సు" అనే పెద్ద వ్యాసం రాశారు. ఈ వ్యాసం నుంచే రాచమల్లు రామచంద్రారెడ్డి గారు రా.రా గా పేరు పొందారు. ఇలా పరిచయమై వీరు తెలుగు సాహిత్యంలో తనకంటూ ప్రత్యేకమైన విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నారు. ఆయన విమర్శనాత్మక, సృజనాత్మక రచనలు చేశారు. కథలు, అనువాదాలు, సాహిత్య వ్యాసాలు, సాహిత్యేతర వ్యాసాలు ఎన్నో రాశారు. అయితే తెలుగుసాహిత్యంలో మాత్రం ప్రధానంగా రారా.కు విమర్శకుడుగానే ఎనలేని గుర్తింపు వచ్చింది.

వీరు ఎన్నో గ్రంథాల్ని రాశారు. "అలసిన గుండెలు" (కథాసంపుటి) "బాలసాహిత్యం", "చంద్రమండలం" "శశిరేఖ", "విక్రమార్కుని విద్దారం", "అన్నం పెట్టిన చదువు", "సారస్వత వివేచన" "పద్మవ్యూహం" (నాటిక) "సమాజం కోసం" (నాటకం), "వ్యక్తి స్వాతంత్రం – సమాజశ్రేయస్సు", "రా.రా. లేఖలు", "అనువాద సమస్యలు".

**అనువాదాలు :** మాస్కో ప్రగతి ప్రచురణాలయం తరుపున మార్క్స్, ఏంగెల్స్ సంకలిత రచనలు, లెనిన్ సంకలిత రచనలు, పెట్టుబడిదారీ అర్థశాస్త్రం, గోర్కీకథలు, చెహోవ్ కథలు మొదలైనవి.

'అలసిన గుండెలు' అనే శీర్షికతో రా.రా గారు రాసిన పన్నెండు కథలు అచ్చు అయ్యాయి. అందరూ ఉపేక్షించే అంశాల్ని ఇతివృత్తంగా తీసుకుని కథలు రాశారు. ప్రతికథలోనూ కథాకథనం బాగుంది. వస్తువుకు సంబంధించి కథల్లో ఎక్కువ భాగం ఆర్థిక అంశాల్నీ, స్త్రీ సంబంధిత అంశాల్నీ ప్రధానంగా చర్చించారు ఈ కథలేకాక 'కావ్యచిత్ర' అనే పెద్ద కథ కూడా రాశారు. ఈ సంపుటిలోని కథలు 1958-60 మధ్య రాశారు. ఈ సంపుటికి ముందుమాట కొ.కు గారు రాశారు.

రా.రా గారు లేఖలు చాలావున్నాయి. ఆయన చేసిన వాదోపవాదాల్లో వుండే కఠినతనం లేఖల్లో వుండదు. లేఖల్లో అప్యాయత, ఆత్మీయత, సంయమనం కొట్టవచ్చినట్టు కన్పిస్తాయి. రా.రా గారు సొదుం గోవిందరెడ్డి, కేతువిశ్వనాథరెడ్డి, రామ్మోహన్, రామప్ప, చెన్నారెడ్డి, గజ్జలమల్లారెడ్డి, కె.వి. రమణారెడ్డి, మొదలైన వారికి లేఖలు రాశారు.

వీరు అనువాదంలో దిట్ట. మాస్కోలో వుంటూ ఎన్నో సోవియట్ పుస్తకాల్ని ప్రగతి ప్రచురణాలయం కోసం అనువదించారు. అనువాదంపై ఆయన రాసిన 'అనువాద సమస్యలు' అనే పుస్తకానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. అనువాదకుడు మూల రచన యొక్క అర్థాన్ని, తాత్పర్యాన్ని శ్రద్ధగా గమనించి మూల రచయిత భావాల్ని నిర్దుష్టంగా, సమగ్రంగా గ్రహించి, ఆ భావాల్ని అత్యుత్తమంగా వ్యక్తం చేయగల పదాల్లో తెలియజేయాలి అప్పుడే అది మంచి అనువాదం అవుతుందని రా.రా గారు అన్నారు.

కొత్త పదాల్ని సృష్టించడాన్ని రా.రా గారు సమర్థిస్తారు. అంతేకాదు కొత్త పదాల్ని సృష్టించడం అనువాదకుల బాధ్యత అని కూడా అంటారు. కొత్త పదాల్ని ప్రయోగించేటప్పుడు ఆ నుడికారాల్ని బ్రాకెట్లలో కానీ, పాద వివరణల ద్వారా కానీ వివరించాలి. లేదా పుస్తకం చివరలో వాటన్నింటినీ ఒకేచోట పదకోశం రూపంలో తెలపాలి అని సూచిస్తూ పదాలు గతంలో లేని అర్థాలు సంతరించుకుంటాయని వివరిస్తూ రా.రా. విప్లవం, అభ్యుదయం, ఉద్యమం, అలీన అనే పదాల్ని గతంలో లేని అర్థంలో వాడుతున్నారనీ నగరమంటే సిటీ అనీ, పట్టణం అంటే టౌన్ అనీ వేరు వేరు అర్థాల్లో వాడుతున్నామనీ కనుక కొత్త నుడికారాల్ని సృష్టించుకోవడమూ పాతవాటిని కొత్త అర్థాల్లో

వుపయోగించడమూ భాషాభివృద్ధికి అవసరమని రా.రా. గారు అభిప్రాయపడ్డారు. ఏ భాష నుంచి మరే భాషలోకైనా అనువాదం కష్టమైందేనని రా.రా గారు పేర్కొన్నారు.

1959-63 మధ్యకాలంలో రా.రా గారు 'సవ్యసాచి', 'సంవేదన', పత్రికలు నడిపారు. 'సవ్యసాచి' కీ 'సంవేదన' కూ చాలా తేడా వుంది 'సవ్యసాచి' రాజకీయ సాంస్కృతిక పక్షపత్రిక. 'సంవేదన' సాహిత్య త్రైమాసపత్రిక. 'సవ్యసాచి' ఖర్చు కడపజిల్లా కమ్యూనిస్టు పార్టీ భరిస్తే, 'సంవేదన' ఖర్చు యుగ సాహితి అనే సాహిత్య సంస్థ భరించేది. ఆ.వి.ఆర్, కొ.కు మొదలైనవారి వ్యాసాలు ఇందులో ముద్రించబడ్డాయి.



మార్క్సు వాదంలో ఆరితేరిన వారు రా.రా. గారు. మార్క్సు వాదాన్ని తెలుగు సాహిత్యానికి అన్వయించడానికి తన ప్రతిభా ప్రజ్ఞా పాటవాల్ని వుపయోగించారు. సాహిత్యానికున్న శక్తిని సమాజాన్ని మార్చే శక్తిని రా.రా గారు విశ్లేషించారు.

మార్క్సు వాదంలో ఆరితేరిన వారు రా.రా. గారు. మార్క్సు వాదాన్ని తెలుగు సాహిత్యానికి అన్వయించడానికి తన ప్రతిభా ప్రజ్ఞా పాటవాల్ని వుపయోగించారు. సాహిత్యానికున్న శక్తిని సమాజాన్ని మార్చే శక్తిని రా.రా గారు విశ్లేషించారు.

సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు రా.రా. విమర్శనారంగంలో నిజాయితీ, నిష్పక్ష పాతానికీ సూటిదనానికీ, నిర్మొగమాటానికీ పెట్టింది పేరు వీరు. ఆయన చేసిన విమర్శలు చాలా కఠినంగా వుంటాయి. సమీక్షల్లోనూ, విమర్శల్లోనూ రా.రా చండశాసనుడు. అలాగని పక్షపాతంతో చేసినవి కావు. తానునమ్మిన సిద్ధాంతాల్ని తు.చా తప్పకుండా అన్వయించేసి మరీ రాస్తారు. ఈ భావజాలం నుండే ఆయన సమీక్షలు విమర్శలు వచ్చాయి.

సమీక్షల్ని, విమర్శ స్థాయికి తీసికెళ్ళిన ఘనత రా.రా. గారికి దక్కుతుంది. చాలామంది సమీక్షవేరు. విమర్శవేరు అని వాదిస్తారు. పుస్తక సమీక్షలు అన్నీ ఇంచుమించు పాఠకులకు పరిచయం చేసినవిగా వున్నాయి. పుస్తకాన్ని శాస్త్రీయంగా, నిష్పాక్షికంగా, లోతుగా, నిశితంగా విమర్శించడం లేదని ఒక అపవాదు వుంది. దీన్ని గమనించిన రా.రా గారు పుస్తక సమీక్షలో తనదైన శైలిలో విమర్శలు చేశారు. అవే గొప్ప విమర్శకులుగా పేరు ప్రఖ్యాతలు తెచ్చి పెట్టాయి.

వీరి విమర్శలో వ్యక్తిగతం వుండదు. అంతా సాహిత్యానికి సంబంధించినదే వుంటుంది. సాహిత్యేతర విషయాల్ని ఆయన విమర్శలోకి తీసుకోరు "ఒక రచనను విమర్శించేటప్పుడు ఆ రచయిత రాసిన ఇతర రచనలనూ ప్రస్తావించవచ్చు. ఆ రచయిత సాహిత్య జీవితమంతటినీ ప్రస్తావించవచ్చు. అందులో అన్యాయమేమి లేదు. కానీ అతని సాహిత్యేతర జీవితాన్ని ప్రస్తావిస్తే అది అక్రమమై వ్యక్తిగత విమర్శ అవుతుంది" అని అన్నారు.

విమర్శ మేధోవ్యాపారం మాత్రమే కాదంటూ, సాహిత్యాన్ని ముందు హృదయంతో ఆస్వాదించి, తర్వాత మేధస్సుతో పరిశీలించిన వాడే ఉత్తమ విమర్శకుడౌతాడని నొక్కి వాక్కాణించారు.

రా.రా గారు నవలలు, కథలు, కవిత్వం, సాహిత్యకారుల గురించి వ్యక్తం చేసిన అభిప్రాయాల్ని విమర్శనాత్మక దృక్పథంలో పరిశీలిస్తే విమర్శకుడుగా తెలుగు సాహిత్యంలో రా.రా స్థానం ఏమిటో నిర్ధారించవచ్చు.

మహీధర రామ్మోహన రావుగారి "ఎవరికోసం," "కొల్లాయి గట్టితేనేమి", "స్వయంవరణం" అనే నవలల్ని రా.రా గారు సమీక్షించారు. 'ఎవరికోసం' నవలను నడపటంలో రచయిత మంచి నేర్పు కనపరిచారని రా.రా గారు అభిప్రాయపడ్డారు. అంతేకాక సాంఘిక, ధార్మికాది భిన్నశక్తుల మధ్య జరిగే ఘర్షణను పాత్రల హృదయాల్లోని అంతర్మథనంగా చిత్రించిన మొట్టమొదటి నవల అని ప్రశంసించారు. ఈ నవలలోని కొన్ని లోపాల్ని కూడా విపులీకరించారు. "శిల్పంలో దుష్కరమైన పద్ధతి అవలంభిండం వల్ల పాత్రల మధ్య తాత్విక చింతన స్వీయ మనః పరిశీలన కొరవడి, పాఠకుల్ని మెప్పించలేకపోయిందని సమస్యల ప్రాధాన్యం వల్ల పాత్రల ప్రాముఖ్యం తగ్గిందని సమస్యల విస్తృతికి తగినట్టు సన్నివేశాలు కూడా పెరిగివుంటే బాగుండేది" అని రా.రా గారు లోపాల్ని ఎత్తిచూపారు.

రా.రా గారు పుస్తక సమీక్షలు ఎన్నో చేశారు. సమీక్షల స్థాయిని పెంచారు. అవి విమర్శనాత్మక వ్యాసాలుగా తయారయినాయి. ఉదాహరణకు "కొల్లాయి గట్టితేనేమి' నవలపై రా.రా గారు విస్తృతమైన సమీక్ష చేశారు. చారిత్రక నవల లక్షణాల్ని దృష్టిలో పెట్టుకొని ఈ నవలను వివేచన చేశారు. ఈ నవలా సమీక్షలో రా.రా గారు జీవితానికీ సాహిత్యానికి మధ్యవుండే సంబంధాన్ని సైద్ధాంతికంగా విపులీకరించారు. ప్రపంచ ప్రసిద్ధ సౌందర్య శాస్త్రవేత్త గియోర్గిలూకాచ్ భావనల ఆధారంగా ఈ నవలను సమీక్షించానని పేర్కొన్నారు.

'స్వయంవరణం' ఫ్యూడల్ భావాలపై తిరస్కరణను వివరించిన నవల. ఇందులో రచయిత చెప్పిన తిరుగుబాటు ప్రబోధంలో కొత్తదనం వుందని రా.రా అభిప్రాయపడ్డారు.

రా.వి శాస్త్రి రాసిన 'రాజు-మహిషి' నవలలో ముఖ్యంగా మితిమీరిన వర్ణనలు వుండటం ప్రధాన లోపంగా పేర్కొన్నారు. నవలలో ఇతివృత్తానికి కట్టుబడి అందులోని అంగాలు వుండాలని రా.రా అన్నారు.

సప్తపది (రేడియో నవలిక)లో ఏడుగురు స్త్రీ రచయితలు రాసిన నవలికలు వున్నాయి. కనపర్తి వరలక్ష్మమ్మ, శ్రీదేవి, మాలతీ చందూర్, దుర్గాకుమారి, ఇల్లిందుల సరస్వతీదేవి, కె. రామలక్ష్మి, పి. సరళాదేవి గార్లు. ఈ నవలికల్ని వీరు సమీక్షించారు. "ఎంత ఉదారంగా చూసినా, ఎంత అబలాపక్షపాతంతో చూసిన ఇందులో సాహిత్య లక్షణాలు ఎక్కడా కనిపించవని అన్నారు. పాత్రల్లోనూ, సన్నివేశాల్లోనూ పరస్పర సంబంధంకాని, సహజత్వం కాని లేవని రకరకాల రంగులూ, రకరకాల సైజులూ గల పాతచీరలు చించుకొచ్చి అవసరానికి అర్జంటుగా తయారుచేసిన అతుకుల బొంతగా కనిపిస్తుందేకాని రచనకాక సమ్యగ్రూపమంటూ లేదని" చాలా తీవ్రంగా విమర్శించారు.

సోదుం జయరాం గారి 'వాడిన మల్లెలు' కథాసంపుటిని సమీక్ష చేశారు రా.రా గారు. శిల్ప పరంగా, వస్తుపరంగా ఈ కథల్ని మంచి కథలుగా ప్రశంసించారు. జయరాం కథల్లో "ప్రగతి శీలమైన సామాజిక దృష్టి, సంయమన శీలమైన శిల్పశక్తీ, వున్నాయని అనుభూతి సంపద లోపించినా ఆయనలోని సామాజిక దృష్టి పాఠకుల్ని ఉత్తేజ పరుస్తుందని, భ్రమలతోనూ మానసికంగా నీరసించి పోయిన మధ్య తరగతి జీవులకు మంచి షాక్ ట్రీట్‌మెంట్ కథలు అని" రా.రా పేర్కొన్నారు.

కుప్పిరెడ్డి పద్మనాభరెడ్డి గారి కథలు సంపుటి "కుట్రకు

సమీక్ష రాశారు. ఈ కథలు సీరియస్‌గా కన్పించవు కాని వీటికి జీవితపు స్పర్శవుందని అన్నారు. కథల గురించి రాసిన ఆఖరి వ్యాసం "చాసోరచనాతత్త్వం" చాసోసప్తతి పూర్తి సాహితీ సంచిక (1985)లో ప్రచురించబడింది. చాసోను ఉత్తమ కథకులుగా రా.రా గారు భావించారు.

చలం సాహిత్యంపై చాలా చాలా విమర్శలు వున్నాయి. డాక్టర్ నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు గారు "చలంశ్మశాన సాహిత్యం" అనే గ్రంథంలో తీవ్రంగా విరుచుకుపడ్డారు. చలంపై విమర్శలు చేస్తూ రావుగారు ఎలా తప్పుతోవపట్టారో రా.రా గారు వివరించారు. అలాగని చలం లోపాల్ని రా.రా గారు చెప్పలేదని కాదు. చలంలోని లోపాల్ని వున్నవి వున్నట్లు రా.రా గారు తెలియజేశారు. "చలం దృష్టిలోని లోపంయేమిటంటే ప్రేమను, ప్రేమ వివాహాలను సమర్థించడంతో ఆయన ఆగలేదు ప్రేమలేని వివాహాలు విచ్ఛిన్నం కావలసిందే అని ఉద్ఘాటించడంతో ఆయన ఆగలేదు. స్త్రీలు లేచిపోవడాన్ని సమర్థించడంతో ఆయన ఆగలేదు. స్త్రీ పురుషుల మధ్య శరీరాకర్షణకు ఆయన విపరీతమైన అలౌకికమైన విలువయిచ్చి, దానినొక మతంగా ప్రచారం చేసినాడు. మైదానం లాంటి కథల్లో జరిగిందదే. మరి కొన్ని చోట్ల ఈ ఆకర్షణచుంబనా లింగనాదుల వర్ణనతో కలిసి బూతు సాహిత్యపు అంచుల దాకా వెళ్ళింది" అని అభిప్రాయపడ్డారు. రా.రా గారు విమర్శలో తన పర అనే భేదాలు వుండవు. విమర్శ విమర్శే. వ్యక్తిగతం వ్యక్తిగతమే. అదే ఆయన విమర్శలోని ప్రత్యేకత విశిష్టత కూడా.



చలంను రా.రా గారు ఎంతో ఉన్నతంగా భావించి "మహాను భావుడు చలం" అనే వ్యాసం రాశారు. ఇందులో చలం గారిని కొత్త చైతన్యం గల వాడుగా కొనియాడారు.

మరో దగ్గర చలంను రా.రా గారు ఎంతో ఉన్నతంగా భావించి "మహానుభావుడు చలం" అనే వ్యాసం రాశారు. ఇందులో చలం గారిని కొత్త చైతన్యం గల వాడుగా కొనియాడాడు. మరోసారి చలంలోని లోపాల్ని ఎత్తి చూపుతూ పాత్రల్లో రచయిత ప్రవేశించి ఉపన్యాస ధోరణిలో మాట్లాడటం చలంలోని ప్రధాన లోపం అని రా.రా గారు అంటారు.

గురజాడ అంటే రా.రా గారికి మక్కువ ఎక్కువ. ఆయన గ్రంథాలన్నీ ఆధునిక భావాలతో కూడుకున్నవని తెలియజేశారు. కె.వి. రమణారెడ్డి గారు గురజాడపై రాసిన "మహోదయం"ను 'విజ్ఞాన సరస్వస్యం' గా కొనియాడారు. గురజాడ మీద సమగ్రమైన జీవితకథ లేని లోటు ఈ 'మహోదయం'తో తీరుతుందని అభిప్రాయపడ్డారు. ఇందులో రమణారెడ్డి గారి శైలి బరువుగా వుందని విమర్శించారు. వ్యవహారిక భాషలో ఈ గ్రంథంలేదని అదిలోపమేనని తెలియజేశారు.

రా.రా గారు కొ.కు గురించి రెండు వ్యాసాలు రాశారు. సాహిత్య ప్రయోజనం పుస్తకానికి పరిచయం, కొ.కు సాహిత్యం ఐదో సంపుటానికి రాసిన ముందుమాట. ఈ రెండు వ్యాసాల్లో కొ.కు సాహిత్య వ్యక్తిత్వం గూర్చి రాశారు. సాహిత్యానికీ, శిల్పానికీ గల ప్రగాఢ సంబంధం గురించి కొ.కుకు స్పష్టంగా తెలుసునని, అభ్యుదయ సాహిత్యానికి ఆయన ఇన్‌స్పిరేషన్ అని, గురజాడ తర్వాత సాహిత్య ప్రయోజం గురించి స్పష్టమైన అవగాహన వున్న వాడు కొ.కు యేనని రా.రా అన్నారు.

ఆర్.యస్. సుదర్శనం రాసిన సాహిత్యంలో దృక్పథాలు' అనే విమర్శ గ్రంథానికి రా.రా గారు 'సంవేదన' సంచికలో 'మేరమీరిన మేధ' అనే పేరుతో సమీక్షించారు. ఆర్.యస్. సుదర్శనంగారు వివిధ వ్యాసాల్లో తమదృక్పథానికి అనుకూలమైన అంశాల్ని చదవడానికి ప్రయత్నం చేశారు. అంతే కాని వున్నదున్నట్లు అధ్యయనం చేసి, విశ్లేషించడానికి ఆయన ప్రయత్నం చేయలేదని విమర్శించారు.

కవిత్వం విషయంలో కూడా రా.రా విమర్శ ఘాటుగా వుంటుంది. 'నవత' పత్రిక, కాళోజి 'జీవనగీత', వరవరరావు 'చెలినెగళ్ళు' దిగంబర కవిత్వం మూడో సంపుటి గ్రంథాల్ని రా.రా సమీక్షించారు. శ్రీశ్రీ సంపాదకుడుగా వెలువడిన 'నవత' పత్రిక గురించి రా.రా 'ఆశావహమైన నవకవితా తేజస్సు' అనే పేరుతో సమీక్ష చేశారు. ఈ సమీక్షలో స్థూలంగా "కవిత్వంలో అనుభూతి ప్రాధాన్యత వుండాలని అలంకారాలు శబ్దాలు ఇత్యాలు బాహ్య సౌందర్యాలు మాత్రమేనని, అవే కవిత్వం కావు" అని రా.రా అన్నారు 'సంవేదన' "కాళోజిగీత" అనే పేరుతో 'జీవనగీత'ను రా.రా సమీక్షించారు. ఇందులో కాళోజిని అసలు కవే కాదని అభిప్రాయపడ్డారు. అనువాదంలోని లోపాన్ని ప్రధానంగా ఎత్తిచూపారు. అనువాద లోపాన్ని, రచనలోని అకవిత్వాంశాల్ని తీవ్రంగా ఖండించారు. 'సంవేదన' మూడో సంచికలో 'చెలినెగళ్ళు' కవితాసంపుటిని 'వర్ధమాన కవి వరవరరావు' అనే పేరుతో సమీక్షించారు. కవిలో హేతు బద్ధమైన అభ్యుదయ దృక్పథం వుందనీ, కానివింతగా చెప్పాలని, అసాధారణంగా చెప్పాలనే ప్రయత్నం చేయాలనే తపన వుందని రా.రా పేర్కొన్నారు.

"దిగంబర కవిత్వం"పై రా.రా గారు తీవ్రమైన విమర్శచేశారు. దిగంబర కవిత్వం అసలు కవిత్వం కాదు అదొకపైత్యం అని అన్నారు. "కుళ్లిపోయిన ఈ సమాజం మీద, దీనికి కారణమైన రాజకీయ నాయకులమీద సామ్యవాదుల మీద, సినిమాల మీద, సినీ తారల మీద (ప్రొడ్యూసర్ల మీద కాదు) పెట్టుబడి దారుల మీద, ఇంకా ఎవరిమీదనో కోపం కన్పిస్తునే వుంది. వీళ్ళ కోసం నిప్పులు కక్కుతున్నట్లు కూడా మనకు కనబడుతుంది. కానీ వీళ్ళకు నిజంగా కోపం వుందని తెలిసినంత మాత్రాన అది కవిత్వం కాదు. ఆ కోపంలో కొంతైనా మనకు కలిగితే ఈ కుళ్ళు సమాజం మీద, ఈ కుళ్ళుకు కారణమైన వారిమీద అప్పుడు మాత్రమే అది కవిత్వం అవుతుంది. అదిలేదు కనుకనే వీళ్ళు రాసింది కవిత్వం కాలేక పోతున్నది. నిజంగానే జుగుప్స కలిగించే కవిత్వమిది. అని రా.రా గారు తీవ్రంగా ఖండించారు.

వీరు "మల్లారెడ్డి గేయాలు", "అదృష్ట దీపక్ ప్రాణం", అమ్మంగి వేణుగోపాల్ 'మిణుగురు', కవితా సంపుటులకు పీఠికలు రాశారు. ఈ పీఠికల్లో కూడా విమర్శ చోటుచేసుకుంది.

అద్దేపల్లి రామ్మోహన రావు గారు 'శ్రీ శ్రీ కవితా ప్రస్థానం' అనే గ్రంథాన్ని రాశారు. ఈ గ్రంథానికి సమీక్ష రాశారు రా.రా గారు. అద్దేపల్లి మీద ఘాటైన విమర్శచేశారు. మహాకవికి అర్థం చెప్పడం దగ్గర్నుంచి కృత్రిమ చట్టాల్ అనే దుష్ట సమాసాన్ని వాఖ్యానించడం వరకు అద్దేపల్లివి దుర్వ్యాఖ్యానాలే అని నిశితంగా విమర్శించారు. అద్దేపల్లివారి అభిప్రాయం ప్రకారం వస్తువు కాదు ముఖ్యం శిల్పం. అశిల్ప చర్చ కూడా భారతీయ కావ్యశాస్త్ర విభాగాలైన అలంకార




మహాకవి శ్రీశ్రీ శతజయంతిని తెలుగు సాహిత్యలోకం స్ఫూర్తివంతగా జరుపుకుంటోంది. సాహితీస్రవంతి రాష్ట్రవ్యాప్తంగా శతజయంతి కార్యక్రమాల ఏర్పాటుకు చొరవతీసుకుంటున్నది. తెలుగు భాషను, భావాన్ని ఒక్కసారిగా కుదుపుకు లోనుచేసిన శ్రీశ్రీ స్మరణ నిత్యం చైతన్యదాయకం. తెలుగు కవిత్వంలో పెనుమార్పును తీసుకొచ్చిన శ్రీశ్రీ కవిత్వం ఆంధ్రదేశంలో తిరుగులేని ప్రభావాన్ని చూపింది. సాహిత్యరంగంలో ఘనమైన కీర్తిశిఖరాలందుకున్న యుగకవి తన వ్యక్తిగత జీవితానికి వచ్చేటప్పటికి అంతగానూ వివాదాస్పదం అయ్యారు. శ్రీశ్రీ వ్యక్తిత్వం, సాహిత్యంపై సరైన అవగాహన పొందటంలో కొంత సంక్లిష్టత ఎదురవుతుంది. ఆ కొరతను కొంత తీరుస్తూ సాహిత్యప్రస్థానం మే నెల శ్రీశ్రీ ప్రత్యేక సంచికను తీసుకొచ్చింది. ఆ సంచికకు అనూహ్యంగా మంచి స్పందన లభించింది. రెండో ముద్రణ కూడా చేయాల్సి వచ్చింది. ఆ రెండో ముద్రణ కాపీలు కూడా అయిపోయాయి. శ్రీశ్రీపై తెలుగు ప్రజలకు గల అభిమానం మరోసారి ఈ విధంగా రుజువైంది. ఇది సాహిత్యప్రస్థానం నిర్వాహకులకు సంతోషం కలిగిస్తున్నది. ఆదరించిన శ్రేయోభిలాషులకు, శ్రీశ్రీ అభిమానులకు ధన్యవాదాలు. - సంపాదకుడు

ధ్వన్యాదులు పునాదుల మీదనే. ఇది నూటికి నూరుపాళ్లు ఆధునిక దృక్పథం కాదు. రారా గారు అక్షరాలా ఆధునికుడు. అభ్యుదయవాది. మార్క్సిస్టు విమర్శకుడు.

'శ్రీ శ్రీ తాత్త్విక చిత్త వృత్తి' అనే వ్యాసాన్ని రా రా రాశారు. శ్రీ.శ్రీ కవిత్వంలోని కొన్ని భాగాల్ని ఉటంకించి తాత్త్విక లక్షణాల్ని వ్యాఖ్యానించారు.

రా రా గారి సమీక్షల్లో మరో మంచి ఉదాహరణగా తిలక్ రాసిన 'అమృతం కురిసిన రాత్రి" దీనిపై రా.రా గారు రాసిన సమీక్ష, సమీక్షకు పెట్టిన శీర్షికే అంతా చెబుతుంది. సమీక్ష శీర్షిక "తనలో తానొక ఏకాంత సౌందర్యం రచించుకున్న స్వాప్నికుడు". ఈ గ్రంథంలో తప్పొప్పుల పట్టికలో ఇచ్చిన 100 తప్పులే కాక మరొకొన్ని తప్పులున్నాయని బాధపడుతూ రా.రా గారు గుర్తు చేస్తారు. ఈ గ్రంథంలోని లోపాన్ని నిశితంగా విశ్లేషించారు. ఈ గ్రంథ సమీక్ష సారాంశం ఏమంటే తిలక్ భావకవే కాని అభ్యుదయకవి కాదని రా.రా గారు విమర్శించారు. రా.రా గారు విశ్లేషించిన తీరులో అంతకు ముందు ఎవరూ తెలుగు సాహిత్యంలో తిలక్‌ను ఆ దృష్టితో చూడలేక పోయారు. శ్రీ శ్రీ 'ప్రజాకవి' అనీ కుందుర్తి 'అభ్యుదయ భావన వున్న కవి' అనీ వరవరరావు 'కాల్పనికోద్యమంలో సుకుమార మయిన' కవి అనీ ఇలా తిలక్‌ను పేర్కొన్నారు తప్ప ఆయనను నిక్కచ్చిగా ఎవరూ విశ్లేషించలేదు. రా.రా చేసిన విమర్శను తర్వాతి కాలంలో త్రిపురనేని మధుసూదన రావుగారు రా.రా రాసిన సమీక్ష తెలుగు సాహిత్య విమర్శలో అగ్రశ్రేణికి చెందిందని అభిప్రాయపడ్డారు.

ఆలూరి బైరాగి సంస్మరణ సంచికలో రా రా 'బైరాగి అవగాహన' వ్యాసం రాశారు. ఇందులో జీవితం గురించి బైరాగి కున్న అవగాహన భయంకరమైనదని అభిప్రాయపడ్డారు. ఆయన రాసిన కవితా ఖండికల్ని పరిశీలించారు. బైరాగి రాసిన కవి సమస్య గురించి మంచి విశ్లేషణ చేశారు. బైరాగి మీద వున్న తాత్విక సిద్ధాంతాల ప్రభావానికి కవితా రూపం ఇవ్వగలగడం బైరాగి గొప్పతనం అని విశ్లేషించారు. రా రా గారు.

రా రా కు పుట్టపర్తి నారాయణాచార్యులు అంటే ఎంతో గౌరవం. అయినా ఆయన మీద కూడా ఘాటైన వ్యాసం రాశారు. అలాగే సహచరుడూ సన్నిహితుడు అయిన వై.సి.వి రెడ్డి కవిత్వం మీద కూడా విమర్శనాత్మక వ్యాసం రాశారు. వ్యక్తిగతంగా మిత్రలైనప్పటికీ సాహిత్యం దగ్గరకు వచ్చేటప్పుడు ఎవ్వరినీ రా.రా విడిచి పెట్టలేదు. దీనికి మంచి ఉదాహరణగా కడప జిల్లా కవుల గూర్చి వివేచన చేసి చీల్చి చండాడారు.

తెలుగు విమర్శకి శాస్త్రీయ ప్రతిపత్తి కూర్చిన వారు వీరు. విమర్శని వ్యక్తిగత స్థాయి నుంచి సామాజిక స్థాయికి ఎదగడానికి చేసిన కృషిలో రా.రా గారి పాత్ర మరవలేనిది. కట్టమంచివారు ప్రారంభించిన విమర్శశాస్త్రం మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధి చెంది రా.రా గారితో తెలుగు విమర్శ పదునెక్కి వేగవంతం అయింది. వీరిలోని మరో మంచి గుణం ఏమంటే తెలియనిదాన్ని తెలియదని చెప్పడం. "మైదానం", "శశాంక"ల విషయంలో రా.రా గారు చేసిన విమర్శలోని తేడాను టి. సాంబశివరెడ్డి గారు ఎత్తి చూపించేటప్పుడు తన పొరపాటును ఒప్పుకున్నారు.

వీరు చేసిన మొత్తం విమర్శలపై అందరూ అనుకున్న విమర్శ ఒకటి సాహిత్య లోకంలో వుంది. అది ఏమంటే విమర్శ అంత ఘాటుగా వుండవలసిన అవసరం వుందా? అనేది. సూటిగా వున్నది వున్నట్లు చెప్పితే సరిపోదా? తీవ్రాతి తీవ్రంగా, అంత కఠినంగా, విమర్శ వుండాలా? అంచేతనే ప్రముఖ విమర్శకులు తాపీధర్మారావుగారు రా.రా గారి గూర్చి రాస్తూ "విమర్శకుని కర్తవ్యం అభ్యుదయ రచనలను పెంపొందించడం తప్ప ఖండించడం కాదని" తన అభిప్రాయాన్ని నిక్కచ్చిగా చెప్పారు.

ఆయన రచనల్ని దృష్టిలో వుంచుకొని రా.రా విమర్శ దృక్పథంలోని మౌలికతను, మార్క్సిస్టు విమర్శ రంగంలో ఆయన చేసిన కృషిని విశ్లేషించేటప్పుడు రా.రా విమర్శ వైశిష్ట్యాన్ని దానికున్న చారిత్రక స్థానాన్ని మనం నిర్ణయించవచ్చు.

మార్క్సిస్టు విమర్శకుడుగా రా.రా గొప్పపేరు తెచ్చుకున్నారు. అన్ని వర్గాలవారు వీరిని కొనియాడారు. ఆయన విమర్శలు చాలా తీవ్రమైనవి. కఠినమైనవి కూడా. పాఠకుల చైతన్యాన్ని ప్రగతిశీల మార్గాల వైపు మళ్లించడంలో సాహిత్యానికి గల శక్తిని గుర్తించి, అభ్యుదయ సాహిత్యం యొక్క కళాత్మక శక్తుల్ని ఉన్నత స్థాయికి చేర్చడానికి రా.రా ప్రయత్నం చేశారు. "క్రూరుడైన విమర్శకుడని" శ్రీ.శ్రీ గారు వ్యాఖ్యానించినా, తనదైన శైలిలో తాను నిర్వచించుకున్న లక్ష్యాల కోసం గొప్ప ఆత్మ విశ్వాసంలో జీవితాంతం పోరాడారు. అదే రా.రా విమర్శలోని విశిష్టత.

విమర్శ దగ్గర ఎంత కఠినంగా, చండశాసనుడుగా వుంటాడో, వ్యక్తిగా అంత సౌమ్యుడు. స్నేహశీలి. ఆయన మితభాషి కూడా. తెలుగు సాహిత్య విమర్శలో రా.రా గారి స్థానం గొప్పది. వీరు నవంబర్ 25, 1988 తేదీన మరణించారు. ■

## గజల్



ఎస్.ఆర్. పృథ్వీ

త్యాగాల ప్రతిఫలమైన రూపం పాలిపోతోంది
వాంఛాజనితమైన స్వరాజ్యం కూలిపోతోంది
ఆశయాలు నాటితే చిగురించిన గులాబి
స్వప్రయోజనాల రాపిడికి రాలిపోతోంది
అభివృద్ధి ముఖం కొత్తరంగులు అద్దుకొంటూ
ప్రపంచీకరణ హంగులలో తేలిపోతోంది
అనుభవాలను పేర్చి కూర్చిన పూలమాల
స్వార్థంనిష్పురవ్వలు పడి కాలిపోతోంది
అన్నదమ్ములమై పెంచుకున్న అనుబంధం
రాజకీయ రక్కసి గోళ్లకు చీలిపోతోంది
తూరుపున ఉదయించిన చిగురు టాశ
మొలకెత్తకనే పశ్చిమాన వాలిపోతోంది
అడుగడుగున వంచన జరుగుతోందిర ఓ పృథ్వీ
శిరమెత్తిన చాలు బతుకు కాస్త పేలిపోతోంది.

## ధరిత్రి

దాకరపు బాబూరావు



తడబడే
నీ నడకలకు
అడుగుల
ఆలంబనయ్యింది-

నీ ఆకలి కడుపుకి
అన్నంకోసం
తననితాను
కుళ్లబెట్టుకుని
తిండిగింజల్ని
పండించింది-

రోజురోజుకీ
సముద్రంలా
ఉప్పొంగుతున్న
జనప్రవాహానికి
అడుకట్టలువేయలేక
సహనంగా భరిస్తున్నది-

నువ్వు
నమ్మినా
అమ్మినా
నిట్టనిలువునా
అడ్డుగోడలతో
వేరుచేసినా
అడ్డంగా
గోతులుతీసినా.....

ఆస్తిగా
నీహక్కై
నీ చదువుల్ని
సందిగ్ధంలో
నిలబెట్టే
నీ ఫారెన్
ఉద్యోగాలకి
హామీపత్రమై.....

ఇన్ని చేసినా
ఇంకేదో రుణం
మిగిలిపోయినట్టు
నిన్నుపారేద్దామని
నలుగురూమోసుకొస్తే
ఆఖరి అరగుడుల
జాగానిచ్చి
అమ్మలా
నిన్నక్కున
జేర్చుకుంటుంది-

## ప్రశ్న

- డా॥ మానేపల్లి

బ్రతికి వున్నానో
బకెట్ తన్నేశానో
బోధ పడదంలేదు

బ్రతుకూ- చావూ-
ఒకటేనా?-ఏ-మో-
చుట్టూ తక్షకులు, కర్కోటకులు
రక్కాక్షులు, మృత్యుజిహ్వాలు
మనుషుల ఏరీ!
వాటి తలల మీద....!
సముద్రంలో క్షారం
మనిషిలోని ఘోరమే
అగ్ని పర్వతాల్లో అన్ని
మనిషిలోదే- లావాకూడా

బ్రతుకున్నానా
కునికేశానా
తెలీకుండా వుంది
కాకీ-- ఇటుచూడు
నే బ్రతికి వున్నానా
కుక్కా- ఇలాచూడు నక్కా
నే బ్రతికే వున్నానంటావా
ఓయ్ తొండా ఏయ్ బల్లీ, లిల్లీ

నే బ్రతికే వున్నానా
ఒరే మనుషుల్లారా కనీసం
మీరయినా బ్రతికున్నారా
బహుశా- చచ్చిపోయివుంటాను
అదయినా తెలియాలి కదా
నా తరువాత
ఈ లోకం ఎలా వుంటుంది?
మరింత అధ్వాన్నంగా ఉంటుందా?
ఏదో అద్భుతం జరిగి- ఇంకా బాగుంటుందా?
ఐతే బ్రతికి వుండటము మంచిది

అబ్బా తల పగిలిపోతున్నది
నే బ్రతికి వున్నానా, చచ్చానా
మిలియన్ డాలర్ ప్రశ్న.



# నవీన్ నవల
# ఉమెన్స్ కాలేజి - వైవిధ్య పాత్రలు

- డా. కొమర్రాజు రామలక్ష్మి

సమాజంలో నుండి సాహిత్యం పుడుతుంది. సమాజానికి మేలు చేసేది, మనిషి ఆలోచనలకు పదును పెట్టి, సంస్కారాన్ని పెంచేది సాహిత్యం, కవిత్వం, వ్యాసం, కథ, నాటకం, నవల ఈ సాహిత్య ప్రక్రియలన్నింటిలో 'నవల' పరిధి విస్తృతమైనది. రాజకీయ ఆర్థిక, సామాజిక, నైతిక, తాత్విక విషయాలను, మనస్తత్వపు లోతులను వివరిస్తూ జీవిత కోణాలను సమగ్రంగా చిత్రించడానికి అనువైన ప్రక్రియ నవల. నవలలో జీవితాలు ప్రతిబింబిస్తాయి.



ఒక సామాజిక శాస్త్రవేత్తగా, మనస్తత్వ విశ్లేషకులుగా మానవ సంబంధాలకు ప్రాధాన్యతనిస్తూ. తమదైన శైలిలో 'మార్పు'కు స్ఫూర్తినిచ్చే పాత్రలను సృష్టించడం ద్వారా సాహితీ ప్రపంచంలో ఒక విశిష్ట స్థానాన్ని గడించిన నవలా రచయిత అంపశయ్య నవీన్ గారు. వారి కలం నుండి వెలువడిన నవలలలో "ఉమెన్స్ కాలేజీ" ఒకటి.

మహిళా కళాశాలలో అధ్యాపకులుగా, ప్రిన్స్‌పాల్‌గా పనిచేసిన అంశాలు, ఆయా సందర్భాలలో పరిశీలించిన అంశాలే "ఉమెన్స్ కాలేజీ" నవల రూపకల్పనకు ప్రధాన ఆధారాలని అనిపిస్తుంది. మహిళా సమస్యల పట్ల సానుకూల దృక్పథంతో ఆలోచించే వ్యక్తి కాబట్టి నవీన్ గారు మహిళా సమస్యలను, ముఖ్యంగా ఉద్యోగాలు చేసే స్త్రీల కష్టాలు, కన్నీళ్ళను, కాలేజీల్లో చదివే అమ్మాయిల సమస్యలను వాస్తవిక దృష్టితో పరిశీలించి, అనేక ప్రశ్నలను, సవాళ్ళను మన ముందుంచారు.

జ్ఞానంలో, అనుభవంలో, అంధకారంలో పురుషులు స్త్రీలకంటే అధికులని చెప్పటమే కాదు, ఇంటా బయటా స్త్రీల శ్రమను నియంత్రించడం, వారి ఆలోచనలను, అభిప్రాయాలను, కదలికలు, చర్యలను అదుపు చేయడం లాంటి లక్షణాలతో వారి జీవితాలను పురుషుల నియంత్రణకు లోబరిచిన నిర్మాణం పితృస్వామ్యం. అసమానత, అణచివేతలో భాగంగా పితృస్వామ్య సమాజం స్త్రీలను అదుపు చేయడానికి, వారిని లొంగదీయడానికి రకరకాల రూపాలలో హింసను ప్రయోగిస్తుంది. హింస స్త్రీలను భయానికి గురిచేస్తూ, తమలో తాము ముడుచుకు పోయేటట్లు, లొంగి జీవించేటట్లు చేస్తుంది. అటు కుటుంబం నుండి, ఇటు సమాజం నుండి స్త్రీలపై జరిగే హింస కొనసాగించబడడం వలన వివక్షా సంబంధాలు కూడా కొనసాగింప బడుతున్నాయి. ఇట్లాంటి పరిస్థితులలో అనేక పరిమితుల మధ్య స్త్రీలు ఇంటి పరిధిని దాటి చదువుల కోసం, ఉద్యోగాల కోసం బయటకు వస్తున్నారు. ఈ క్రమంలో చైతన్యవంతులవుతున్న స్త్రీలు సామాజిక రాజకీయార్థిక సంబంధాల మెరుగుదల కోసం జరుగుతున్న పోరాటాలలో భాగస్వాములు కూడా అవుతున్నారు.

అంతర్జాతీయ మహిళా దశాబ్దం ప్రపంచ వ్యాప్తంగా స్త్రీల సమస్యలు అనేక కోణాల నుండి చర్చించడానికి దోహదం చేసింది. స్త్రీల సమస్యలను చర్చించేటప్పుడు సంస్కృతిలో లింగ వివక్షకు, హింసకు ఉన్న సంబంధాన్ని అర్థం చేసుకోవడానికి స్త్రీల అనుభవాలు, కథనాలు ఉపకరిస్తాయి. అంతేకాదు సంస్కృతి సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది. ఈ క్రమంలో స్త్రీల సమస్యలతో పాటు పరిష్కారాలకు ప్రాధాన్యత నిచ్చే సాహిత్యం యొక్క అవసరం ఎంతయినా ఉంది. ఉంటుంది. ఈ నేపథ్యంలో స్త్రీలు తమ సమస్యలను గుర్తించడంతో పాటు తమకు జరుగుతున్న అన్యాయాన్ని నిరసిస్తూ ప్రశ్నించడం, సమిష్టిగా ఉద్యమించడం తప్పనిసరి అనీ, అందుకు ఒక కళాశాలలో పనిచేస్తున్న మహిళా అధ్యాపకులు తమ విద్యార్థినులను చైతన్య పరచడానికి అవకాశం ఎక్కువగా ఉంటుందనీ, విద్యావ్యవస్థ, పోలీస్ వ్యవస్థ, న్యాయ వ్యవస్థ కూడా తమ వంతు కృషి చేయడం ద్వారా ఆశించిన మార్పు సాధ్యం అవుతుందనీ భావించి ఒక మహిళా కళాశాలకు సంబంధించిన అనేక అంశాలను ఆధారం చేసుకొని, ఆ ఇతివృత్తంతో వాస్తవాలకు దగ్గరగా

చిత్రీకరించబడిన నవల "ఉమెన్స్ కాలేజీ".



నవలలోని పాత్రలను పరిశీలిస్తే 'ఉమెన్స్ కాలేజీ'లోని ప్రతిపాత్ర ముఖ్యమయినదే (ఆయా సందార్భాలను బట్టి). అయినప్పటికీ కథ ఎక్కువగా అయిదుగురు ఆడవాళ్ళ జీవితాలు, వాళ్ళ ఆశయాలు అభిప్రాయాల చుట్టూ తిరుగుతుంది. వాళ్ళే సురేఖ, సువర్ణ, జ్యోతి, భాగ్యలక్ష్మి, అనల. వీళ్ళు కొందరు మగవాళ్ళు కూడా అధ్యాపకులుగా పనిచేస్తున్న మహిళా కళాశాలలో లెక్చరర్లు. ఉమెన్స్ కాలేజీ నవల ప్రధానంగా ఈ ఐదు పాత్రల చుట్టే తిరుగుతుంది. వీళ్ళతో బాటు కొందరు విద్యార్థినులు కూడా ఈ నవలలో మనకు కనిపిస్తారు.

**సురేఖ :** పితృస్వామ్య భావజాలాన్ని నరనరాల్లో నింపుకొని ఒక మామూలు మగవాడికి భార్యగా, ఇద్దరు పిల్లలతో ఇంటా బయటా పనులతో సతమతమవుతూ, భర్త మాటలను, చేతలను భరిస్తూ వైవాహిక జీవితం పట్ల నిరాసక్తతను, భర్తంటే ఒక విధమైన నిరసన భావాన్ని కలిగి ఉండే పాత్ర. అందువల్లనే ఆవె ఆర్థిక స్వాతంత్ర్యం వల్ల స్త్రీ సమస్యలెన్నో పరిష్కరించబడతాయంటారు. స్త్రీకి స్వేచ్ఛ లభిస్తుందంటారు.. తనకు స్వేచ్ఛ ఉందా? తనకే నిజమైన స్వేచ్ఛ ఉంటే మొట్టమొదట ఆ మనిషితో.. భర్త అనే అహంకారితో ఒక్కక్షణం కూడా కాపురం చేయకూడదు. కానీ చేస్తోంది. తనను అర్థం చేసుకొని, తనను గౌరవిస్తూ తనకు తోడుగా, నీడగా ఉండే భర్త లభించాలని ఈమె ఎన్నికలలు కన్నదో! అంతరంగంలో అనుక్షణం సంఘర్షించే ఆలోచనా ధోరణితో సాగే పాత్ర. సురేఖ జీవన పోరాటంలో నిత్యం రాజీపడలేక, పరిస్థితుల ప్రభావానికి లోనవుతూ పరిష్కారంగా ఏదో చెయ్యాలనుకునే సురేఖ లాంటి వాళ్ళు మన చుట్టూ ఎంత మందో!

సురేఖ భర్త వెంకటేశ్‌ది మగవాడిననే అహంకారంతో స్త్రీ పురుషులు సమానులెలా అవుతారు? తరతరాలుగా స్త్రీలెలా అణిగిమణిగి ఉంటున్నారో తన భార్య కూడా అలాగే ఉండాలి. ఎదురు తిరగడమేమిటి? అనే అభిప్రాయంతో భార్యపట్ల చులకన భావాన్ని కలిగి ఉంటూ అనుక్షణం భార్యను క్షోభ పెట్టే పాత్ర. మన చుట్టూ వెంకటేశ్ లాంటి పురుష పుంగవులే ఎక్కువ.

**సువర్ణ :** ఈమె పాత్రను పరిశీలిస్తే ఒక విపరీతమైన మనస్తత్వంతో చూసే వారికి రాక్షసిగా, పిచ్చిదానిగా కనిపిస్తుంది. పుట్టి పెరిగిన వాతావరణం, పరిస్థితులు, నా అనేవాళ్ళు లేకపోవడం, ఇష్టం లేని మోసపూరితమైన పెళ్ళి, మాటలతో చేతలతో హింసించే భర్త ప్రకాశరావు కారణంగా ఏర్పడిన నిర్లిప్తత, నిస్సహాయత, అపనిందలు మొయ్యాల్సి రావడం, అనేక చేదు అనుభవాలు, ఈ నేపథ్యంలో తాను సహసమాజం నుండి వేరైనట్లు భావించడం, తన చుట్టూ ఉన్న వాళ్ళందరిపైనా ఆగ్రహం కలిగి అసహనంతో, అసంతృప్తితో జీవితాన్ని గడపాల్సి రావడం వల్ల ఏ కొంచెం సాఫ్ట్‌గా ఉన్నా ఈ ప్రపంచం తననింకా అణచివేస్తుంది అనే భయం ఈ రకమైన భావాలన్నింటినీ తన అమ్మమ్మలాగా ఉన్నట్లనిపించిందని చెప్తూ రజిత అనే విద్యార్థినికి ఉత్తరం రూపంలో వ్యక్తపరచడం, తన విపరీత ప్రవర్తనను మార్చుకునే ప్రయత్నంలో తోటి లెక్చరర్ అనల గురించి తన కారణంగా ఆత్మహత్య చేసుకున్న సంధ్య అనే విద్యార్థినిని గురించి సానుకూలంగా మాట్లాడడం, పశ్చాత్తాపపడడం లాంటి అంశాలన్నింటినీ సునిశితంగా పరిశీలించి పరిస్థితులు ఆమెనెట్లా ప్రభావితం చేశాయో ఒక మనస్తత్వ శాస్త్రవేత్తగా ఆలోచించి సువర్ణ పాత్రను, సన్నివేశాలను సృష్టించడంలో రచయిత గొప్పతనం అర్థమవుతుంది.

**జ్యోతి :** చదువుకునే రోజుల్లోకథలు, కవితలు రాస్తూ తనకంటూ ఒక వ్యక్తిత్వంతో హాయిగా, ఆనందంగా జీవిస్తున్న జ్యోతి జీవితంలో ఒక్కసారిగా విషాదం ఏర్పడుతుంది. తన అక్క భర్త ప్రసాద్ వల్ల మోసపోయి మానసిక వేదనను అనుభవిస్తూ నిరాశా నిస్పృహలతో కృంగిపోయి ఆత్మహత్య చేసుకోవాలనుకోవడం ఆ నిర్ణయాన్ని మార్చుకొని ఇష్టం లేకపోయినా ప్రసాద్‌ను పెళ్ళి చేసుకొని, అతనిపట్ల కఠినంగా వ్యవహరించడం, ఆమె తన దారికి రాకపోవడంతో ప్రసాద్ ఆమెను మళ్ళీ పెళ్ళి చేసుకోమని సలహా ఇచ్చినప్పుడు "పెళ్ళి చేసుకోనంత మాత్రాన ఓ స్త్రీ జీవితం వృథా అయిపోతుందనుకోవడం అవివేకం. సమాజానికి నా అవసరమేమిటో చూపిస్తాను. ఒక మంచి టీచర్‌గా నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తిస్తే చాలు. నేనీ సమాజానికెంతో చేసినదాన్నవుతాను. నాతోటి స్త్రీలెందరినో ఎడ్యుకేట్ చేసే బాధ్యతను తీసుకుంటాను... నాఫ్రెండ్ అనల లాంటి వాళ్ళు నడుపుతున్న స్త్రీ విమోచన ఉద్యమానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నా చేతనయిన సహాయాన్ని అందిస్తాను... నా జీవితం ఎప్పటికీ వృథాకాదని గుర్తించి నామీద జాలిపడడం మానెయ్యండి" అనడం, అవసరమయితే స్త్రీలు తమ లక్ష్యాన్ని నిర్దేశించుకొని, మంచి నిర్ణయాలు తీసుకోగలరని జ్యోతి పాత్ర ద్వారా నిరూపించారు రచయిత.

జ్యోతిని మోసం చేసిన ప్రసాద్ చంచల మనస్కుడు. అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు పట్టుకునే రకం. ఆమెను ఒప్పించడానికి అన్ని విధాలా ప్రయత్నించి, ఆమె గట్టిగా మాట్లాడి నిలదీసేసరికి భంగపడి ఆమెకు దూరంగా వెళ్ళిపోతాడు. కుటిల బుద్ధిగల ప్రసాద్ లాంటి వారి బారిన పడకుండా అమ్మాయిలు జాగ్రత్తగా ఉండడం అవసరమనే సందేశాన్ని రచయిత జ్యోతి పాత్ర ద్వారా అందించారు. అంతేకాదు జ్యోతి కథంతా విన్న అనల, సురేఖలు జ్యోతికి ధైర్యం చెప్పి ఆమెకు జీవితంపై ఆశ కలిగించే సన్నివేశం కూడా అందరికీ, ముఖ్యంగా స్త్రీలకు బాగా నచ్చే అంశం.

**భాగ్యలక్ష్మి :** ఉన్నత చదువులు చదువుకొని తన ఉద్యోగంతో తండ్రికి సహాయం చేస్తూ, హాయిగా ఉండాలనీ ఎంతో బాధ్యతాయుతంగా ఆలోచించే భాగ్యలక్ష్మి కేవలం ఆమె చూడడానికి బాగా ఉండదనే కారణంగా ఆమె చుట్టూ ఉండేవాళ్ళు ఆమెను కించపరచడం, అందువల్ల ఆత్మ న్యూనతాభావంతో తన మీద తానే విశ్వాసాన్ని కోల్పోవడం చాలాకాలం పెళ్ళికాకపోవడం, చివరకు తల్లిదండ్రుల కోసం భాస్కరరావును పెళ్ళి చేసుకోవడం డబ్బు పిచ్చిగల భాస్కరరావు డబ్బు కోసమే నిన్ను పెళ్ళి చేసుకున్నానని ఆమెతో చెప్పడం, ఆమెనెప్పుడూ డబ్బు కోసం పీడించడం, ఆమె సంపాదించిన జీతంపై ఆమెకే హక్కు లేకపోవడం, అది భరించలేక అతన్ని గురించి తండ్రితో చెప్పినప్పుడు 'అడ్జస్టయిపోవాలి' అని తండ్రి అన్నప్పుడు "అడ్జస్ట్ కాలేను నాన్నా!

నేను మీ ఇంట్లో ఉండడం మీకిష్టం లేకపోతే మరో చోటైనా చూసుకుంటాను కానీ అతనితో మాత్రం నేను జీవించలేను. ఇంకా కొంతకాలం ఆ అక్కతమ్ముళ్ళ మధ్య ఉంటే నేను నేనుగా ఏమీ మిగలను. నాకు తప్పకుండా పిచ్చెక్కుతుంది" అనడం, "నువ్వు సంపాదించిన డబ్బును నువ్వు ఖర్చుపెట్టుకోవాలి. అతడు నీకు కేవలం సమాజం కోసం భర్తగా ఉండకపోతే ఏం? అతనిలో మార్పు కనిపించకపోతే విడాకులు ఇచ్చేసి నీ బతుకు నువ్వు బతకడం ఎంతో హాయిగా వుంటుంది" అని అనల సలహా ఇచ్చినప్పుడు అనల ద్వారా తండ్రినొప్పించి భర్తకు విడాకులివ్వాలనుకోవడం ఇలా భాగ్యలక్ష్మి పాత్రపై ఒక ఆత్మీయమైన సానుభూతి కలిగే విధంగా ఆ పాత్రను చిత్రీకరించారు రచయిత. భాగ్యలక్ష్మి లాంటి నెమ్మదైన స్వభావం గల స్త్రీలకు ఈ పాత్ర ఒక రకమైన ప్రేరణ. కేవలం ఆమె డబ్బునాశించి ఆమెను పెళ్ళి చేసుకునే భాస్కరరావు లాంటి వాళ్ళకొక గుణపాఠం.



**అనల :** కాలేజీలో కొత్త లెక్చరర్‌గా జాయిన్ అయిన 'అనల' తన పరిచయంలో భాగంగా విద్యార్థినుల నుద్దేశించి "మనదేశంలో అక్షరాస్యుల సంఖ్యే చాలా తక్కువ. అందులో ఆడపిల్లల విషయానికొస్తే పరిస్థితి ఇంకా అధ్వానంగా ఉంది. ఈ దేశంలో స్త్రీ పుట్టినప్పటి నుండీ మరణించేవరకు ఎన్ని రకాల అన్యాయాలు జరుగుతున్నాయో మీకు తెలుసనుకుంటాను, ఈ అన్యాయాల నుండి, అక్రమాల నుండి మనల్ని మనం రక్షించుకోవాలంటే మనం చదువుకోవాలి. మనకు ప్రపంచమంటే ఏమిటో అర్థం కావాలి. మనం ఎన్ని రకాల దోపిడీలకు గురవుతున్నామో అర్థం కావాలి. దోపిడీకి ఎదురు నిలిచి పోరాడే పోరాట పటిమ మనలో రూపొందాలి. మన చైతన్య పరిధి విస్తరించాలి. మీరు చదువుతున్న చదువు అందుకు తోడ్పడాలి" అంటూ ఆవేశంగా మాట్లాడే అనల లాంటి సామాజిక మార్పు కోసం కృషి చేసే పాత్రను ప్రవేశ పెట్టడం బాగుంది. అభ్యుదయ భావాలతో అందరూ బాగుపడాలని కోరుకునే అనల పాత్ర ఉమెన్స్ కాలేజీ నవల లోని వివిధ పాత్రల మధ్య సమన్వయాన్ని చేకూర్చేదిగా రూపొందింది. అందరినీ కలుపుకుంటూ, అందరితో కలసిపోతూ తనకంటూ ఒక ప్రత్యేకమైన అస్తిత్వాన్ని కలిగి ఉన్న విశిష్టమైన పాత్ర అనల. విద్యార్థినులకు, సహ అధ్యాపకులకు సమయానుకూలంగా సలహాలనిస్తుంది. అవసరమైన సహాయం చేస్తుంది. కష్టాల్లో ఉన్నవాళ్లను అనునయిస్తుంది. స్ఫూర్తిదాయకమైన తన మాటలు, చేతలతో ఆత్మస్థైర్యాన్నందిస్తుంది. సమస్యల సాధన కోసం పోరాడుతుంది. తన తోటి స్త్రీలను పోరాడేలా చేస్తుంది. ప్రతి విషయంలో మంచి చెడు ఆలోచిస్తూ తోటివారితో ఆలోచింప చేస్తుంది. పదిమందినీ కూడగట్టుకునే నాయకత్వ లక్షణాలున్న పాత్ర. ఆడవాళ్ళను అవమాన పరిచే వాళ్ళను ఖచ్చితంగా నిలదీస్తుంది "తండ్రైనా, భర్తయినా, ఆఫీసరయినా, ఎవరైనా సరే స్త్రీ ఆత్మ గౌరవాన్ని కాపాడుకోవాలంటే వాళ్ళతో పోరాటం చెయ్యాల్సిందే అంటూ సందేశాన్నందిస్తుంది. "మీరు పదే పదే మేం ఆడవాళ్ళం అనే విషయం గుర్తు చెయ్యాల్సిన అవసరం లేదు. మేం మీలాగే మనుషులమని గుర్తిస్తే చాలు" అని ప్రిన్స్‌పాల్‌తో అనడం "ఇదొక సంకీర్ణ సంస్కృతి ఇదొక త్రిశంకు స్వర్గం" అనుకోవడం. ఆడపిల్లలంటే మేకపిల్లల్లాంటి వాళ్ళయినట్లు ఎక్కడవేస్తే అక్కడ పడుండే జడ పదార్థాలట. ఆడపిల్లలంటే ఎంత చులకన భావం అతనికి! హీకాంట్ గెటవే వితిట్! సో వియ్ ప్రొటెస్టెడ్" అని ఒక పోలీసాఫీసర్‌ను గురించి పత్రికా విలేఖరులతో అనడం, ఇట్లా అనేక సందర్భాలలో సమస్యలకు స్పందించడం, ఆడవాళ్ళకే వర్తిస్తున్న కుటిల నీతులపై ధిక్కార స్వరాన్ని వినిపించడం లాంటి లక్షణాలతో ఒక ఆదర్శవంతమైన పాత్రలో తాను చైతన్యం పొందుతూ, తన చుట్టూ ఉన్నవారిని చైతన్యీకరిస్తుంది అనల. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రతి ఇంట్లో, ప్రతి ఆఫీసులో అనలలాంటి వాళ్ళు ఒక్కళ్ళయినా ఉండడం ప్రస్తుత సమాజానికెంతో అవసరం.

మార్పుకోరుకునే రజిత, అనూరాధా, శైలజల్లాంటి అభ్యుదయ భావాలున్న విద్యార్థినులు, అనల భావాలతో స్ఫూర్తిని పొందుతూ ఆమె బాటను అనుసరించడం సహజమే అనిపిస్తుంది.

ఇక పితృస్వామ్య భావజాల సంస్కృతిని వంట బట్టించుకొని ఆడవాళ్ళను గురించి చులకనగా మాట్లాడే రాఘవరావు, డి.ఎస్.పి లాంటి వాళ్ళు, సున్నిత మనస్కురాలైన సంధ్యలాంటి, ప్రేమ పేరుతో మోసపోయే మనోరమ లాంటి అమ్మాయిలు మన సమాజంలో ఎంతోమంది! మార్చి 8న మహిళా సమస్యలపై చర్చించడం కోసం ఉమెన్స్ కాలేజీలో ఒక సదస్సును ఏర్పాటు చెయ్యడం ద్వారా నవలను ముగించటం ఎంతో సమంజసంగా ఉంది. తల్లి గారాబంతో మొండిగా తయారై, అల్లరి చిల్లరిగా తిరుగుతూ సమస్యలను సృష్టించే పాత్ర మదన్‌ది. అయితే ఈ పాత్రలో మార్పు రావడం హర్షించదగ్గ విషయం. పోలీస్ వ్యవస్థలో విజయ్‌కుమార్ లాంటి మంచి వాళ్ళు ఇంకా చాలా మంది ఉంటే ఎంత బాగుండననిపించే పాత్ర. పొందిన సహాయానికి కృతజ్ఞత చూపించే కామాక్షి పాత్ర, ఇంకా కథతో సంబంధమున్న కలెక్టర్, ప్రిన్స్‌పాల్, అటెండర్ ఖాదిర్, రాజగోపాల్, శ్రీధర్, నిర్మల, శ్రీలత మొదలైన పాత్రలు పాఠకుల ఆలోచనలకు పదును పెడతాయి. క్లాసులు ప్రాక్టికల్స్, పరీక్షలు, బస్సులు, కాలేజీలో వసతులు, విద్యార్థినుల సమస్యలు, అధ్యాపకుల సమస్యలు, వ్యక్తిగతంగానే కాక పాలనాపరమైన సమస్యలు, పరిష్కార మార్గాలు చెప్పించే విధానం, అకాడమిక్ అంశాలను సందర్భానుసారంగా సృష్టీకరించే పద్ధతి అభినందనీయం, అనుసరణీయం. ఆఖరికి శిథిలావస్థలో ఉన్న ఉమెన్స్ కాలేజీ బిల్డింగ్‌ను సంబంధిత అధికారుల సహాయంతో ఆరునెలల్లో కొత్త బిల్డింగ్‌గా మార్చడం, ఉన్నత విద్యా శాఖామంత్రి గారిచే ప్రారంభోత్సవం గావించబడడం, అందరూ సంతోషించడం, అది కూడా 'అనల' కల నిజమైనట్లుగా నవలను ముగించడం నవలా రచయితగా నవీన్ గారిలోని సునిశిత దృష్టిని, విశాల దృక్పథాన్ని తెలియజేస్తుంది. నవీన్ గారిలోని మానవీయకోణం స్పష్టంగా కనిపిస్తుంది.

ఒక మహిళా కళాశాలలో పనిచేసే అధ్యాపకురాలిగా 'ఉమెన్స్ కాలేజీ' నవలను నేను పరిశీలించినప్పుడు దానిలోని పాత్రలన్నీ నాకు సజీవంగా కన్పించాయి. ఆలోచింపజేశాయి. 260 పేజీలతో పాఠకులను ఆలోచింపజేయడంలో నవీన్ గారు సఫలీకృతులయ్యారనే నేను భావిస్తాను. ■

# రెప్పల తలుపు తట్టిన రాత్రి

- దోర్నాదుల సుబ్బమ్మ



గాజుల సవవ్వడికి, పసిపాపలనవ్వులకి, గబుక్కున నిద్రమేల్కొన్న రాత్రి
నిశీధి నిక్షిప్త రాగాలాపనలో లయిస్తూ ఉద్వేగకెరటపు శిఖరాగ్రపు
అంచుపైన నడుస్తున్న రాత్రి.....
వేయినవ్వులు పోగొట్టుకొన్నచోట ఒకేవొక దు:ఖపు చినుకు కురిసిన
రాత్రి సౌందర్య సముద్రమథనం జరిగిన తర్వాత
వరకట్న బావుటా నింగికెగిసిన రాత్రి, ఋషులూ, సత్యవంతులూ,
అపూర్వులూ జన్మించిన రాత్రి.....
స్వాతంత్ర్యం వచ్చిన రాత్రి.... స్వతంత్ర్యాన్ని పోగొట్టుకున్న
రాత్రి........
గల్లీ గల్లీలో ... లిల్లీపూలు... గుర్రపుడెక్కల క్రింద ఆర్తనాదం చేసిన
రాత్రి....
సరస్సులూలేవు....సహస్ర శిరచ్ఛేదనలూ లేవూ.....

గది దూలానికి వ్రేలాడుతున్న ఒకేవొక శిరస్సు తప్ప........!
రేపటి సూర్యోదయాన్ని కనడానికి ఈ రోజే మరణించిన రాత్రి....
అనుభూతుల అవ్యక్తానుభూతితో రెడ్‌లైట్ ఏరియాగా రూపాంతరం
చెందిన రాత్రి......

నాల్గు క్షణాల కోసం రెండు జీవులు నలిగిన రాత్రి.....
అయ్యో..... కర్కశమైన పదాలు వొద్దూ.....
బ్రతుకు పంధాలు అసలే వొద్దూ.....
నాల్కలు పల్కలేని పాటలూ వొద్దూ.....!
అందరికీ అర్ధంకాని కవిత్వమూ వొద్దూ...
నిన్ను అర్ధం చేసికోలేని వ్యక్తిత్వమూ వొద్దూ.....
ఓ సోదరా...... అడదంటే అందాలబొమ్మా.......
ఆటబొమ్మకాదురా....
ఆడదంటే అభిమతాలగుట్టకాదు......
మాజాతి దుర్నీతి పదాల్ని పల్కడానికి మా నాలుకలు చాలవు.....
అది మీకేతగు .. కనికరించినా.. కాలరాచినా.... మీకేచెల్లు......

మాతృగర్భం తెరిస్తేనే ప్రపంచపు ముఖద్వారం కన్పిస్తుంది.
గర్భగుడుల్ని కూల్చితే ఏమౌతుందోగాని......... గర్భాలు కూల్చితే
మనిషేవుండడు.

నీ రూపాన్ని గర్భంలో మోసి... నాలో నిక్షిప్తం చేసికొన్న రాత్రిని........
పెంచిపెద్దచేస్తే ... చివరకు శూన్య ప్రపంచంలో తెగిన గాలిపటం
చేసేది తెలిస్తే
నీకు ఫుల్ స్టాఫ్ పెట్టి..... బ్రతుక్కిరాజీనామా యిచ్చివుండేదాన్ని...
లోకం యిప్పుడు ఆశ్చర్యార్ధకంలో మునిగేదీకాదు.....
ఆందోళన వుండేదీకాదు........

ఒకరు సుఖిస్తే......... మరొకరు దుఃఖించాల్నా......
దుఃఖం నాతో పాటే ..... కాటికి చేరుకునేప్పుడు.....
జానెడుపొట్టనే కాక, మనిషికంతా నూరేళ్ల బ్రతుకు
దుఃఖపు పరదా కప్పుకొని.....
ఋణాలు తీర్చుకొనే దాన్ని గురించి తీర్పు చెప్పమంటున్న రాత్రి
రంపపు కోత విధిస్తూ... రెప్పల తలుపు తట్టుతోంది రాత్రి......!

# స్థానికతలో ఆధునికత

గుడిపూడి విజయరావు



**వైకుంఠం చిత్రాలన్నీ స్థానికమైనవే. గ్రామీణ జీవనానికి సంబంధించినవి. మరీ చెప్పాలంటే తెలంగాణాకు సంబంధించినవి. సందర్భమూ, వస్తువూ స్థానికమే అయినా, వాటి ట్రీట్‌మెంట్ ఆధునికమైనది కావడమే ఈ చిత్రాలలో ప్రత్యేకత, విశిష్టత.**

"నాకు తెలిసింది నేను పుట్టి పెరిగిన గ్రామము, అక్కడి మనుషులూ, వారి కట్టుబొట్టు, పనిపాటలు, ఆచార వ్యవహారాలు మాత్రమే. వాటినే నా చిత్రాలకు వస్తువులుగా స్వీకరించాను." అని అంటారు ప్రసిద్ధ చిత్రకారుడు తోట వైకుంఠం. వైకుంఠం జన్మించింది కరీంనగర్ జిల్లా, బూరుగుపల్లి గ్రామం. ఆయన చిత్రాలలో రైతులు, వ్యవసాయకూలీలు, గీత తదితర చేతివృత్తులవారు, ఆలయ పూజారులు, గ్రామీణ జానపద కళాకారులు– అంతే కాదు, ఇరుగు పొరుగువారు, చుట్టపక్కాలు, వివిధ తరగతులకు, వివిధ వయస్సులకు చెందిన గ్రామీణ మహిళలు దర్శనమిస్తారు. గ్రామాలలో వాడే వ్యవసాయ పనిముట్లు, సోల, అద్ద లాంటి ధాన్యం కొలిచే పాత్రలు, తన తల్లి వంట ఇంటిలో ఉపయోగించే పాత్రలు మొదలైన వాటినీ ఆయన చిత్రించారు. తాను చూసిన వూరి దొర, దొరసాని, వారి పాలేళ్ళు, సుంకళ్లు– బుండిగాడు అని పిలవబడిన వందేళ్లు నిండుగా జీవించిన ఆ వూరిలోని చర్మకారుడు– లాంటి వాళ్లు కూడ ఆయన చిత్ర సంచయంలో చోటు సంపాదించారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన ఒక నిర్దిష్ట సమయంలో తన బూరుగులపాడు సామాజిక, ఆర్థిక దృశ్యాన్ని తన చిత్రాలలో పట్టి బంధించారు.



ఇవన్నీ 2009 జూన్ 14న, హైదరాబాదు, కళాహిత ఆర్ట్ ఫౌండేషన్ గ్యాలరీలో మొదలైన చిత్రప్రదర్శనలో దర్శనమిచ్చాయి. వైకుంఠం తన చిత్ర కళాజీవితంలో అత్యంత ఫలప్రదమైన కాలం 1971-84 మధ్య గీసిన 250 పైగా చిత్రాలు చిత్రకళాభిమానులను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. వీటిలో అత్యధికం చార్‌కోల్‌తో పేపర్‌పై వేసినవి. తన తల్లికి అస్వస్థతగా ఉన్నపుడు చూసుకునేందుకు స్వగ్రామం వెళ్లిన వైకుంఠం అక్కడి జీవనాన్ని అంతటినీ తన స్కెచ్ బుక్కులోకి ఎక్కించారు. హైదరాబాదు తిరిగి వచ్చిన తర్వాత ఆ స్కెచ్‌ల ఆధారంగా ఆయన రూపొందించినవే ఈ కళారూపాలు.

అనుకరణకు పూనుకోని ఏ కళాకారుడయినా తనకు తెలిసిన వాటినే చిత్రిస్తాడు. వాటి తీరుతెన్నులను తాను బాగా అధ్యయనం చేసిన తర్వాతనే వాటికి ఓ రూపాన్ని ఇస్తాడు. వైకుంఠమూ అదే చేశాడు. అయినప్పటికీ ఆయన కళా ఖండాలకు జాతీయ, అంతర్జాతీయ ప్రశంసలు, ఆదరణ ఎలా లభిస్తున్నాయి? ఏమిటి ఆయన చిత్రాలలోని ప్రత్యేకత? ఈ అంశాలను అర్థం చేసుకోవలసి ఉంది. దీనికి మనం అంతగా కష్టపడాల్సిన పనిలేదు. కళాహిత గ్యాలరీ క్యూరేటర్, ఆర్ట్ హిస్టారియన్ కోయలి ముఖర్జీ ఘోష్ దాదాపు సంవత్సరం పాటు వైకుంఠం చిత్రాలను అధ్యయనం చేసి, ఆయనతో సుదీర్ఘమైన సంభాషణలను జరిపి– ఈ ప్రశ్నలకు సమాధానాలను సంపాదించారు. వాటికి స్పష్టమైన అక్షర రూపం ఇచ్చారు. వైకుంఠం చిత్రాలను, ఈ అంశాలను కలిపి కళాహిత ఫౌండేషన్ పుస్తకరూపంలో తెచ్చింది. ఈ ప్రదర్శనకు అది ఒక అదనపు హంగు.

వైకుంఠం చిత్రాలన్నీ స్థానికమైనవే. గ్రామీణ జీవనానికి సంబంధించినవి. మరీ చెప్పాలంటే తెలంగాణాకు సంబంధించినవి. సందర్భమూ, వస్తువూ స్థానికమే అయినా, వాటి ట్రీట్‌మెంట్ ఆధునికమైనది కావడమే ఈ చిత్రాలలో ప్రత్యేకత, విశిష్టత. భారతీయ, ఆధునిక ధోరణుల సమ్మేళనం ఆయన చిత్రాలు. వైకుంఠం చిత్రాలలో ఖజురహో, కోణార్క, అజంతా చిత్రకారుల లావణ్యం, బంగారు పనివారు, నేత పనిరవారల నైపుణ్యం కనిపిస్తాయి. గాగున్, సిజాన్, పిసారో,

బ్రాంకుసి లాంటి పాశ్చాత్య చిత్రకారులను పోలిన ప్రావీణ్యం వ్యక్తమవుతుంది. అంతే కాదు, అనంతపురానికి చెందిన హస్తకళాకారులు. నకాషి చిత్రకారులు, కూచిపూడి, యక్షగాన కళారీతుల ప్రభావం ఆయన చిత్రాలలో ప్రతిబింబిస్తుంది. మరో విధంగా చెప్పాలంటే ఆయన భారతీయ ముంగిటి నుండి, పాశ్చాత్య ముంగిటికి, మళ్లీ అటునుండి ఇటువైపుకు-పయనిస్తుంటాడు. అందుచేతనే ఆయన చిత్రాలలో లెంతులేని వైవిధ్యం కనిపిస్తుంది. వైకుంఠం టీచరు రఘోత్తమ రావు ఆయనలో నాటిన జాతీయతాభావ బీజాల ప్రభావం కూడ ఈ చిత్రాలలో ఉంటుంది. రఘోత్తమ రావు గీసిన జాతీయ నాయకుల చిత్రాలు తనలో స్ఫూర్తిని నింపాయని వైకుంఠం చెబుతారు. అంతేకాదు, కార్ల్ జంగ్ మనోవిజ్ఞాన శాస్త్ర రచనలు, జిడ్డు కృష్ణమూర్తి తాత్విక రచనల ప్రభావం కూడ తనపై పుష్కలంగా ఉందని ఆయన అంటారు. వీటితోపాటు, ఏ పని చేపట్టినా చిత్తశుద్ధితో, అంకితభావంతో, నీ శక్తియుక్తులన్నీ సంపూర్ణంగా వినియోగించి ఫలితాన్ని రాబట్టాలని తన తండ్రి ఇచ్చిన సలహా తనను నడిపిస్తున్నదని కూడ వైకుంఠం చెబుతారు.



1942లో బూరుగుపాడులో జన్మించిన వైకుంఠం, సమీపంలోని షత్రాజ్‌పల్లి, వేములవాడలో ప్రాథమిక, మాధ్యమిక విద్య నభ్యసించారు. ఆ తర్వాత హైదరాబాదుకు చేరుకొని ఫైన్ ఆర్ట్స్ కళాశాలలో చేరి 1970లో చిత్రకళలో డిప్లొమా సంపాదించారు. 1970లో హైదరాబాదు, లలిత కళా అకాడమీ



ఫెలోషిప్పు మీద బరోడా వెళ్లి అక్కడ ఎంఎస్ యూనివర్సిటీలో ప్రఖ్యాత చిత్రకారుడు, చిత్రకళోపాధ్యాయుడు కెజి సుబ్రమణియన్ వద్ద పెయింటింగ్, ప్రింట్ మేకింగ్‌లను అధ్యయనం చేశారు.

వైకుంఠం సోలో చిత్రప్రదర్శన 1974లో హైదరాబాదు ఆర్ట్ సొసైటీ నిర్వహించింది. అప్పుడే ఆయన హైదరాబాదు. బాల భవన్‌లో ఆర్ట్ టీచర్‌గా చేరారు. అప్పటి నుండి ఆయన ఎన్నెన్నో చిత్రప్రదర్శనలు దేశంలో పలు నగరాలలో నిర్వహించారు. ఎన్నెన్నో అవార్డులు సొంతం చేసుకున్నారు. ఆయన సినిమా రంగంలో కూడ ప్రవేశించారు. 1978లో మాభూమి చిత్రానికి కళాదర్శకుడు బి నరసింగరావుకు ఇల్లస్ట్రేటర్‌గా పనిచేశారు. నరసింగరావు తీసిన రంగుల కల, దాసి సినిమాలకు తానే ఆర్ట్ డైరెక్టరుగా పనిచేశారు. దాసి సినిమాలో కళాదర్శకునిగా ఆయనకు జాతీయ అవార్డు కూడ లభించింది. 1993లో పెయింటింగ్‌లో జాతీయ అవార్డు లభించింది. 1994లో కలకత్తా, న్యూయార్క్. బెంగుళూరులలో గ్రూప్‌షోలలో పాల్గొన్నారు. 1995-97లలో ఢిల్లీ, ముంబాయి, బెంగుళూరు, హైదరాబాదులలో సోలోషోలను నిర్వహించారు. 2005లో ఆయన రెట్రోస్పెక్టివ్ న్యూఢిల్లీ ఆలివ్ ఆర్ట్ గ్యాలరీలో జరిగింది. ఇప్పుడు కళాహితలో 'డీప్ రూటెడ్ టేల్' పేరుతో ఆయన చిత్రాల ప్రదర్శన జరుగుతున్నది.

వైకుంఠం చిత్రాల ప్రత్యేకతను మరింత నిర్దిష్టంగా చెప్పుకోవాలంటే, ఆయన చిత్రాలు చూసిన మొదటి క్షణంలోనే ప్రేక్షకుల మనస్సులపై బలమైన ముద్రను వేయకలుగుతాయి. అది ఆయన అభివృద్ధి చేసిన రేఖల్లోనే ఉంది. రేఖలు ఒక్కటే కాదు, ఆ రేఖలను లయబద్ధంగా వినియోగిస్తూ, ఆ రేఖల మధ్య ప్లేన్స్‌ను సృష్టించకలగడం. ఈ ప్లేన్స్ అమరిక ద్వారా శక్తివంతమైన రూపాలు ఏర్పడతాయి. ఆ రూపాల కలయిక శరీరంలో భాగాలుగా మారతాయి. మొత్తం ఈ భాగాలన్నీ కలిపి ఒక సంపూర్ణ ఆకృతిని అందిస్తాయి. వైకుంఠంకు రేఖలపై అపరిమితమైన అదుపు ఉంది. ఆ రేఖలు ఎంతో ప్రగాఢమైనవి. అందుచేతనే వాటి కలయికతో ఏర్పడేవి కేవలం ఆకృతులు మాత్రమే కాక, బాడీ లేంగ్వేజ్‌ను, భావాలను కూడ అద్భుతంగా పలికించకలుగుతున్నాయి. నీవు ఏ ఆధునిక విధానాన్ని అనుసరించినా, చిత్రాలు మాత్రం భారతీయ స్వభావానికి అద్దం పట్టాలని వైకుంఠం చెబుతుంటారు. అందుచేతనే ఆయన చిత్రాలలో భారతీయ ప్రతిమా సంప్రదాయం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

ఇటీవల కాలంలో ఆర్థిక మాంద్యం నేపథ్యంలో చిత్రకళకూ గిరాకీ తగ్గిపోయినా, వైకుంఠం లాంటి వారి చిత్రాలు శాథ్ఫన్ ఆర్ట్, సోదెబీ, క్రిస్టీస్ లాంటి జాతీయ అంతర్జాతీయ



ఆక్షన్‌లలో సైతం అమ్ముడు పోతున్నాయి. ఒక ఆర్ట్ మార్కెట్ పరిశీలకుడు చెప్పినట్లు, అంతర్జాతీయ బయ్యర్లు భారత్, చైనా తదితర దేశాల చిత్రాలను అవి ఆయా దేశాల ప్రత్యేకతలకు అద్దంపట్టేవి అయితేనే కొంటున్నారన్నది సత్యం. ■

# మాష్టార్జీ సాహిత్యంలో స్త్రీ తత్త్వ స్వరూపం

డా॥ కొలకలూరి మధుజ్యోతి



**మాష్టార్జీ రచించిన, ఆలపించిన స్త్రీతత్వ గీతాలు అధికతరం స్త్రీ తత్త్వాన్ని అందించేవే. స్త్రీ తత్త్వాన్ని వ్యక్తం చేస్తూ ఆలపించిన గీతాలకు నేపథ్యంగా నిల్చిన మూడు గీతాలు, ఒక ఆలోచనాధారకు భూమిక కాగల అంశాలు. మొదటి గీతం సమతను చాటిన బుద్ధుడిని స్మరించేది కాగా, ఆ బుద్ధిడి సమతా భావనకు అండగా, దీనులకు బాసటగా నిల్చిన జ్యోతిరావ్‌ఫూలే, అంబేద్కర్ పెరియార్ నాయకర్, కాన్షిరామ్‌లను తలచే గీతం రెండవది, బుద్ధుడు ఫూలే తదితరులకు ధీటుగా నిల్చిన సావిత్రి ఫూలేను మూడవ గీతంలో ప్రస్తుతించాడు.**

---

మాష్టార్జీగా ప్రసిద్ధుడయిన గంగాధరి శ్రీరాములు ప్రముఖ గీత కారుడు. దళితకవి. మూలవాసి సిద్ధాంత ప్రచారకుడు. ఆలోచనా తత్పరుడు, సమాజ ప్రగతికి కాముకుడు

మాష్టార్జీ దళిత గీతాల ప్రాచుర్యం అనన్యం. అలాగే స్త్రీ తత్త్వ గీతాలు కూడానూ. పాట విషయంలో వంగపండు గద్దర్ శివసాగర్ గోరటి వెంకన్నల సమస్కంధుడు మాష్టార్జీ

మాష్టార్జీ రచించిన, ఆలపించిన స్త్రీతత్వ గీతాలు అధికతరం స్త్రీ తత్త్వాన్ని అందించేవే. స్త్రీ తత్త్వాన్ని వ్యక్తం చేస్తూ ఆలపించిన గీతాలకు నేపథ్యంగా నిల్చిన మూడు గీతాలు, ఒక ఆలోచనాధారకు భూమిక కాగల అంశాలు. మొదటి గీతం సమతను చాటిన బుద్ధుడిని స్మరించేది కాగా, ఆ బుద్ధిడి సమతా భావనకు అండగా, దీనులకు బాసటగా నిల్చిన జ్యోతిరావ్‌ఫూలే, అంబేద్కర్ పెరియార్ నాయకర్, కాన్షిరామ్‌లను తలచే గీతం రెండవది, బుద్ధుడు ఫూలే తదితరులకు ధీటుగా నిల్చిన సావిత్రి ఫూలేను మూడవ గీతంలో ప్రస్తుతించాడు. బహుజన శ్రేయస్సును కాంక్షించే ఆలోచనాధార స్త్రీ ప్రగతికారక ఆలోచనలకు దారి తీసింది. పరిణామ క్రమతను వ్యూహాత్మకంగా గీతాల రూపంలో మలచి స్త్రీ తత్త్వాన్ని అందించే దిశలో గీత కూర్పు చేశాడు.




ఈ గీతాలు, అనేక విషయాల సమాహారంగా కనిపిస్తున్నాయి. ఇది స్త్రీ స్థితిని చాటేవి, వారి స్వభావాన్ని చూపేవి. స్త్రీకి బహుజనులను మూలవాసులను అణచివేసే మన దృష్టిని ప్రదర్శించేవి, స్త్రీలను చైతన్య పరిచేవి, స్త్రీలలోని అసమానతలను తెల్పేవి, వివిధ వృత్తులపై ఆధారపడ్డ జీవితాన్ని చాటేవి. సమకాలీన స్త్రీ మూర్తులు కల్పించే జాగృతిని వ్యక్తం చేసేవి. అన్నింటి కంటే మాష్టార్జీ వ్యక్తిత్వాన్ని ప్రకటించేవి. ఈ గీతాలలో కనిపిస్తాయి.

పాటగా భావుకతతో సాగే ఈ పుస్తకంతో పాటు సీడీ కూడా జతపరిస్తే ఖర్చు పరిమితిని గమనిస్తూనే భావుంటుంది. రాబోయే పాటలకైనా, ఈ పుస్తక పునర్ముద్రణలోనైనా, ఆచార్య చేపట్టగలిగితే, సాహిత్య చేరవలసిన చోటుకు వేగంగా వెళ్ళగలుగుతుంది. పాటకున్న శక్తి అటువంటిది. అది నా భావన. సాధ్యా సాధ్యాలు కష్టనష్టాలు కలిపి.

ఆర్య ద్రావిడ విషయిక చారిత్రక వాస్తవాలకు భూమికగా నిల్చే మూలవాసుల సిద్ధాంతం మాష్టార్జీ గీతాలకు బాసట. నేటి ఎస్సీ, ఎస్టీ, బీసీలు, మైనారిటీ మతాలలోనికి మార్చిన వారంతా ఈ దేశ మూల వాసులని, వారిని అణచి వారిపై పెత్తనం చేస్తున్నవారు అగ్రకులాలు విదేశీయులూ అంటాడు మాష్టార్జీ. ఆయన దృష్టిలో మూల వాసులు ప్రేమ స్వరూపులు నిర్మల స్వభావులు, వైషమ్యాలు వివక్షల పొడ సోకని వారు.

పుట్టు పుట్టే బిడ్డా- పుట్టి పెరిగే బిడ్డా  
ఆడపిల్లే పుడితే - పాడు పిల్లనబోక  
మేము ప్రేమగా జూస్తం- పెంచి పెద్దగ జేస్తం  
మూల జాతుల వాళ్ళం - మంచి మనసున్నోళ్ళం  
- పుట్టే బిడ్డా పుట-7)

వీరిలోని స్వచ్ఛతను "మగువకన్నట్టోదా' గీతం కూడా చాటుతుంది.

ఆడపిల్లకన్న - నిన్ను కన్నెయ్యా  
తేడా లిరువురి నడుమ చూపలేదయ్యా  
(పుట-14)

వీరు మాయా మర్మం తెలియని వాళ్ళు  
మూల జాతోళ్ళు- మల్లె పువ్వులాంటోళ్ళు  
(దళిత స్త్రీలమ్మో పుట-8)

అయినా ఈ దళితులు ఇల్లు దబ్బు లేని వాళ్ళు వారి స్త్రీలు-

మొగవానల్లె పారపలుగు  
సుత్తెత్తుతారు - గాలి తిత్తుదుతారు  
చేల పత్తేరు తారు.

వల్లెకాడ కల్లు కాడ హక్కడుగుతారు
సరి హక్కడుగుతారు
(పుట-8)

వీరు పురుషులతో సమానమే, పనిలోనైనా, శ్రమ నుంచి సేద తీరటంలోనైనా, సమానత్వం మూల వాసుల లక్షణం. ఈ స్త్రీలది ఎంత ప్రేమతత్వమో కూడా చాటాడు కవి.

నచ్చిన మొగడు మంచోడైతే
పిచ్చోలౌతారు - ప్రేమ పిచ్చోలౌతారు
సీతాలచ్చిమౌతారు.
లుచ్చాగాడు బిగువోడౌతే -మానం బోతారు
మారు మానం బోతారు
(పుట-8)

ఇక్కడ స్త్రీ స్వభావమే కాదు జాతి ఆచారాన్ని కూడా చెప్తున్నాడు కవి. జాతి నిక్కచ్చితనాన్ని సూటి తనాన్ని కూడా ఇందులో చాటాడు.

స్త్రీ సమానత్వం గౌరవం మూల వాసులలో కనిపించటానికి కారణం ఇది మాతృస్వామ్య వ్యవస్థకు ప్రతిబింబం కావటమే. మాతృస్వామ్య వ్యవస్థ అవశేషాలకు వీరు సజీవ సాక్ష్యాలు.

ఆరెల్లి వీధిలో ఎల్లు మాసాయన్న - తల్లిగారైనట్టి పైడి ముత్యాలమ్మ
పండ్లమ్మి బత్కులీడ్చే మా మూలవాసమ్మ
(మల్లె తోటికి పుట9)

అంటూ కవి కీర్తించిన ముత్యాలమ్మ తల్లి పైన పేర్కొన్న వ్యవస్థకు నిదర్శనమే. మూలవాసులు తాము నమ్ముకున్న మాతృస్వామిక వ్యవస్థను కాపాడుకుంటూ గ్రామ దేవతలను పూజిస్తూ జాతరలు పండగలు చేస్తుంటారు". దీనిని మాతృస్వామ్యం అనే కంటే మాతృ ప్రధాన లేక మాతృపారంపర్య(**Matrilineal**) వ్యవస్థ అనడం సబబు (పుట-23) అంటాడు శ్రీ మద్దెల రాజు తన "మాష్టార్జీ దళిత గీతాలు మూల వాసుల సిద్ధాంతం" అనే గ్రంథంలో. తల్లి ప్రాధాన్యాన్ని మాష్టార్జీ గుర్తించాడు. కేవలం తల్లిని గూర్చేగాక దైవ స్వరూపిణీ అయిన తల్లిని (లచ్చవ్వ బతుకమ్మ) గూర్చి పాడాడు. అమ్మ సమాజానికి మూలం. అమ్మ సంస్కృతికి మూలం అమ్మ ఒక గణవ్యవస్థ అనే చారిత్రక అవగాహనలతో... మాష్టార్జీ రాయటాన్ని కత్తి పద్మారావు 'మాష్టార్జీ' ఒక యుగళగీతం' అనే ముందు మాట (స్త్రీ తత్త్వ గీతాలు)లో పేర్కొన్నాడు. అధికతర మూల వాసుల జీవనం మాతృస్వామ్యంలోనే ఉందన్నది నిర్ద్వంద్వంగా చెప్పుకోదగ్గ విషయం.

దళిత సాహిత్యంలో ఆర్య, వైదిక, వైష్ణవ మతాలు మత గ్రంథాలూ అనేక విధాలుగా ప్రశ్నింపబడుతూ ఉన్నాయి. అలా దేవుళ్ళు బ్రహ్మణులు, పండితులు, మతగురువులూ, కాలాల పొడవునా మానవులు తీర్చి దిద్దిన ధర్మశాస్త్రమూ ప్రశ్నింపబడ్డాయి. జాతికి నీతి ధర్మ సూత్రాలను నిర్దేశించని మనువు. ఎక్కువగా నిరసనలకు గురి అయ్యాడు. 'మగువా మన స్త్రీ జాతికి - అన్యాయం చేసినోడు
మనకు హక్కులుండొద్దని-మొట్ట మొదలు చెప్పినోడు
మనువన్నవాడే అసలు మగువా జాతి శత్రువమ్మా



(ఇందనమై పుట-17)
మనుభావాలతో ఇంట్లోని పురుషులంతా స్త్రీని అణగదొక్కుతున్నారన్నాడు.

మరోచోట లెల్లెకులస్త్రీ వ్యథలను సమాజంలోని వివక్షను చెప్తూ, ఎంఎల్యే కొడుకు మంత్రి, క్లర్కు కొడుకు కలెక్టరవుతుంటే నీ కొడుకెందుకు నీ వృత్తే చేస్తున్నాడంటూ

దీనెనుక మనువాదుల -మాయలు ఉన్నాయమ్మా
మాయగాళ్ళంతా కలిసి - మనల నణగ దొక్కుతుండ్రు
(రెల్లి తల్లీ నీకెన్ని బాధలో పుట29)

అంటూ మనువాదుల రాజ్యం పోతే తప్ప ఈ బాధలు పోవన్నాడు. 'ఇదేం ధర్మమన్నా' గీతంలో మనుధర్మం ఎంత అధర్మమో చాటాడు. చాతుర్వర్ణాలు దేవుడికి వివిధాంగాల నుంచి పుట్టటాన్ని ఉటంకిస్తూ పుట్టవలసిన చోటు నుండి పుట్టారు. కాబోలు వారు మాలమాదిగల పేరు ఎత్తలేదన్నా అంటాడు.

'తాను బాగుంది - తన తమ్ముడొకడు చెడిపోతే
సంక లెగిరేసే గుణం- మను ధర్మంలుందన్న

---

మను ధర్మ కర్మాల - జాతి నరక మోతుంటే
ఇంకేడ మిగులూతుంది-భరతజాతి రేపన్నా'
(పుట 39)

అంటూ మనువు ఏర్పర్చిన ధర్మం ఎంత హేయంగా ఉందో తెల్పాడు.

మనుధర్మశాస్త్రాన్ని సమాధి చేసే హిందుకోడ్ బిల్లును ప్రస్తావిస్తూ

'మగవారిలో ఆమె విలువ- దిగజారుదు తనము చేసి
ఆటబొమ్మకన్న అతివ- అతి హీనం నేడంటూ
ఆడుకొనగ మనువుగాడు - గీసిన గిరిని తుడిపేయగా
(పుట 47)

అంటూ అంబేద్కర్ రూపొందించిన చట్టాల్ని ప్రస్తుతించాడు

సమాజ స్థాపనకు వర్గ నిర్మూలనాన్ని కోరే లాల్ జెండా కుల నిర్మూలనాన్ని కోరే నీతిజెండా ఉద్యమాలను ఉద్దేశిస్తూ

'మనిషి గుండె నడవాలంటే
సిరలు, దమనులుండాలమ్మా
విప్లవము రావాలంటే
నీతి- లాత కలవలమ్మా' (నీతి+లాల్ పుట 46)

అని పేర్కొన్నాడు. దీనిలో పీడితుల విముక్తి కోసం పోరాడే ఎర్రజెండా కమ్యూనిస్టులు, దళితుల కోసం ఉద్యమించే నీతి జెండా దళిత వీరులు సిద్ధాంత రాద్ధాంతాల జోలికి పోకుండా కులాన్ని మతాన్ని కూల్చేందుకు కదిలి రావాలంటూ నీలం- ఎర్రదనం కలగలిసి పోవాలంటాడు మాష్టార్జీ (హరిజనాభ్యుదయం- ఆధునికాంధ్ర కవిత్వం డా॥ కల్లూరి ఆనందరావు పుట-187)

3. సమాజంలోని స్త్రీలందరూ పురుషుల వలన వివక్షకు గురవుతున్నారనేది అక్షర సత్యం. ధనం ఉన్న స్త్రీకి సుఖం లేదు. ధనం లేని స్త్రీకి మరుగులేదు. కాని పురుష సాంగత్యం అనుకూల దాంపత్యం లేమిని కూడ సుసంపన్నం చేసిన స్థితిని 'బాలమ్మ

గీతం' చాటుతూ ఉంది.

స్త్రీలలో వ్యత్యాసాలు వివక్షలూ ఉన్నాయి. స్త్రీలు తిరిగి తమలో తామే కొందరిని వివక్షకు గురి చేస్తూ ఉన్న దయనీయ జీవన దృశ్యాన్ని చిత్రించాడు మాష్టార్జీ. స్త్రీలలో ఉండే ఈర్ష్యాద్వేషాలను, తరాల అంతరాలను, అత్తరికాన్ని, కట్నం వంటి దురాచారాన్ని తోటి స్త్రీ పట్ల కనీస స్పందన లేని స్త్రీలను 'అమ్మలాలో' అనే గీతంలో చాటాడు.

'స్త్రీల ఉద్యమాలంటూ - మేలుకో సంఘాన్ని పెట్టి
కాలుకు మన్నంటకుంట- తిర్గె వర్గ మహిళలంత
హైకాస్లు ఆడవాళ్ళు- అనుభవించే సమస్యలే
అందర్వాడవాళ్లకున్న- అసలు సమస్య అంటూ
దళితస్త్రీల సమస్యలు- దాపుకొస్తే వొదిలేసి
విపక్షతను చూపించే స్త్రీవాదులు నేమంటారు'

(అమ్మలాలలో పుట 28)

అని స్త్రీ వాదులకు ఓ చురక వేశాడు.

'అదది మొగోడి కంటె- అసలు తక్కువంటూనూ
తేడ జూపి స్త్రీల విలువ-స్థాయిని తగ్గించినా నికృష్ట నీచ సంస్కృతిన్-
పోషించి పెద్ద చేసినా
అమానవీయ ధర్మమున్ - సమాధి చేయపూనగా' •

(దళిత మహిళలారా పుట 63) అంటారు

సమాజంలో దళితులు చేసే వృత్తుల పట్ల చిన్న చూపుంది. స్త్రీలు చేసే వృత్తుల పట్ల మరింత తక్కువ భావం. ఆ భావం ఎంత తప్పో, వారి పట్ల సహానుభూతి ఎలా ఉండాలో, వారేచేసే వృత్తులు కొన్ని ఎంత ఉదాత్తమయినవో ప్రకటించాడు మాష్టార్జీ.

జోగిని వ్యవస్థ ఒక దుర్భర వ్యవస్థ. దళిత స్త్రీల పాలిట శాపం. పిల్ల పెద్దదయినప్పుడు ఆరంభమయ్యే లైంగిక హింస, అనంతమూ దుర్భరమూను. ఊరందరి ఉమ్మడి సొత్తైన ఆ స్త్రీ శరీరం రోగాల పుట్ట అవుతుంది. ఆ రోగాలతో కృంగి కృశించి మరణిస్తూ ఉంటే ఆదుకొనే చేయి ఉండదు.

'ఈ కనులకు కలలూ మనసుకు కోర్కెలు నాకు ఉన్నవమ్మా
మీలాగే నాకు ఉన్నవమ్మా....

నాలాంటి అసహాయ బ్రతుకులు - ఏ ఆడపిల్లకమ్మో
లేకుండా చేయండమ్మో....' (ఊరి దొరలకు పుట-31)

అని కోరడం వెనక కవి ఆరాటం స్పష్టం.

'నడిమింటి బోడెక్క బసివిరాలయ్యేద' అనే కథలో నాగప్పగారి సుందరరాజు, ఏడుస్తున్న పదేళ్ళ బోడక్కను ఊరందరూ కలిసి బసివిరాలిని చేసే సంబరాన్ని ఆర్భాటాన్ని హృదయాలను ద్రవింప చేసేలా చిత్రించాడు. దళిత స్త్రీలకు కొందరికి అది వృత్తి. అది ఆమె ఇష్టపూర్వకంగా ఎంచుకున్న వృత్తికాదు. ఆమెపై రుద్దబడే వృత్తి. ఈ నైచ్య జీవన స్థితిని వృత్తిగా భావించటం వ్యర్థం. అది దురాచారంగా ప్రభుత్వం గుర్తించింది.

కాని గౌరవనీయమైన వృత్తులను కూడా నీచంగా చూసే సమాజ దృష్టిని మార్చే ప్రయత్నం చేశాడు మాష్టార్జీ. రెల్లి జీవితాన్ని 'మల్లెతోటకి' 'రెల్లి తల్లి' నీ కెన్ని బాధలో గీతాలలో వర్ణించాడు



కల్మశాన్ని తొలగించే రెల్లి స్త్రీ పట్ల చిన్న చూపు తగదన్నాడు. ప్రసవం చేసి బిడ్డను అందించే మంత్రసానిని వైద్యమాతగా కీర్తించాడు.

'నేడు ఈనాడున్న -శస్త్ర చికిత్సకు
నాడాద్యురాలైన - వైద్య మాత నీకు'

(అమ్మ మంగళమ్మా- పుట32)

అంటూ 'జన్మనిచ్చిన తల్లి- తండ్రి కాదు మిన్నా పురుడు
పోసిన - మంత్ర సానియే గొప్పని'

(పుట- 33) తేల్చాడు

అలాగే అయిన వాళ్ళంతా అవతలుంటే అన్ని పనులు చేసి పునర్జన్మ నిచ్చే ప్రాణాదాతలయిన నర్సుల శీలాలు ఎగతాళికి గురికావడాన్ని బాధగా గుర్తు చేస్తూ.

'తంగమంత బంగారం- విలువ నీ వృత్తిదని-2 తల్లి
మధర్‌థెరీసమ్మా- తెలిపినదే సత్యం'

(నర్సు సిస్టరమ్మా పుట - 48)

అని పొగిడాడు' రెల్లికుల స్త్రీల గురించి నర్సు సిస్టరమ్మా గురించి మంగళమ్మా గురించి, సాదాసీదా మనిషిగా చేసిన సేవ కూడా ఉదాత్త మానవ సేవేనంటూ లింగమ్మ గురించి జోగినుల గురించి పాటలు రాసి వారి జీవితాన్ని సాహిత్యీకరించడం ఆదర్శనీయం' అంటాడు (బి.ఎస్. రాములు - మాష్టార్జీ ఒక అంతర్జాతీయ గీతం) అంతే కాదు ఒక సామాజిక అవసరం కూడా.

స్త్రీలను సమాజాన్ని చైతన్య పరిచే గీతాలనెన్నింటినో రాశాడు. పసివారిని పనికి పంపటం నేరమని పద్దెనిమిది ఏళ్లకు పూర్వం అమ్మాయికి వివాహం నేరమని, చట్టాలున్నాయ్ తెలుసుకో' గీతం చెప్తే, మంత్ర తంత్రాలు ప్రార్థనాగీతాలు మత సంప్రదాయాల తోనూ విపరీత ఖర్చు, ఎంతో సమయం వెచ్చించి చేసే వివాహం కాకుండా

'జంకుగొంకు లేక- జనమెదుట' ఆ జంట
కష్ట సుఖాలలో - కల్సి ఉంటామంటూ
పది మంది మేలుకై- పాటుపడతామంటూ
బంధు మిత్రుల యందు - బాసలే చేసిండు'

(ఈ ఏందివ్వోపు 24)

అలాంటి ఆదర్శ వివాహం ఎంత ఆచరణీయమో చెప్పాడు.

సారా అలవాటు కుటుంబాలను కుంగదీసి పరువు మంట గలిపే వైనాన్ని' ఇల్లూ- ఇల్లాలు'లో చెప్పిన కవి, సారా ఉద్యమ సారధులుగా స్త్రీలు, నెల్లూరు కేంద్రంగా చేసిన పోరాట చైతన్యాన్ని ఒక చారిత్రక ప్రాధాన్యాన్ని' మహిళా జాతంతా'లో ఆలపించాడు.

స్త్రీలకు ఆదర్శప్రాయంగా నిలిచే నడిచే స్త్రీలను కీర్తించాడు కవి.

'సంఘటనలె జీవితమై సాగిన తల్లీ
జీవితమే పోరుపోదై పూచిన మల్లి
పదవికంటె మూల జాతి పరువు ముఖ్యమంటూ
హక్కుల సాధన కొరకై పోరు సల్పినావు
దండోర తెలంగాణ ఉద్యమాలకు

ఆధ్యురాలివి నీవు నిన్ను మరువమమ్మా...'

(పు 49)

అంటూ 'సదాలక్ష్మి'ని

'వేదాలను వల్లించే - పుణ్య భూమిలో
గోమాతను పూజించే -కర్మధాత్రిలో
చంధాలులు గుండె విరిచి -రాజ్యమేలగా
దండోరై యూపిలో -నిలిచిన మల్లీ'

(పు 50)

అంటూ మాయావతిని స్ఫూర్తి దాతలుగా స్తుతించాడు తమ రంగాలలో జయ కేతనాలు ఎగరేసి, జాతీయంగా అంతర్జాతీయంగా దేశ బావుటాను సగర్వంగా నిల్పిన రాజకీయ రంగ స్త్రీ మూర్తులు ఇందిరమ్మ, జయలలిత, మాయావతి, సాహితీ రంగ నిష్ణాతులు మొల్ల యద్దనపూడి అరుంధతీరాయ్, సంగీతరంగ ప్రముఖులు సుబ్బలక్ష్మి, చంద్రమ్మా, మీరాబాయి తారామతి, సుశీల జానకి, లత, క్రీడారంగ వనితలు, పిటి ఉష, మల్లీశ్వరి సెల్వనా మొదలైన వారిని' 'అవకాశం తీసుకుంటెరో'లో 'అవకాశం తీసుకుంటెరో- మా మహిళలంత అంబరాని కంటు కుంటరూ...

శివకాశి సీమటపోలై - శివసతై
తమ సత్త రుజువు చేస్తారు ' (54) అని స్త్రీ స్ఫూర్తి ప్రధాతలను పేర్కొన్నారు.

మాష్టార్జీ మరో రచన, చారిత్రక నాటకమయిన 'అంగులీమాలుడు' అహింసకుడనే యువకుడు గురుపత్ని క్రోధం వలన గురుశాపానికి గురయ్యాడు. 1000 అంగులులు/ వేళ్ళు హారంగా వేసుకొంటే శాపవిమోచనం అవుతుందన్న గురువు మాటతో హింసకుడయి. 999 మందిని వధించి వారి వేళ్ళు మెడలో వేసుకొన్నాడు. మానవత్వం నశించిన అంగులీమాలుడికి వెయ్యో వ్యక్తిగా బుద్ధుడు తటస్థపడి శాపపాపాల వంటివి ఉండవని, ఎలా అహింసకుడు గురుపత్ని మోహానికి కుతంత్రానికి బలి అయ్యాడో విడమర్చి అతనిలో పరివర్తన తేవటం కథ. అంగులులను మాలగా ధరించాడు కనుక అంగులీమాలుడయ్యాడు.

పాత్రగా కనిపించిన స్త్రీ గురుపత్ని. సంభాషణాంతర్గతంగా ఆమె స్వభావాన్ని దుష్టంగా మాత్రమే చూడగలం. కనిపించని పాత్ర స్వభావ అంచనా అవసరం. ఇందులో కనిపించే ఒకే ఒక్క స్త్రీ పాత్ర, పేరు లేని పాత్ర విష్ణుశర్మ తల్లి. అంగులీమాలుడు చంపిన విష్ణుశర్మ కన్నతల్లి ఈమె. ఆరంభంలో తన పుత్రుడిని కాపాడమని కోరింది. ఆ చావును ఏ విధంగానూ నిరోధించలేకపోయిన రాజును, మంత్రిని, సేనానిని నిలదీసింది. రాజు ఇచ్చిన నష్ట పరిహారాన్ని వారి మొహానే కొట్టింది. బిడ్డను పోగొట్టుకున్న తల్లి ఆక్రోశం అంగులీమాలుడిపై కోపం ఎంతటి వారినైనా చలింపచేస్తుంది.

ఈ విషయం రాజసభకు వచ్చి విన్న గౌతమబుద్ధుడు అంగులీమాలుడిని తెచ్చి మూడు నెలల పిమ్మట రాజు ముందు నిలుపుతానన్నాడు. ఆ ప్రకారమే తెచ్చాడు. పరమ కర్కోటకుడు నీచుడు హంతకుడు అయిన వ్యక్తి, ప్రశాంత వదనంలో అమాయకంగా ఉన్న



వ్యక్తీ ఒకరే అంటే సభలో ఎవ్వరూ నమ్మలేదు అహింసకుడి తండ్రి అహింసకుడేనని ఋజువు చేసే పుట్టు మచ్చను చూపినా ఎవరూ నమ్మలేదు. అంతటి పరివర్తన ఒక నరహంతకుడిలో సాధ్యమా అనే విచికిత్స ఎవరినీ వీడలేదు. అప్పుడు విష్ణుశర్మ తల్లి దానిని స్పష్టం చేసింది. పరివర్తన చెందిన భిక్షువుగా మారి భిక్షాటనకు వచ్చిన అంగులీమాలుడిని తామంతా గుర్తించామంది. ఆ హంతకుడిని తిట్టి రాళ్ళూ కర్రలతో కొట్టారు. ఎంత హింసించినా నోరెత్తకుండా అన్నింటిని భరించి మౌనంగా సాగిపోయిన ఆ భిక్షువులోని పరివర్తన తామందరిని అబ్బురపర్చిందని చెప్పింది విష్ణుశర్మ తల్లి. ఆ రాజు తదితరులను బౌద్ధంలోనికి మార్చే అంతటి ప్రభావాన్ని చూపింది. ఆరంభంలో హంతకుడిగా అంగులీమాలుడి పట్ల విష్ణుశర్మ తల్లిలో ఉన్న వ్యతిరేకత, బౌద్ధ భిక్షువుగా వచ్చినప్పుడు తిట్టీ కొట్టడంలో కొంత తీరింది. తమ చర్యలకు ఏ మాత్రం స్పందించని అంగులీమాలుడిలోని మారిన నైజం ఆమెలోనూ పరివర్తన తెచ్చింది. అందుకే ఆమె అతని మార్పును సభలో చెప్పగలిగింది. బుద్ధుడు అంగులీమాలుడిని మార్చ గలిగితే, బౌద్ధతత్వాన్ని ఆచరణలో చూపిన అంగులీమాలుడు విష్ణుశర్మ తల్లిని మార్చగలిగాడు. శత్రువు పట్ల వైరాన్ని విస్మరించే హృదయ వైశాల్యాన్ని పెంపొందించే బౌద్ధ ధర్మాన్ని వాచికంగా కథాముఖంగా గోప్యంగా విష్ణుశర్మ తల్లి ద్వారాను మాష్టార్జీ చాటాడు.

3. స్త్రీ తత్త్వ చిత్రణలో మాష్టార్జీ వ్యక్తిత్వం కనిపిస్తుంది. మానవుల స్వభావాలను వారిలోని లక్షణాలను నిర్ణయిస్తాయి. ధైర్యం, సాహసం, పరాక్రమం, సహనం, దయ, ప్రేమ, కరుణ వంటివెన్నో లక్షణాలున్నాయి. ఈ లక్షణాలను దురదృష్టం కొద్దీ పురుషలక్షణాలుగా స్త్రీ లక్షణాలుగా విభజించారు. ముందు పేర్కొన్నవి పురుషులకు తర్వాత పేర్కొన్నవి స్త్రీలకు నిర్ణయించటంతో ఆ లక్షణాలకు లింగ వివక్ష ఏర్పడింది. దళిత బహుజనుల్లో ఆ వివక్ష పూర్తిగా వేళ్లూనుకోక పోవటం మూలాన ఈ లక్షణాలన్ని అందరిలో కనిపిస్తాయి. అందుకు నిదర్శనం మాష్టార్జీ, ఆయనలో, లోకంలో ఏవైతే స్త్రీ లక్షణాలని రూఢి అయ్యాయో అవి ఉన్నాయి. స్త్రీకి మాతృత్వం ఒక అద్భుతంగా చెప్పి ప్రపంచంలో స్త్రీత్వంలోని బహుపార్శ్వాలను యాద గొప్పోడాలో చాటాడు. స్త్రీ ఎంత సహిస్తుందో, ఎంత వివక్షకు గురవుతుందో, ఎంత నిర్లక్ష్యాన్ని చవి చూస్తుందో చెప్తూనే, తల్లి రుణం ఏమిచ్చీ తీర్చలేవు. అంటూ 'నీకున్న ప్రాణాన్ని దానమిచ్చిన దాన్ని' అంటాడు కవి. స్త్రీ వాదులు సైతం గర్వించిన వాక్యం. మాతృత్వం తల్లికి ఒక గొప్ప హోదా కల్పించటం కాదు. బిడ్డకు తల్లీ ప్రాణాన్ని దానమిస్తూ ఉంది. ఆమె పొందటం కాదు ఇస్తూ పై చేయిగా ఉంది. ఆమె మాతృత్వంతో అత్యున్నత స్థితిని పొందటం కాదు మాష్టార్జీ చెప్తోంది. ఆమె మరొకరి అస్తిత్వాన్ని ఏర్పర్చటంలోని ఉన్నతత్వాన్ని, తల్లిని గూర్చి ముందు పాటలలో ఎన్ని చెప్పినా, తల్లిదనానికి తలమానికంగా నిల్చే ఈ వాక్యం, మాష్టార్జీ స్వభావంలో నుంచే వచ్చింది. అందుకే మాష్టార్జీ కవితలు స్త్రీతత్వ ప్రదర్శనకు దర్పణాలయ్యాయి. ■

# ప్రజాకళా ప్రయోక్త హబీబ్ తన్వీర్

శైలి



**1940** దశకంలో అభ్యుదయ రచయిత సంఘం. ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ (ఇప్టా) దేశవ్యాప్తంగా కళాసాహిత్యాలను ఓ ఉద్యమంగా భూమార్గం పట్టించాయి. హబీబ్ ఈ ప్రగతిశీల ప్రజాస్రవంతిలో మమేకమయ్యాడు. స్వాతంత్రోద్యమంలో జైలు పాలయ్యి ఆ రాజకీయ ఖైదీలచే జైలు గోడలు మధ్యనే నాటకాలు ఆడించాడు.

నాటకం సర్వ కళల సమాహారమని నాటకం జీవితాన్ని అనుకరిస్తే జీవితం నాటకాన్ని అనుసరిస్తుందని నాటకకర్తలకు తెలుసు.

తెలియడం వేరు, తెలిసిన దాన్ని ఆచరణతో సుసాధ్య చేయడం వేరు.

నాటకం జీవితాన్ని దగ్గరగా ఉండమే కాదు. నాటకం ద్వారా జీవితం నేర్చుకుని ముందుకు సాగాలి. నాటక ధర్మం అంటే అదే. అంతేకాదు ప్రతి జానపద కళకు తనదైన గొప్పశక్తి ఉంటుంది. వాటిని వడివేసి పగ్గాలతో పట్టుకుని, లగువు బిగువులతో నాటకాన్ని పెనవేసి, రంగస్థలంపై ఝుంఝూ మారుతంగా నడిపించిన దర్శకుడు హబీబ్ తన్వీర్.

86వ ఏట జూన్ 8న, ఆయన కన్ను మూయడంతో భారత నాటక రంగం చిన్నబోయింది. ఆరు దశాబ్దాల పాటు, ఇంకా చెప్పాలంటే యావత్ జీవితం ఆధునిక ప్రజానాటకానికే అంకితం చేసిన గొప్ప వ్యక్తి ఆయన.

వార్ధక్యం పైబడినా ఎప్పుడూ నవయవ్వనమే. పెదాలపై చెరగని చిరునవ్వే. నలుగురు మధ్య సమూహంలో నాటకం గురించే చర్చ. నాటక విజ్ఞాన సర్వస్వం. ఆయనను కళ్ళారా చూసిన వారికి ఇది ప్రత్యక్ష అనుభవమే.

'హబీబ్‌సాబ్' అని గౌరవంగా పిలుచుకునే ఆయన అసలు పేరు హబీబ్ అహ్మద్‌ఖాన్. యువకునిగా కవిత్వం రాసే తొలినాళ్ళలోనే ఆయన తన కలంకు తన్వీర్ అని పేరు పెట్టుకున్నాడు.

1923 సెప్టెంబర్ 1న రాయపూర్‌లో జననం. లార్రై మున్సిపల్ హై స్కూల్‌లో మెట్రిక్యులేషన్, నాగపూర్ మార్రిస్ కాలేజీలో బి.ఎ. ఆలీఘర్ ముస్లిం యూనివర్శిటీలో పోస్ట్ గ్రాడ్యుయేషన్.

ఆ తదుపరి బొంబాయి ఆలిండియా రెడియోలో ప్రొడ్యుసర్‌గా ఉద్యోగం. అప్పుడే నాటకాలు రాయడం, ఆడటం మొదలుపెట్టాడు. కొన్ని హిందీ సినిమాలకు మాటలు, పాటలు కూడా రాశాడు. ఇవన్నీ స్వాతంత్ర్యానికి ముందే.

1940 దశకంలో అభ్యుదయ రచయిత సంఘం, ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ (ఇప్టా) దేశవ్యాప్తంగా కళా సాహిత్యాలను ఓ ఉద్యమంగా భూమార్గం పట్టించాయి. హబీబ్ ఈ ప్రగతిశీల ప్రజాస్రవంతిలో మమేకమయ్యాడు. స్వాతంత్ర్యోద్యమంలో జైలుపాలయ్యి ఆ రాజకీయ ఖైదీలచే జైలు గోడల మధ్యనే నాటకాలు ఆడించాడు.

తనకు ఉన్న నాటక ప్రతిభను, ఆసక్తిని మరింత శక్తిగా మార్చుకునేందుకు 1955లో ఇంగ్లండు వెళ్ళి రాయల్ అకాడమీ ఆఫ్ డ్రమెటిక్ ఆర్ట్స్‌లో శిక్షణ పొందాడు. 1956లో బ్రిస్టల్ ఓల్డ్‌వైస్ థియేటర్ స్కూల్‌లో దర్శకత్వ ప్రజ్ఞ గురించి శిక్షణ నేర్చుకున్నాడు.

ఆ తర్వాత రెండేళ్ళు యూరప్ అంతా పర్యటించి వివిధ దేశాల నాటకం తీరుతెన్నులను అధ్యయనం చేశాడు. ముఖ్యంగా బెర్లిన్‌లో బ్రెహ్ట్ నాటకాలపై ఎక్కువ మక్కువ చూపాడు. నాటకంలో బ్రెహ్ట్ ఎలియనేషన్ థియరీని (పరాయీకరణ సిద్ధాంతం) ఓ సవాలుగా స్వీకరించాడు.

జీవితంలో హబీబ్‌పై పడిన విశేష ప్రభావమిదే.

నాటకం జనానికి తెలియకుండానే మైమరిపిస్తూ రసజ్ఞతతో ఎడ్యుకేట్ చేయాలి. ఈ మార్గం ఎక్కడ దొరుకుతుందా? అని శోధించాడు. శ్రమించాడు. కలుగులో ఎలుక దూరినట్టు అట్టడుగు జనావళి మధ్యకు దూరిపోయాడు చత్తీస్‌ఘడ్ ఆదివాసిల మధ్యకుపోయి వారి ఆచారాలు, సంప్రదాయాలు భాష, అన్నింటిని ఔపోసన పట్టాడు. మట్టి సంబంధాలను మానవ సంబంధాలను సమాంతరంగా

శ్వాసించాడు. ఆ జన జీవితంతో కలిసిపోయి చివరకు వారితో కలిసి 1959లో నయా థియేటర్‌ను స్థాపించాడు.

మృచ్ఛకటికం. నాటకాన్ని తనదైన శైలిలో మట్టిబండిగా (మిట్టికా దాడి) మలిచాడు. సత్‌రంజ్‌కి మోహ్రీ, ఉత్తర రామచరిత్ర, పొంగా పండిట్, రాజ్‌రక్త్, ఆగ్రాబజార్, చరణ్‌దాస్‌చోర్, జహరీ లూహవా (భోపాల్ విషవాయు ఘటనపై) జిస్ లాహోర్‌నే నాదే ఖాహో, ఇలా ఆణిముత్యాల్లాంటి ఆధునిక నాటక కళాఖండాలను సృష్టించి భారత రంగస్థల చరిత్రలో ప్రజానాటక అధ్యాయాన్ని లిఖించాడు.

ఏ నాటకానికదే ప్రత్యేకత ఉన్నప్పటికీ ప్రతిదీ నాటక కళాకారులకు ఓ పాఠమే,. ఆగ్రా బజార్‌లో నాటకం సెట్ వేయడమే ఓ విశేషమైన నిజమైన బిచ్చగాళ్ళతో పాటలు పాడించడం మరో విశేషం.

చరణ్‌దాస్‌చోర్ నాటకమే చిత్రమైన జానపద కథ చరణ్‌దాస్ అనే దొంగ ఏనుగు అంబారీ ఎక్కనని, బంగారు పళ్ళెంలో అన్నం తిననని, స్వయంగా రాకుమార్తె ప్రేమించి వచ్చినా వివాహమాడనని హేళనగా ఓ గురువుకు మాటిస్తాడు. ఇవికాదు నీవు జీవితంలో ఎంత కష్టమైనా ఆచరించగల ఓ మాటివ్వమని గురువు అడుగుతాడు. అప్పుడే సత్యమే చెప్తానని మాటిస్తాడు.

ఆ మాటకు కట్టుబడి తన వృత్తి దొంగతనమైనా, ఎప్పుడు ఏ విధంగా ఎలా దొంగతనం చేసిందీ నిర్భయంగానే చెప్తుంటాడు. ఆ రాజ్యాన్ని పాలించే రాకుమార్తె ఇతడి ధైర్యాన్ని మెచ్చుకుని ప్రేమిస్తుంది. ఏవైతే గురువుతో హేళనగా చెప్పాడో అవే జీవితంలో ఒకటొకటి నిజమవుతాయి. తన ప్రేమను గోప్యంగానే ఉంచమని రాకుమారి బతిమిలాడుతుంది. కాదంటే మరణశిక్ష తప్పదని హెచ్చరిస్తుంది. చావుకైనా సిద్ధమే తప్ప అసత్యమాడనని తన చావును తానే కోరుకుంటాడు. ఇచ్చిన మాటకు కట్టుబడి సత్యం కోసం ప్రాణాలు వదులుతాడు నాటకం చూసిన తర్వాత సత్యశోధన, సత్యసాధనకై మానవాళి హృదయం కదులుతుంది. ఆలోచన పదునెక్కుతుంది. ఆచరణ అడుగిడుతుంది. త్రివేణి సంగమంలా జన జీవితంలో అంతర్భాగం అవుతాయి.

నాటక కళ కుండే శక్తి ఇదే. నమ్మిందే చేయడం, చేసేదే నమ్మడం అనే మహోన్నత లక్షణం ఓ సామాన్య లక్షణంగా. సాంస్కృతిక లక్షణంగా అల్లుకుపోవడమే జనపదుల కళ అని బోధపరుస్తాడు.

పాకిస్తాన్‌లో హిందువులు మైనార్టీలు, అక్కడ హిందువులు ఎంత భయంగా గడుపుతున్నారో, ఎన్ని అవమానాలు, అనుమానాలు ఎదుర్కొంటున్నారో మానవీయ లక్షణాలుగల ముస్లింలు ప్రాణాలకు తెగించి హిందువులను ఎలా కాపాడుతున్నారో 'జిస్ లాహోర్‌నే నా దేఖాహో' నాటకంలో చూస్తాము.

అందుకే మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి దిగ్విజయ్‌సింగ్ మతసామరస్య కళా ప్రతీకగా హబీబ్‌ను అభివర్ణించారు.

1972-78 కాలంలో రాజ్యసభ సభ్యుడుగా వ్యవహరించినా 1983లో పద్మశ్రీ, 2002లో పద్మభూషన్ వంటి పదవులు వరించినా, వినమ్రతతో నేలమీద తనతోపాటు నాటకాన్ని జనం కోసం నిలుపుతూ ముందుకు సాగిపోయిన హబీబ్ నిజంగా మార్గదర్శకుడే.

■

# స్త్రీ ఏకాక్షరం కాదు

శైలజా మిత్ర



ఉదయించిన సూర్యబింబం
తూర్పు తరుణి నుదుట సింధూరమై
కొండకొనల నుండి తల్లి పిలుపు వినిపించినట్లు
ఇసుక తిన్నెలనుండి ప్రేమ వెల్లువ ముంచెత్తినట్లు
కంటికి మింటికి కనిపించని దారమంత అనుబంధంలా
మనసుకు మనిషికి మధ్య అల్లినట్లుంది స్త్రీ మనోరంజనం

అనుగ్రహించిన అమ్మనుండి మొదలై
అవహేళనలకు గురి అవుతూ
ఆవేదనల రెప్పల అంచులపై బరువుగా వాలిపోతూ
అనంత విశ్వంలో అందని ఆలాపనై
అడుగడుగునా వినిపించే అపనిందల చంద్రికై
అయోమయంగా సుషిప్తావస్థలో నడుస్తున్నట్లుంది స్త్రీ జీవితం....!!

బాల్యం, యౌవనం, ప్రౌఢత్వం, వృద్ధాప్యం
నాలుగు ధ్వజస్థంభాలై కాపలా కాస్తూ
ప్రతి అణువునూ పులకింపచేసే వెలుగువాకిళ్లలో
బారులు తీరిన పూలదండల మాలల్లా...
దివ్యానుభూతిని అందిస్తున్న ఆకాశంలా
సాలెగూడులో స్వప్నబంతిలా వుంది స్త్రీ తేజశ్చక్రం....!!

కమ్మని నిదుర జారిపోయి మేలుకునే లోగా
కళ్లు తెరచి కపటాన్ని గుర్తించి మాట్లాడేలోగా
ఆలోచనలు ఆవిర్భవించి అడుగుతీసి అడుగువేసేలోగా
కన్న కలల్ని కోల్పోయి కన్నీటికి ప్రతీకగా మారుతోంది
స్త్రీ వైశిష్ట్యం....!!

తల్లి పిలుపులో ... తండ్రి పలుకులో
బిడ్డ నవ్వులో... ప్రియుని వలపులో
భక్తిలో, రక్తిలో, ఆశలో, ఆశయంలో
నిరంతర నామస్మరణలా సాగే నాదలహరిలా
అంతర్భాగాన జలధి తరంగాల్లా ఎగసి ఎగసి
సుఖ దుఃఖాత్మక సర్వస్వాన్ని బింబిస్తోంది స్త్రీ ఔన్నత్యం...!!

ఒకచోట మోసం.. ఒకచోట దౌర్జన్యం...
ఒకచోట నమ్మకద్రోహం... ఒకచోట అన్యాయం...
కళ్ళ ముందు సహజం... వెనుక అసహజం
వీటిమధ్య నిశ్శబ్దం సుకుమారం

అలజడి చెందుతున్న అతివలకు విశ్రాంతి ఒక పదం
సమాజాభ్యుదయానికి మొట్టమొదటి ఆశారూపం
స్త్రీ జననం...!!

ఇంటికి ఇంతి కాంతి అయినా...
పుట్టింటిలో పూబంతిగా... మెట్టినింటిలో మైనపువత్తిలా
బాధల్ని ముడిచిన పొట్లమై గుండె అంచుల్ని మెలితిప్పుతూ
మొగలిరేకుల్ని మొహమాటంగా ధరిస్తూ...
నైరాశ్యంగా నీటిబిందువుల్ని నేలరాల్చుతూ
ప్లాస్టిక్ పలకరింపులతో సంధించిన ప్రశ్నలావుంది
స్త్రీ స్వాతంత్ర్యం...!!

నదిజలాలు ఎంతటి గంభీరమైనా చేతనలో స్త్రీ ఆకారం.
అవని ఎంతటి సహనంగా వున్నా యోచనలో స్త్రీ నియమం
కన్న వారిని, బిడ్డల్ని, అయిదవతనాన్ని ఒడిని నింపుకుని
చేస్తున్న స్త్రీ ప్రయాణం ఒక ఫలాకృతం... !!
అందానికో, ఆరాధనకో, ఆహార్యానికో, ఆహార్యానికో
ఎక్కడికైతేనేం?
మనోస్పర్శలోనే మౌనంగా వుండిపోతోంది స్త్రీ శాంతం..

అందుకే...
స్త్రీ ఏకాక్షరం కాదు
సకలచరాచర సృష్టికి కరతలామలకం
కదిలే జనప్రవాహానికి సాక్షీభూతం
అగ్నికి ఆహుతిచేసినా... నెత్తుటితో స్నానం చేయించినా
కోటి కాంతి వత్సరాలలో దొరకని నీ ఉనికికి ప్రతిబింబం...!!

# అభిమన్యుడి ఆత్మహత్య

హిందీ కథ
మూలం : విజయ్
అనువాదం : ఆర్. శాంత సుందరి



**అతను రాకుండా ఉంటే బావుణ్ణు అనుకుంటాను. అలా అనుకోటం పూర్తవకముందే డోర్‌మాట్ మీద బూటుకాళ్లని చప్పుడు చేస్తూ తుడుచుకుని రమాకాంత్ లోపలికొస్తాడు. అతన్నిరాకుండా ఆపటం నాశక్తికి మించిన పని అని అనిపిస్తుంది. నైట్‌క్వీన్ పరిమళం మూసి ఉన్న తలుపుల్ని కూడా లెక్క చెయ్యకుండా లోపలికొచ్చి మరుక్షణం మనని మంత్ర ముగ్ధుల్ని చేసినట్లు, అతని రాకతో కూడా అటువంటి పరవశమే నన్ను చుట్టు ముడుతుంది. ఎటువంటి బంధుత్వమూ లేకపోయినా ఏదో ఆత్మీయత ముడివేసుకుంటుంది.**

ఎన్నోసార్లు, ఇతనెందుకిలా వస్తాడు? అనుకున్నాను. పైగా నాకు అతన్ని చూడాలని లేనప్పుడే అతని అడుగుల సవ్వడి ఎందుకు వినపడాలి? అతని జీవితం ముళ్లపొదల్తో నిండి ఉంది, అందులో పువ్వులు పూయించటం నాకు సాధ్యమయే పని కూడా కాదు. అతని కాళ్లకి అయిన గాయాలని నిమిరి ఓదారిస్తే నాకూ సంతోషం కలగదు, అతని బాధా తగ్గదు. మరి ఇలా ఇద్దరిమధ్యా అనుబంధం ఉండటం వల్ల లాభమేమిటి?

తీరా రమాకాంత్ వచ్చాక, నేను ఎంత ప్రయత్నించినా అతనితో లంటీముట్టనట్టు ఉండలేను. కళ్లల్లో ఏ కొద్ది కరుకుతనం ప్రదర్శించబోయినా అతను నాలో ఉండే ఏదో సున్నితమైన తీగని ముట్టుకుని నేను మళ్లీ అతనిపట్ల ప్రేమగా ఉండేట్టు చేసేవాడు, "... డాక్టర్! ఇవాళ మీరు రవీంద్రుడి కవితలా ఉన్నారు... మౌనంగా కానీ భావగర్భితంగా... నల్ల మబ్బులు కమ్మినట్టున్న మీ జుట్టూ, పిల్లగాలికి ముంగురులు ఎగురుతూ.. ఒక్కటే లోటు! అక్కడక్కడా మంచు బిందువులు కూడ ఉంటేనా..." అనేవాడు.

"అలా ఊరికే మాట్లాడకపోతే, మౌనంగా ఉండకూడదూ! చివరికి కవితకైనా ఒక ముగింపు ఉంటుందిగా..." కోపం నటిస్తూ అతన్ని వారించాను. నిర్మల్ సిన్హా ప్రేమని రమాకాంత్ సూపర్ ఇంపోజ్ చేసెయ్యడు కదా! అనుకుని లోపల్లోపల వణికిపోయాను. నిర్మల్ కీ కవిత్వానికీ చాలా దూరమనేది వేరే విషయం.

అతను పకపకా నవ్వి, "పొరబడ్డారు డాక్టర్ విభా! కవిత్వానికి అంతు ఎక్కడుంది? దానికి తుది, మొదలు ఉండవు. అగాధమూ. అనంతమూ అయిన కాలానికి ఆవల ఉంటుంది కవిత్వం. కవిత ఆగిపోవచ్చు, కవి ఆగిపోవచ్చు, కానీ కవిత్వం అనంతం కదా! నేను మాట్లాడ కుండా ఉండాలంటే, ఈ అక్టోబర్ మాసపు చిరుచలిలో ఒక కప్పు టీ ఇస్తే చాలు..." అన్నాడు రమాకాంత్.

"నువ్వట్టి పిచ్చివాడివి రమాకాంత్! ఒక కప్పు టీ కోసం ఇంత పెద్ద ఉపన్యాసమా...!"

లేచి కిచెన్‌లోకి వెళ్లాను. ఇతని కోసమనే వంటింట్లో బోలెడన్ని వస్తువులని చేర్చాను. ఒకసారి పకోడీలు తినాలుందంటాడు. ఇంకోసారి కస్టర్డ్ కావాలంటాడు. ఏదో ఒకటి అడుగుతూనే ఉంటాడు. నేను కష్టపడి కూడబెట్టిన బద్ధకం అతను రాగానే ఎటోపోతుంది. అతను బతిమాలినట్టే అడుగుతాడు కానీ నాకు తెలీకుండానే దాన్ని నేను ఆజ్ఞలా శిరసావహిస్తాను.

"నీ రిజల్టు చాలా బావుంది రమాకాంత్. నువ్వే రాస్తావా లేక ఆవారాగాళ్లలాగా కాపీ మాస్తరువా?"

"లేదు డాక్టర్. చదువు తప్ప నాకింకేమీ రాదు. నాదగ్గర ఇంకేమీ లేవు. స్నేహితుల్లేరు, నా అని చెప్పుకోటానికి సొంతవాళ్లెవరూ లేరు. చెయ్యటానికి వేరే పనిలేదు. ఇక చదవక ఏం చేస్తాను?" చాలా దిగులుగా చెప్పాడు. అతను లోపల్లోపలే చాలా గాయపడి ఉన్నాడని అనిపించింది నాకు.

ఒకరోజు సోఫాకి ఒక అంచున కూర్చుంటూ "డాక్టర్! లేదు ఇంట్లో విభాగారూ అనే పిలుస్తాను" అన్నాడు. ఆ తరవాత "నేను చదవకుండా ఏం చేసేది? నేను బ్రహ్మణ్ణి కాను, రాజ్‌పూత్‌ని కాను, కాయస్థుణ్ణి కాను, అసలు నా జాతివాణ్ణే కాను నేను. మన దేశంలో జాతిలేని వాడికి సొంత వాళ్లెలా ఉంటారు? ఇక్కడ ప్రేమించటానికీ, బంధుత్వానికీ, చివరికి రాజకీయ నాయకుడు అవటానికీ కూడా జాతే ఆధారం కదా! ఇక ఈ పుస్తకాలు తప్ప వేరే తోడెవరు నాకు? హాస్టల్లో

అందరితో కలిసి మెస్‌లో భోజనం చెయ్యటానికి కూడా వీల్లేదు. నా గిన్నెలూ, కంచాలూ నేనే కడుక్కోవాలి. తినటానికింత తిండి దొరుకుతోంది. అదే చాలా గొప్ప విషయం." అన్నాడు.

ఒక్క చూపుతో నేను ఆ మాటలకి ఎలా స్పందించానో తెలుసుకోవాలనే ప్రయత్నం చేస్తూ, మళ్లీ "చూడండి, మీ దగ్గర నాకు దాపరికం ఏమిటి? అసలు మీకింతవరకూ నాగురించి తెలియకపోవటమే ఆశ్చర్యంగా ఉంది. మా అమ్మ ఒక తక్కువ జాతి గిరిజన కుటుంబంలో పుట్టింది. గిరిజన స్త్రీకి తన యజమాని నించి రక్షణ ఏముంటుంది? కడుపాకలి తీర్చుకోవటానికి రోజంతా ఒళ్లు హూనం చేసుకుని సంపాదించేది సరిపోయేది కాదు. ఒళ్లు కూడా సమర్పించుకోవలసి వచ్చింది. తరవాత కొన్నాళ్లకి అంత పెద్ద భవనంలో ఒక మూల, నెమ్ముతో నిండిన చీకటి గదిలో నేను పుట్టాను. యాజమానురాలు పెద్ద గొడవ చేసింది. అమ్మని నిలదీసింది, ఎవరికి పుట్టిన సంతానమో చెప్పమని సతాయించింది. కానీ అమ్మ నోరు విప్పలేదు. తన్నులు తిన్నా రహస్యం బైటపెట్టలేదు. అసలు నిజం చెప్పినా ఎవరైనా నమ్ముతారా? అదే ఇంట్లో రోజూ అవమానాలకి గురవుతూ చాకిరీ చేసింది. ఆ చీకటి గదిలోనే నేను తొమ్మిదేళ్లు నిండేదాకా బతికాను. అప్పుడే ఒక కారు ప్రమాదంలో యజమానురాలూ, ఆవిడ ఇద్దరు కొడుకులూ చనిపోయారు. మా నాన్న, రమేంద్ర ప్రతాప్ గాయాలతో బతికి బైటపడ్డాడు. అమ్మ ఆయనకి సేవ చెయ్యటంలో మునిగిపోయింది. ముసలివాడైపోతున్న మగవాడికి బహుశా ఆడదాని అవసరం ఎక్కువుంటుందేమో, అమ్మ ఆయన భార్య గదిలోకి మారింది, నేను ఆయన కొడుకుల గదులని ఆక్రమించుకున్నాను. సుఖం నా అరికాళ్లకి చక్కిలిగింతలు పెట్టసాగింది. కానీ రమేంద్ర ప్రతాప్ మా అమ్మని పెళ్లిచేసుకోలేదు. నన్ను మాత్రం కోర్టులో దత్తత చేసుకున్నాడు. ముగ్గురు నలుగురు మేస్టర్లు వచ్చి రోజూ చదువు చెప్పేవారు. కానీ ఆ నాలుగ్గోడలకి వెలుపల నన్ను అక్రమ సంతానం అని అనటానికి ఎవరూ భయపడేవారు కాదు. పద్దెనిమిదేళ్లకి హైస్కూల్ పాసయి, ఇంటర్ పాసయి ఇప్పుడు మీ మెడికల్ కాలేజీలో చేరాను. కానీ ఎక్కడైనా సరే, నన్ను అక్రమ సంతానమనీ, వర్ణ సంకరం గాడనీ పిలవటానికి ఎవరూ జంకలేదు. ఎన్నడో రాసి ఉంచిన ఈ వర్ణ వ్యవస్థనీ, సామాజికంగా ఏర్పడిన హద్దుల్నీ, దేవుడే స్వయంగా దిగివచ్చినా చెరిపెయ్యలేడు. ఇక్కడ మనిషి అంటే జాతి, రాజకీయాలంటే జాతి, మతం జాతి, ఎవరూ దాన్ని మార్చలేరు విభాగారూ!" అన్నాడు.

అంతసేపు ఏకధాటిగా మాట్లాడటంతో అతని నల్లని మొహం ఊదా రంగులోకి మారింది. తల వంచుకుని కూర్చున్నవాడు ఉన్నటుండి లేస్తూ, "ఇక ఇప్పుడు మీరు కూడా..." అని అంటూండగా అతన్ని వాక్యం పూర్తి చెయ్యనివ్వకుండా "లేదు రమాకాంత్!.. లేదు నేను కూడా ఈ దేశంలోనే పుట్టానుకదా! నాకు తెలుసు, ఇక్కడ అందరూ తమ శక్తిని ఇంకొకరిని అణగదొక్కటానికే వ్యర్థంగా ఖర్చుపెడుతున్నారు. పై జాతులు కింది జాతుల్ని నాశనం చెయ్యటానికి ప్రయత్నిస్తున్నాయి. ఇక కింది జాతులు ప్రభుత్వం నించి సౌకర్యాల కోసం ఎదురుచూస్తూ బద్ధకాన్ని పెంచుకుంటున్నాయి. కానీ ఇక్కడ అందరూ అలాంటి వాళ్లే లేరు. నాకు సంబంధించినంత వరకూ నువ్వొక బ్రైట్ స్టూడెంట్‌వి" అన్నాను.

అతను అలా వస్తూనే ఉన్నాడు. తన మనసులోని భావాలన్నిటినీ నాతో పంచుకోవటం మొదలు పెట్టాడు. తన సబ్జెక్టు గురించే కాక, సాహిత్యం గురించీ, ప్రకృతి గురించీ, సమాజం, రాజకీయాల గురించి స్వేచ్ఛగా నాతో మాట్లాడేవాడు. కానీ అతను వెళ్లిపోయిన ప్రతిసారీ, ఏదో చెప్పాలనుకున్నది అతని మనసులోనే ఉండిపోయిందని నాకనిపించేది.

ఒకసారి మేమిద్దరం రోడ్డుకి అటూ ఇటూ దట్టమైన కొమ్మలతో పెరిగిన పెద్దపెద్ద చెట్ల మధ్యనుంచి నడుస్తూండగా అతను హఠాత్తుగా "విభాగారూ, మీ వయసెంత?" అని అడిగాడు.

మొదటిసారి అతను నాగురించి అడిగిన ప్రశ్న అది. నాకు ఇబ్బందిగా అనిపించింది. నిర్మల్ సిన్హా స్థానాన్ని తను చేజిక్కించుకోవాలని వల పన్నుతున్నాడా? ఎంతైనా గిరిజన రక్తం ప్రవహిస్తోంది అతనిలో. నేనే జవాబు చెప్పలేదు. అతను కూడా రెట్టించలేదు. అప్పుడు నిజంగా నాకు చాలా బాధ వేసింది. పైకి ఎంతో సెక్యులర్‌గా కనిపించాలని ప్రయత్నించే నాలో ఎంత సంకుచిత భావాలున్నాయి! అలా అనిపించగానే, "నా వయసెంతయినా, నీ కన్నా ఐదారేళ్లు పెద్దదాన్నే!" అన్నాను.

**ఒక్క చూపుతో నేను ఆ మాటలకి ఎలా స్పందించానో తెలుసుకోవాలనే ప్రయత్నం చేస్తూ, మళ్లీ "చూడండి, మీ దగ్గర నాకు దాపరికం ఏమిటి? అసలు మీకింతవరకూ నాగురించి తెలియకపోవటే ఆశ్చర్యంగా ఉంది.**



"ఇంతేనా? అయినా మీరు లెక్చరర్, నేను స్టూడెంట్‌ని. తమాషాగా ఉంది కదూ?" అని నవ్వుతూ అన్నాడేగాని, అతను చెప్పాలనుకున్న రహస్యమేదో నా జవాబు వల్ల మరింత లోతుకి వెళ్లిపోయిందని నాకనిపించింది. పాపం అతని ప్రశ్నకి వెంటనే జవాబు చెప్పి, ఏమంటాడో వినాల్సింది. ఎంతైనా ఇతను మిగతా కుర్రాళ్లల్లాగ కాదు. అనుకున్నాను.

కాంపౌండ్‌లోకి అడుగు పెట్టగానే "ప్రేమ పక్షులు వస్తున్నాయోచ్! దాసీపుత్రుడు జిందాబాద్!" అనే కేకలు వినిపించాయి. భయంభయంగా రమాకాంత్ చుట్టూ చూశాడు. తనకన్నా కూడా నా గురించి అతను ఎక్కువ ఆందోళనపడ్డాడు. అప్పుడే అనిపించింది. అతన్ని ఇక నా దగ్గరికి రావద్దని చెపుదామని. కానీ అప్పుడు అతను నన్ను కలుసుకోవటానికి రావటం వెనకాల అంత భయంకరమైన వాస్తవం ఉంటుందని నాకు తెలీదు.

వరండాలో అవస్థీ, ఆయన భార్యా నిలబడి ఉన్నారు. వాళ్లకి జరిగినదంతా చెప్పాను. అవస్థీ చాలా గంభీరంగా, "నువ్వు చేస్తున్నది అందరూ తప్పకుండా చెయ్యవలసిన పని. స్టూడెంట్ల విషయం నీకు తెలీనిదేముంది? ఆ అబ్బాయికి కాస్త జాగ్రత్తగా ఉండమని చెప్పు. అందరితో కాస్త కలివిడిగా ఉండమను." అన్నాడు.

కొన్నాళ్లకి చలి బాగా పెరిగింది. "డాక్టర్! టీ తాగాలనుంది" అంటూ లోపలికొచ్చాడు రమాకాంత్. చాలా చనువుగా కుర్చీలాక్కుని కూర్చుంటూ "డిస్టర్బ్ చెయ్యలేదు కదా?" అన్నాడు.

మొదటిసారి అతను అలా అడగటం జాగ్రత్తగా చూస్తే అతని మొహంలో విపరీతమైన ఒత్తిడి కనిపించింది. "ఏమిటి ఇవాళ చాలా సీరియస్‌గా ఉంది మొహం?" అని అడిగాను.

"ఇవాళేం జరిగిందో తెలుసా డాక్టర్? వాళ్లు నేను లేనప్పుడు నాగదిలోకి వెళ్లి ఒక బూతు పోస్టర్ అతికించారు. దానిలో 'ద ప్రిన్సెస్ ఎండ్ ద స్లేవ్' అని రాసి ఉంది. వాళ్లకి ఏం కావాలో అర్థం కావటం లేదు. డాక్టర్! నేను వాళ్లనేమీ అనను, వాళ్లతో ఎటువంటి ఘర్షణాపడను. అయినా వాళ్లు ఎందుకిలా నా వెంట పడుతున్నారు?" అంటూ అతను ఉన్నట్టుండి ఎక్కడో ఏదో కలుక్కుమన్నట్టు ఆగి పోయాడు. ఆ తరవాత నా మొహంలో భయం కనిపించినట్టుంది. "పేపరు తీస్తే దేశమంతటా పోట్లాటలూ, చలికీ, వడదెబ్బకీ చనిపోయేవాళ్లూ, హరిజనుల మీద అత్యాచారాలూ, బలాత్కారాలూ, వికృతమైన రాజకీయాలూ. ఇక్కడ ఇంకేమీ లేకపోయినా, రమాకాంత్ పట్ల అత్యాచారం!" అన్నాడు.

నా మనసుని ఎవరో కోస్తున్నంత బాధ కలిగింది. మళ్లీ ఇంతలో, తనతో నన్ను కూడా కలుపుకోవటానికి ప్రయత్నించటం లేదుకదా అనిపించి "అయి ఉండచ్చు. కానీ ఇవన్నీ అన్ని చోట్లా

**వాళ్లకి ఏం కావాలో అర్థం కావటం లేదు. డాక్టర్! నేను వాళ్లనేమీ అనను, వాళ్లతో ఎటువంటి ఘర్షణాపడను. అయినా వాళ్లు ఎందుకిలా నా వెంట పడుతున్నారు?" అంటూ అతను ఉన్నట్టుండి ఎక్కడో ఏదో కలుక్కుమన్నట్టు ఆగి పోయాడు.**



జరిగేవేగా! పేపర్లలో మరీ ఎక్కువచేసి రాస్తారు. ప్రతివాడూ అబద్ధం చెప్పి గొప్పవాడైపోవాలనీ, పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవాలని చూసేవాడే!" అన్నాను అతనికి అడ్డొస్తూ.

అతన్ని నా మాటలు బాధ పెట్టినట్టున్నాయి "లేదు, విభగారూ! పేపర్లో వచ్చేది చాలా తక్కువ. ఈ హాస్టల్లోనే ఏ జరిగిందో మీకు తెలుసా? అది పేపర్లలో ఎక్కడొచ్చింది? చౌకీదార్ కొత్తగా పెళ్లిచేసుకున్న అమ్మాయి మీద ఓ పదిమంది సీనియర్లు అత్యాచారం చేశారు. పాపం చౌకీదారు కొత్త పెళ్లాం గురించి కలలుకంటూ ఎంతో బాధ్యతగా తన డ్యూటీ చేస్తున్న సమయంలో, అతని ఇంట్లోనే.. పొద్దున్నే ఇంటికెళ్లి జీవచ్ఛవంలా ఉన్న భార్యని చూసి, నెత్తీ నోరూ బాదుకుంటూ యాదవ్ దగ్గరికి పరిగెత్తాడు. యాదవ్ వాడికి మాయమాటలు చెప్పి ఊరుకోబెట్టాడు. 'నీకే అవమానం.. పోలీసులు కూడా కుర్ర పెళ్లాంచేత వ్యభిచారం చేయిస్తున్నావని నిన్నే పీడిస్తారు అని చివరికి రెండు మూడు వందలు చందా పోగుచేసి, చౌకీదార్నీ, అతని పెళ్లాన్నీ బస్కెక్కించి వచ్చాడు యాదవ్. రాత్రంతా పగలబడి ఒకటే నవ్వులు. ఈ యాదవే ఫైనలియర్‌లో ఉన్నాడు, రేపు పెద్ద డాక్టరయి చాలా మర్యాదస్తుడని పేరు సంపాదించుకుంటాడు. అతని ఆపరేషన్ థియేటర్‌లో ఏమేం జరుగుతాయో ఆ దేవుడికి తప్ప ఎవరికీ తెలీదు!" అన్నాడు.

అతని మొహం భావరహితంగా ఉంది కానీ అతను ఇంకా చెప్పటం ఆపలేదు. "వీళ్ల గదుల్లో లేని వస్తువంటూ లేదు! కత్తులూ, కరార్లు, పిస్తోళ్లూ. కత్తులు దాచిపెట్టిన చేతి కర్రలూ. వీళ్లు ఆపరేషన్లు చెయ్యాలంటే సర్జికల్ ఇన్‌స్ట్రుమెంట్స్ అవసరం లేదు. వీళ్లు తమ దగ్గరున్న ఆయుధాలతోనూ, క్రూరమైన ఆలోచనలతోనూ చికిత్సలు చేసెయ్యగలరు. ఏదో ఒకరోజు వీళ్లు నన్నుకూడా బతకనివ్వరని అనిపిస్తోంది." అన్నాడు.

నాకు అతనిమీద ఉన్న ఒకటీ అరా అనుమానాలు కూడా ఈ మాటలతో మాయమయ్యాయి. నాలోపల రమాకాంత్ బాధ సుడులు తిరుగుతోంది. మనసు కుదుటపడేందుకు నేను అక్కణ్ణించి లేచి వెళ్లిపోయాను. టీ చేసి తీసుకొచ్చి అతని ఎదురుగా పెట్టి, అతని మొహంకేసి చూశాను. బుగ్గమీద వేళ్ల గుర్తులు! మళ్లీ నాలో వణుకు ప్రారంభమయింది. నా చూపులు పసికట్టి రమాకాంత్ నవ్వుతూ, "ఏమీ కాలేదు, విభగారూ, ఎవరో అబ్బాయి చెయ్యి విసిరితే తగిలిందంతే!" అన్నాడు.

నేను లేచి అతన్ని వీపు మీద చొక్కాని పైకెత్తి చూశాను. ఒకటి రెండు చోట్ల కాదు, వీపంతా దెబ్బలతో కమిలిపోయి ఉంది. దేంతో కొట్టారో అలా నీలంగా కమిలిపోయింది! సుత్తా! లాఠీయా, లేక పిడిగుద్దులా?

''ఏమయింది?... ఎప్పుడు...?'' నా గొంతు పూడుకుపోయింది.

"నిన్న.. మనిద్దరం సినిమాకెళ్లి వచ్చాక.. నాగదికెళ్లాను. గడియ తీసి ఉండటం చూసి ఆశ్చర్యపోతూ లోపలికి అడుగుపెట్టానో లేదో కరెంటు పోయింది. చీకట్లో వాళ్లెవరో తెలీలేదు..." అన్నాడు రమాకాంత్.

"హూఁ... ఇంకెవరు? అన్ని కులాలూ నిన్ను తన్నటానికి ఒకటయి ఉంటాయి! ఇక నేను చూస్తూ కూర్చోలేను రమాకాంత్! వార్డెన్‌కే కాదు, పోలీసులకి కూడా రిపోర్టు చేస్తాను. నేను వాళ్లని అంత తేలిగ్గా వదిలిపెట్టను.." అని అంటూంటే నా పిడికిళ్లు బిగుసుకున్నాయి.

రమాకాంత్ నా చేతులు పట్టుకుని, చాలా నిదానంగా "ఒద్దు, డాక్టర్! మీరలాంటిదేమీ చెయ్యకండి. అనవసరంగా ఆవేశపడద్దు. పోలీసులేమీ చెయ్యరు. లెక్కలేనన్ని రిపోర్టుల్లో ఇదీ ఒకటి వాళ్లకి. అనవసరంగా మీకు చెడ్డ పేరొస్తుంది. తప్ప ఇంకేం జరగదు" అన్నాడు.

నాకు పిచ్చికోపం వచ్చింది. "ఏంటి రమాకాంత్? నీతో స్నేహంగా ఉంటున్నందుకు నన్నేమీ అనరేం? మరి నీ వెంటపడి ఇలా వేధిస్తున్నందుకు ఆ బ్రూట్స్‌కి బుద్ధి చెప్పద్దా?" అన్నాను.

"అసలు వాళ్లు నా వెంట పడిందే మిమ్మల్ని నానుంచి కాపాడటానికి. వాళ్ల దృష్టిలో నేను తక్కువ కులంలో పుట్టిన గిరిజనుడిని. రేపు మీరు నిర్మల్ గారిని పెళ్లి చేసుకుంటారు. ఆయన ఏ కలెక్టరో అవుతాడు, మీరేమో డాక్టర్. మిమ్మల్ని వాళ్లు ఏమైనా అన్నా, ఏమైనా చేసినా వార్తాపత్రికల్లో వస్తుంది. పెద్ద గొడవ అవుతుంది. అందుకే మీ జోలికిరారు."

నేనతనికి దగ్గరగా వెళ్లి, రెండు చేతులతో అతని తలను పట్టుకుని గుండెలకి అదుముకున్నాను. అతను తలపైకెత్తి నా పెదవులమీద ముద్దుపెట్టుకున్నాడు. ఇవాళ ఇదంతా నాకు తప్పుగా అనిపించలేదు. అతని కోసం ప్రాణాలైనా ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నాననిపించింది. అతనే తన మొహాన్ని పక్కకి తిప్పుకుని వెనక్కి తిరిగాడు. నా గుండె వేగంగా కొట్టుకోవటం మొదలు పెట్టింది. అతన్ని వెనక్కి పిలవాలనిపించింది. కానీ అతను వెనక్కి రాదనీ, అతన్ని ఆపటం

నావల్ల కాదనీ అనిపించింది.

తన ఒంటరి తనాన్ని మర్చిపోవటానికి మాత్రమే అతను నా దగ్గరికి వస్తూ పోతూ స్నేహం చేశాడు. కానీ దానికి అతనికి ఇంతపెద్ద శిక్ష వెయ్యాలా? ఇంత యాతన అనుభవించాలా? ఈ స్నేహం వల్ల అతను ఎంత భయంకరమైన చీకటిని తన చుట్టూ సృష్టించుకున్నాడు.

బల్లమీద అతని కోసం చేసిన టీ చల్లారి పోయి పైన తరక కట్టింది. పక్కనే ఫోటోలో ఉన్న నిర్మల్ సిన్హా నన్ను పలకరిస్తున్నట్టనిపించింది. అయితే రమాకాంత్‌ని ఇక్కడికి ఇక రావద్దని చెప్పనా? కానీ మరీ ఒంటరి వాడయిపోతాడే! సీసా తెరిచి రెండు నిద్ర మాత్రలు వేసుకున్నాను. బైట ఎవరో వెక్కివెక్కి ఏడుస్తున్న చప్పుడు. ఇంతలోకే నిద్ర కమ్ముకొచ్చింది. కలలో ఒక పంజరం. అందులో నా ఆత్మ బైటపడటానికి రెక్కలు కొట్టుకుంటోంది. నేనేనా బందీని? మీరు, రమాకాంత్, అందరం పంజరాల్లో పక్షులమే. ఆకాశం ఎదురుగా కనిపిస్తున్నా, ఎగరలేని బందీలం.

పొద్దున్న ఇంకా నేను నిద్ర లేవకముందే, ఎవరో తలుపు మీద దబదబ బాదటం వినిపించింది. కష్టం మీద కళ్లు తెరిచి చూస్తే గడియారం పది గంటలు చూపిస్తోంది. లేచి తలుపు తీశాను. ఎదురుగ్గా ఇలా సింగ్, ఆమె మొహం చాలా ఆదుర్దాగా ఉంది. లోపలికొచ్చి సోఫాలో కూలబడి, "నువ్విప్పుడు నిద్రలేచావా? అక్కడ అంతా అయిపోయింది!" అంది, ఇలా సింగ్.

నేను అవాక్కయి నిలబడిపోయాను. ఇలా సింగ్ కిటికీకేసి చూస్తూ, "ఏం జరిగిందో చెప్పనా?" అంది. నాకేసి చూసి మాట్లాడే ధైర్యం లేనిదానిలా. చాలా నెమ్మదిగా "నిన్న రాత్రి రమాకాంత్ ఆత్మహత్య చేసుకున్నాడు. గదిలో అతని శవం వేలాడుతూ కనిపించింది..." అంది.

నా కాళ్లకింది నేల కదిలిపోయింది. "లేదు.. అలా జరగటానికి వీల్లేదు! ఆ అబ్బాయి చాలా ధైర్యం గలవాడు. అతను ఆత్మహత్య చేసుకున్నాడంటే నేను నమ్మను!" అన్నాను. కిటికీ దగ్గరకెళ్లి నిలబడ్డాను. కిటికీ పక్కనే నిన్నటిదాకా విరబూసి ఉన్న నల్ల గులాబీని రాత్రికి రాత్రే ఎవరో మాయం చేశారు.

"నిజమే, విభా! కొందరు దీన్ని హత్య అని కూడా అంటున్నారు. అతని వీపుమీద లెక్కలేనన్ని వాతలు... నీలంగా! కానీ ప్రిన్సిపాల్ ఆత్మహత్య అని రాయించేశాడు. కాలేజీ పేరు పాడవకూడదు కదా! కుర్రాళ్లందరూ, అతను ప్రేమలో ఓడిపోవటంతో ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పుకుంటున్నారు. నీ పేరు కూడా పైకి వచ్చేదే, ఈ గొడవలో. కానీ వార్డెన్ రానివ్వలేదు." ఇలా సింగ్ చాలా మామూలుగా ఈ విషయాలన్నీ చెప్పింది.

"నాకు జరిగే అవమానం గురించి నాకేమీ పట్టదు. ఇది ఆత్మహత్య కాదు, హత్యే. చండాలపు సామాజిక కుట్ర ఇది. పాశవికత... ఇది ఆత్మహత్య అయితే చౌకీదార్ భార్యకి జరిగిన దాన్ని ఏమనాలిట? ఈ అన్యాయాన్నీ, దౌర్జన్యాన్నీ ఇంకా ఎన్నాళ్లని సహించాలి? ఇంకా ఎన్నాళ్లు మన ఆత్మలు పంజరంలో చిలకల్లా రెక్కలు అల్లల్లాడించి నోరుమూసుకుని ఉండిపోతాయి?" అని గొంతుచించుకుని అరవాలనిపించింది.

భయం, జుగుప్స, దుఃఖంతో నా ఒంట్లో రక్తం గడ్డకట్టుకు పోయినట్టనిపించింది. ఇలా సింగ్ వైపు చూశాను. ఆమె కళ్లల్లో ఏదో అర్థంకాని భావం.. నాకు తెలుసు నిర్మల్ సిన్హా విషయంలో ఆమెకి నేనంటే ఈర్ష్య. అందుకే ఇది నాకుగా చేసుకుని, కావాలనే నాకు బాధ కలిగిస్తుందని తెలిసే, ఈ వార్త నాకు చెప్పటానికి పనిగట్టుకుని వచ్చింది. ద్వేషం.. ఈర్ష్య... అంతటా ...అందరిలోనూ అవే భావాలు! మానవత్వం కోసం వెతికినా ఎక్కడా కనిపించదు.

గబగబా చెప్పులేసుకుని బైటికెళ్లాను. ఇప్పుడు బహుశా అతని శరీరాన్ని పోస్ట్‌మార్టమ్ చేస్తూ ఉంటారు. అతని ఒంటి మీదున్న గాయాలని ఏ మాత్రం పట్టించుకోకుండా డాక్టర్ ఆత్మహత్య అని సర్టిఫై చేస్తాడు. అతను చేసే ఆ సంతకం కింద అందరి పాపమూ దాక్కుంటుంది. కనిపించకుండా పోతుంది. బహుశా ఈ రాత్రి వాళ్లందరూ కలిసి మజా చేసుకుంటారేమో!

కానీ నిన్న, తనకున్న కష్టాలనీ, కన్నీళ్లనీ, మర్చిపోయి, ఇది ఉచితమా కాదా అని కూడా ఆలోచించకుండా, తెల్లవారగట్ట కురిసే స్వచ్ఛమైన మంచు బిందువులా నా పెదవులమీద అతను సృష్టించి వెళ్లిన కావ్యం... దాన్ని ఇప్పుడు నేనేం చేసుకోవాలి? జీవితాంతం ఆ అనుభూతిని దాచుకుంటూ, అవే పెదవులతో కసాయిల మీద

**బైట ఎవరో వెక్కివెక్కి ఏడుస్తున్న చప్పుడు. ఇంతలోకే నిద్ర కమ్ముకొచ్చింది. కలలో ఒక పంజరం. అందులో నా ఆత్మ బైటపడటానికి రెక్కలు కొట్టుకుంటోంది. నేనేనా బందీని? మీరు, రమాకాంత్, అందరం పంజరాల్లో పక్షులమే.**



ఉమ్మెయ్యాలని ఉంది.

నెమ్మదిగా నడుచుకుంటూ నా గదిలోకి వెళ్లాను. నిర్మల్‌కి నన్ను మర్చిపొమ్మని ఉత్తరం రాయాలి.. కారణం?.. కారణం ఏమని రాయాలి? ఎక్కడ మొదలు పెట్టాలి ఈ కారణాన్ని? ఈ ఆత్మహత్య దగ్గరా? హత్య దగ్గరా? లేక అతని తండ్రి అతని తల్లిని బలాత్కరించిన దగ్గరా?

ఉత్తరం రాయలేకపోయాను. దానికి బదులు రాజీనామా ఉత్తరం రాశాను.. సంతకం చేశాను. ఆఖరి క్షణం వరకూ రమాకాంత్, భీష్ముడిలా, తన మృత్యువు దగ్గరపడటం చూసి ఉంటాడు! హఠాత్తుగా అలా అనిపించింది.

ప్రిన్సిపాల్‌కి రాజీనామా ఉత్తరం ఇచ్చి వెనుదిరిగాను. ప్రిన్సిపాల్ గొంతు వెనకనించి వినిపించింది. "నేను అతని ఒంటిమీద దెబ్బలు చూశాను, డాక్టర్ విభా! అతన్ని క్రూరంగా చంపి, పంఖాకి వేలాడదీశారు. మధ్యలో నీ విషయం కూడా వచ్చింది, కానీ డాక్టర్ అవన్నీ నాకంతా వివరంగా చెప్పాడు. సంస్థకోసం... లేకపోతే ఈ మెడికల్ కాలేజీకి చెడ్డపేరొస్తుంది. నవ్వూ, నేను అందరం చెడ్డపేరు తెచ్చుకుంటాం. దేశం ఎటుపోతోందో తెలీటం లేదు. ఐ పిటీ ద బాయ్, ఫీల్ సారీ ఫర్ యూ ఎండ్ మైసెల్ఫ్!" అన్నాడాయన.

రమాకాంత్ చనిపోయినందుకు సంతాపసభ ఏర్పాటు చేశారు. అందులో పాల్గొనటానికి క్లాసుల్లోంచి అమ్మాయిలూ, అబ్బాయిలూ నవ్వుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ బైటికొచ్చేశారు. వాళ్ల మధ్యనించి దారి చేసుకుంటూ బైటపడటం నాకు సాధ్యం కాలేదు... అసంభవం అనిపించింది! ■



# తొలి స్త్రీవాద నాదం కమలాదాస్

వీరప్రసాద్

కేరళకు చెందిన కమలాదాస్ ఆంగ్ల సాహిత్యంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. కేరళ రాష్ట్రం నుండి ఆంగ్లంలో కవిత్వం రాసిన మొదటి మహిళగా కమలాదాస్ గుర్తింపు పొందారు. దేశీయంగానూ, అంతర్జాతీయంగానూ తీవ్రతతో కూడిన స్త్రీవాద భావజాలంతో ఆంగ్ల సాహిత్యంలో సంచలనం కలిగించారు. 'ప్రతీ కవితా నేననుభవించిన బాధలోంచి వచ్చిన వ్యక్తీకరణే' అని ఆమె తన జీవితంలో అతి చిన్న వయసులో వివాహం జరగటం దగ్గర్నుంచి ప్రతీ సంఘటనా ఆమె సాహిత్యంలో ప్రతిఫలించింది. పలు వివాదాలకు ఆస్కారమిచ్చింది.

కేరళలోని సంప్రదాయ నాయర్ కుటుంబంలో ఆమె జన్మించారు. తల్లితండ్రులిద్దరూ సాహితీ ప్రముఖులే. తండ్రి మాతృభూమి మేనేజింగ్ ఎడిటర్. తల్లి బాలమగియమ్మ మళయాళం సాహిత్యంలో కవయిత్రిగా ప్రఖ్యాతి చెందారు. సాహితీ వారసత్వం పుణికిపుచ్చుకున్న కమలాదాస్ సైద్ధాంతికంగా భిన్న మార్గాన్ని ఎంచుకున్నారు. హేతుబద్ధంగా లేని సంప్రదాయ వ్యవస్థను ఆమె తిరస్కరించింది. దానికి భిన్నంగా జీవించడానికి నిత్యం సమాజంతో సంఘర్షించారు. పురుషాధిక్య సమాజంలో దెబ్బతిన్న మహిళల మనోభావాలకు ఆమె తన రచనల్లో ప్రతిబింబించారు. ఛాందసవాద భావాలపై తన కలాన్ని కత్తిలాగా ఎక్కుపెట్టారు. మాతృభాష మళయాళంపై ఎంత పట్టు ఉందో ఇంగ్లీషు భాషపై కూడా ఆమె అంతే పట్టు సాధించింది. ఆమె రాసిన ఆంగ్ల కవితలు, మళయాళ కథలు సమాజంలో హిపోక్రసీకి వ్యతిరేకంగా నడుస్తాయి. ఆమె మళయాళంలో 'మాధవీకుట్టి' పేరుతో రచనలు సాగించారు. బాల్యంలో నాలప్పట్ నారాయణ మీనన్ అనే పండితుడి ప్రభావం కమలాదాస్‌పై ఎక్కువగా ఉండేది. ఆమె కవితలన్నీ ఎక్కువగా బాల్య జ్ఞాపకాలనే ప్రతిబింబిస్తాయి. 'సమ్మర్ ఇన్ కలకత్తా', 'ఇన్ లవ్ కంపోజిషన్', 'ద సూసైడ్', ద డిసెండాంట్స్', 'ద వోల్డ్ ప్లేహౌస్ అండ్ అదర్ పోయెమ్స్', 'ద అన్నామలై పోయెమ్స్', 'వోన్లీ ద సోల్ నోస్ హౌటు సింగ్' వంటి కవితా సంపుటాలు కమలాదాస్ వెలువరించారు. ముందుగా మళయాళంలో కథలతో ఆమె తన సాహిత్య జీవితానికి శ్రీకారం చుట్టారు. 'పక్షియూడె మనం', 'నారీచీరుకల్ పరక్కుంబల్', 'ధనప్పు', 'నేప్పాయసం' వంటి పలు కథా సంపుటాలు, 'పలాయన్', 'చందనా మరంగల్' వంటి నవలలతోపాటు ఆమె తన ఆటోబయోగ్రఫీని 'మై స్టోరీ' పేరిట వెలువరించారు. 'మై స్టోరీ' తీవ్ర సంచలనం కలిగించింది. ఒక స్త్రీగా ఆమె తన స్వీయ జీవితపు అనుభవాలను ఆ గ్రంథంలో వ్యక్తీకరించడం సంచలనానికి దారితీసింది. ఆంగ్ల సాహిత్యంలో భారతదేశం నుండి స్త్రీల లైంగిక కోణాన్ని స్త్రీవాద భావాల్ని వ్యక్తీకరించిన మొదటి తరం మహిళా రచయిత్రిగా కమలాదాస్‌ను పేర్కొనవచ్చు.

హాయిగా ఉండే శైలితో చక్కని పదాలతో ఒక లయబద్ధంగా సాగేలా కవిత్వం రాయడంలో కమలాదాస్ పెట్టింది పేరు. అంతర్జాతీయంగా పలు అవార్డులు, బహుమతులు దక్కించుకున్నారు. కేవలం కవిత్వ పఠనానికి పలు దేశాలు కమలాదాస్ పర్యటించారు. తన సాహిత్య వ్యక్తీకరణ సంచలనాత్మకంగా ఉండటమే గాక, తన వ్యక్తిగత జీవితం కూడా సంచలనంగా గడిపారు కమలాదాస్.

తన జీవితం చివరి దశలో ఇస్లాం మతాన్ని స్వీకరించి తన పేరున 'సురయ్యా' గా ప్రకటించుకున్నారు. అసహజమైన ప్రేమ గురించి, వివాహ వ్యవస్థలో అంతర్లీనంగా ఉన్న లొసుగులను గూర్చి బలంగా రాసిన అతికొద్ది మంది రచయిత్రులలో కమలాదాస్ ఒకరు. 1934లో జన్మించిన కమలాదాస్ తన 75వ యేట 2009 మే 31న కన్నుమూశారు. 'కమలాదాస్ కవిత్వం- కోర్కెలకు, మానసిక సంఘర్షణలకు, ప్రేమకు, శారీరక అవసరాలకూ మధ్య జరిగిన పోరాటమే! స్త్రీత్వపు సున్నితత్వంతో ఆమె భావాలు నగ్నంగా తిరగబడ్డాయి. ముసుగులు, తెరలు, అచ్ఛాదనలు లేని ఆలోచనల్ని కవిత్వీకరించడంలో ఆమెకు ఆమే సాటి' అని ఒక విమర్శకుడు పేర్కొన్నారు. భారతీయ ఆంగ్ల సాహిత్యంలో ఒక ప్రత్యేక ప్రభావంగా కమలాదాస్ మిగిలిపోతారు. ■

# మంచి సమాజం కోసం కవిత్వ కవాతు చేస్తున్న స్వరూపరాణి

రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి



*మనం సిసలైన మనుషులుగా మనగలిగే*
*సరికొత్త శకంకోసం*
*చీమూనెత్తురున్న కవిత్వాన్నేరాద్దాం.*
*మన పిల్లలు దళితకవిత్వం*
*రాయనక్కర్లేని*
*ఒక కొత్త సాహితీసాధాన్నే*
*సామూహికంగా పలవరిద్దాం.*

ఒక నాగరికమైన భారతదేశ నిర్మాణంకోసం దళిత కవయిత్రిగా చల్లపల్లి స్వరూపరాణిగారు ఇస్తున్న పిలుపు ఇది. అప్రజాస్వామికమైన చరిత్రగలిగిన వర్తమాన భారతీయ సమాజాన్ని నిజమైన ప్రజాస్వామిక దేశంగా, నిజమైన ఆధునిక భారతదేశంగా మార్చాలంటే కులంకోణం నుంచి, సాంఘిక కోణం నుంచి ఆలోచించి ఆమె ఇచ్చిన పిలుపు ఇది. భారతీయ సమాజంలోని అపసవ్యకర అంశాలను సమగ్రంగా అధ్యయనం చేసిన డా॥ బి.ఆర్.అంబేద్కర్ కులనిర్మూలన కోసం పిలుపునిస్తూ 1936లో రాజకీయ నిరంకుశత్వం కన్నా, సాంఘిక నిరంకుశత్వం చాలా క్రూరమైంది అని, అందువల్ల ఆర్థికరాజకీయ విప్లవాల కన్నా ముందు సాంఘిక విప్లవం రావాలని, అది కులనిర్మూలన ద్వారా మాత్రమే సాధ్యమౌతుందని స్పష్టంచేశారు. అ మాటలు ఎంత నిజమో ఆరు దశాబ్దాలకు పైబడిన స్వతంత్ర భారతదేశ చరిత్ర రుజువు చేస్తున్నది. అట్లని ఆర్థిక రాజకీయాలు విస్మరించవలసినవికావు.

స్వరూపరాణిగారు దళిత స్త్రీ వాద కవిత్వానికి సమగ్రరూపాన్ని అందివ్వగలిగారు. మిగతా దళిత కవులతో గొంతు కలుపుతూ మొత్తం దళిత జీవితవేదనను వినిపించగలిగారు. భారతీయ సామాజిక వ్యవస్థలోని కులలైంగిక ఆధిపత్యాలను, ఆరాచకాలను తీవ్రమైన కంఠస్వరంతో నిలదీశారు,ప్రతిఘటించారు, ప్రశ్నించారు. అన్ని అవలక్షణాలను కవితాత్మకంగా ఎత్తిచూపి, వాటిని విమర్శకు పెట్టి ఆ లక్షణాలులేని ఒక మంచి సమాజం ఏర్పడాలని ఆకాంక్షించారు. దానికి మార్గాలను కూడా సూచించారు.

"ఇంట్లోపురుషాహంకారం
ఒక చెంప ఛెల్లుమనిపిస్తే
వీధిలో కులాధిపత్యం
రెండో చెంప పగలగొడుతుంది"
" ఇంట్లో పెళ్లాంగా
నిత్యవసర వస్తువువై
వీధుల్లో అవహేళనల మూటలమోసే
కులంతక్కువ గాడిదవై
అటుగోడదెబ్బ ఇటుచెంపదెబ్బ
వెరసి గాయపడింది నీ బతుకేకదా"

దళిత స్త్రీ రెండువైపులా, కులం నుంచి, జండర్‌నుంచి సమస్య ఎదుర్కొంటున్న దృశ్యాన్ని ఆవిష్కరించారు స్వరూపరాణిగారు. మొత్తం దళిత జాతిని అస్పృశ్యతా ముద్రవేసి ఊరికి దూరంగా పెట్టిన మన వ్యవస్థలోని పై కులాల మగవాళ్లు తమ అదనపు కామతృప్తి దగ్గరికొచ్చేసరికి ఆ కంచెను తొలగించి దళిత స్త్రీల మీదనే పడుతున్న వాస్తవాన్ని స్వరూపారాణిగారు ముసుగులేని భాషలో బయటపెట్టారు.

" కామానికి పనికివచ్చిన నేను
కాపురానికి పనికిరానప్పుడు
ఏ కాలవలోనో తలదాచుకోవాలనిపించింది"

భారతీయ గ్రామీణ వ్యవస్థ చాలా గొప్పది అని భ్రమించేవాళ్లను ఈ వేదనాశకలం పట్టికుదుపుతుంది.

బాలకార్మిక వ్యవస్థను గురించి ఇవాళ కవితలు ఎక్కువగా వస్తున్నాయి. అయితే అనాదిగా బలాన్ని కోల్పోయిన సామాజిక వర్గం భారతదేశంలో దళితులదే. ఇటీవలి కాలందాకా పై కులాల పిల్లలు చదువుకుంటుంటే దళిత పిల్లలు వాళ్ల ఇళ్లలో, పొలాలలో పనిచేసేవారు. ఇటీవల మార్పు రావడంతో ఈ పరిస్థితి తలక్రిందులవుతున్నది.ప్రసార సాధనాలు పిల్లల ఆరోగ్యం వంటి అంశాలమీద చేసే ప్రకటనల్లో చూపే పిల్లలు అచ్చు అగ్రవర్ణాల పిల్లలుగా లేదా బాగుపడ్డవారి పిల్లలుగా ఉంటారు. అప్పుడు కవయిత్రికి తన బాల్యం గుర్తుకు వస్తుంది. అందుకే ఆమె అంటారు.

" జాంపండు బుగ్గలు
బుల్లిబుల్లిబుట్టగవున్నతో
చూడగానే ఎవరికైనా ముద్దొచ్చే బాల్యాన్ని
ఎప్పుడన్నా చదివినప్పుడల్లా
పాత ట్రంకుపెట్టెలో అదిమివుంచిన
అటలాడిన ఎక్కాలు పుస్తకంలాంటి
నా బాల్యం
నన్నూ కవిత్వం చెయ్యమని
పేజీల చేతులుచాస్తుంది"

దేశ పౌరులందరిలో సమాన బతుకు నివ్వని నిచ్చెన మెట్ల వంటి వ్యవస్థలో కిందిమెట్టు నిరంతరం అణిచివేత దౌర్జన్యాలను అనుభవించడం తమ రివాజు, భారతీయ సమాజంవంటి కుల ప్రధాన సమాజంలో ఈ అనుభవం దళితులదే. ఈ చరిత్రను స్వరూపరాణిగారు 'మంటల మానవుడు' గా ఉపమించారు. పొగలు కక్కుతున్న అన్నాన్నో, కూరనో తినడం అందరికీ తెలుసు."పొగలు కక్కుతున్న మాంసపుముద్ద" అన్నారు కవయిత్రి. దళితులను చంపి కాల్చిబూడిద చేసే అగ్రకుల దుర్మార్గాన్నిలా భావించడం కొత్తగా ఉంది. భారతీయ సౌందర్య శాస్త్రానికి ఇది సరికొత్త చేర్పుక్క. శ్రామిక దళిత స్త్రీ దృష్టితో స్వరూపరాణిగారు కుల వివక్ష, లైంగికదౌర్జన్యాలతోపాటు శ్రమదోపిడిని కూడా గుర్తించి కవిత్వీకరించారు. దళితతల్లి మగవాడితో సమానంగా పొలంలో పనిచేసినా కూలి దగ్గరి కొచ్చేసరిగా మొగకొక కూలి, ఆడకొక కూలి. ఇటీవలి కాలందాకా ఇదొక ఆర్థిక ధర్మంగా ఉండేది. మనం సంతోషించాల్సిందేమిటంటే స్త్రీలలో కూడ ఊరు స్త్రీల కూలీలకొక కూలి, వాడ స్త్రీ కూలీలకొక కూలి అమలులో లేకపోవడం. శ్రామికదళిత స్త్రీల కవయిత్రి 'మట్టిచేతులు' గా ఉపమిస్తూ రాసిన కవిత భారతీయ శ్రామిక కవిత్వంలో జేర్చదగింది.

"రెక్కలు ముక్కలు చేసి
మట్టిలో పసిడి పూలుపూయిస్తే
కూలి డబ్బుల దగ్గర కూడా
ఆమెను ఆడతనం వెక్కిరిస్తుంది"

శ్రామిక దళిత స్త్రీ శ్రమకు తగిన ఫలితం రైతులు భూస్వాముల నుంచి పొందలేకపోవడం ఒక సమస్య అయితే, ఆ వచ్చిన కూలి డబ్బుల్ని గుంజుకోవడానికి ఈ వ్యవస్థ తాగుబోతు భర్తరూపంలో సాయంకాలం సిద్ధంగా ఉండడం మరో సమస్య.

రెండురూపాయల సంపాదనతో
పసివాళ్లపొట్టనింపుదామని
గంపెడాశతో గూట్లోవాలితే
ఆమె చెమటను సారాలా తాగటానికి
పెనిమిటి తయారుగా ఉంటారు.

వెనకటి రోజుల్లో స్త్రీకి కేవలం వంటపని, నేటి స్త్రీకి వంటపని ఆఫీసుపని రెట్టింపయ్యాయని సాధారణంగా సామాజిక శాస్త్రకారులు, ఉద్యమకారులు విశ్లేషిస్తూఉంటారు. ఈ మాట ఇవాళ ఉద్యోగాలు చేసుకునే వాళ్లను మాత్రమే దృష్టిలో పెట్టుకొని అనేమాట. నిజానికి శ్రామిక దళిత స్త్రీలు అనాదిగా రెండు పనులు చేస్తున్నారు. పొలంపని, వంటపని. జరుగుబాటున్న పై కులాల స్త్రీలు వంటపనికి పరిమితమైతే దళిత స్త్రీలు పొలంలోనూ, ఇంట్లోను శ్రమించడం సంప్రదాయమైపోయింది. ఈ వాస్తవాన్ని స్వరూపరాణిగారు బలమైన అభివ్యక్తితో అనేక చోట్ల చెప్పారు. విమలగారు తన తల్లి 'మండుతున్న పొయ్యిలా ఉంటుందంటే, ఈమె

"బతుకు రాళ్ల బాటలో
ఆకలి శిలువను మోస్తూ
పొయ్యిలో కట్టెలా
పొద్దుగూకులూ తగలబడుతుంది"

అన్నారు. శ్రమను దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే ఆడది అబల అనే మాట నిజం కాదు. శ్రామిక దళిత స్త్రీ విషయంలో ఇది అస్సలు నిజంకాదు. అని నిరూపిస్తున్నారు. స్వరూపరాణిగారు శ్రమ జీవనసౌందర్యం ఈమె కవితలో తొణికసలాడుతున్నది.

శ్రామిక స్త్రీ జీవితచిత్రణలో భాగంగా స్వరూపరాణి గారు చెంచు, లంబాడీ స్త్రీల మీద కూడా గొప్ప కవితలు రాశారు. గిరిజన జీవితం, సంస్కృతి కవయిత్రికి బాగా పరిచయమున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ క్రమ క్రమంగా అడవుల్లో కూడా దూరి గిరిజనుల జీవితాన్ని కూడా దోపిడి చెయ్యడాన్ని గిరిజన సంస్కృతీ విశేషాలతోనే ఆవిష్కరించారు.

" గంధపు చెక్కతో
వెదురు బియ్యాన్ని వండుకుతినే
నీ సంపదనెవరు దొంగిలించారు?................
క్రూరమృగాలను ముంజేతితో అదిలించే నువ్వు
మా'నవ' మృగాలచేతిలో చిక్కి
గువ్వ పిల్లలా దిక్కులు చూస్తున్నావు"

ఇటీవల లంబాడీ మహిళలు తాము బతకడానికి తాము కన్న బిడ్డల్నే అమ్ముకుంటున్న విషయం బాగా బయటికొచ్చింది. శాంతి నారాయణ 'నమ్ముకున్నరాజ్యం' కథలో ఈ విషయాన్నే బలంగా చెప్పారు. స్వరూపరాణిగారు ఈ ఘోరకలిని బిడ్డసంచులు' అని ఉపమిస్తూ రాసిన కవిత మనదేశ అభివృద్ధి ముందు పెద్ద ప్రశ్న గుర్తుగా నిలుస్తున్నది.

"కడుపుకూటికోసం
కడుపుతీపిని కిలోల లెక్కన అమ్ముకుంటున్నాం............
అమ్మతనాన్ని అంతర్జాతీయ మార్కెట్లో
అమ్మకానికిసిద్ధం చేసిన
లంబాడీ తల్లులారా............................
అద్దాలనాడే అన్నం మెతుకులయ్యే
పసిమొగ్గల్ని విరబూయడానికి
సారవంతమైన
'బిడ్డ' సంచులంటేచాలు"

గిరిజన స్త్రీని 'అడవిమల్లి 'గా కీర్తిస్తూ ఉత్తమపురుషలో రాసిన కవిత సభ్యప్రపంచాన్ని దిగ్భ్రాంతికి లోను చేస్తుంది. లంబాడీ స్త్రీల బట్టలమీద కుట్టిన అద్దాలలో యుగయుగాలుగా వ్యవస్థ పన్నిన కుట్ర పరావర్తిస్తుందన్న గొప్ప అభివ్యక్తి. సంప్రదాయ బద్ధంగా లంబాడీ మహిళలు వేసుకునే కాళ్ల కడియాలను బానిస సంకెళ్లుగా వర్ణించారు.

1980 ప్రాంతాలనుండి తెలుగు సాహిత్యంలోకి స్త్రీవాదం ప్రవేశించి ఒక్క కుదుపుకుదిపింది. కొత్త వస్తువు కొత్త అభివ్యక్తి వాదోపవాదాలు, ప్రగతిశీలవాదుల్లోనే ఆవేశావేశాలు అయినా స్త్రీ

వాదం చరిత్ర సృష్టించింది. నిలదొక్కుకుంది. స్త్రీవాదులు ప్రారంభంలో కోస్తా జిల్లాలనుంచి అగ్రవర్ణాల నుంచి వచ్చిన మహిళలే. వీళ్ళు స్త్రీలంతా ఒకటేననే దృక్పథంతో రచనలు చేశారు. గొడవలన్నీ మొగవాళ్లలోనే గాని ఆడవాళ్లంతా ఒకటే నన్న స్పృహ తొలితరం స్త్రీ వాదుల్లో ఉంది. దళితవాదం వచ్చి స్త్రీవాదంతో కలిసిన కొన్నాళ్లకు ఆడవాళ్లు కూడా అందరూ ఒకటికాదని స్త్రీలలోను కులం ఉందని వాదిస్తూ దళిత స్త్రీవాదం మొదలయ్యింది. ఈ ఆలోచనను నిర్మించడంలో స్వరూపరాణిగా పాత్ర తిరుగులేనిది.

*"కురవటం నేర్పిన నా నీలిమేఘమా!*
*నీ ప్రశ్నల చినుకులు*
*అన్నీ అమరిన వంటింటి దాకా వచ్చాయిగానీ*
*అసలు ఇల్లేలేని*
*నామూడు రాళ్ల పొయ్యిగుమ్మమైనా తొక్కలేదేం"*

అని బలంగా, స్పష్టంగా నిలదీశారు. స్త్రీవాదం క్రాపింగ్‌లనుండి జీన్స్‌లనుండి వేలిముద్రలవాళ్ల దగ్గరికీ ఊరిపొలిమేరలో ఆగిపోయిన వాళ్ల దగ్గరకు రావాలని ఆమె నినదించారు.

*" పెద్దింటి ఆడపడుచులంతా*
*మాగాళ్లతో సమానత్వంకోసం*
*పట్నాల్లో సమరం చేస్తున్నారంట*
*వాళ్ల నిప్పుల నినాదాలు*
*వూరి చివరి మనవాడకుకూడా*
*వినవస్తున్నాయి*
*నువ్వుచుట్టుగుడిసెలోంచి*
*తొంగిచూశావుకదా!*

అని స్త్రీవాదం అగ్రవర్ణస్త్రీలనుంచి క్రమంగా దళిత స్త్రీలవైపు రావలసిన అవసరాన్ని పేర్కొన్నారు. అదే సమయంలో స్వరూపారాణిగారు కుటుంబ వ్యవస్థను తిరస్కరించే స్త్రీవాదాన్ని తిరస్కరిస్తున్నారు.

*" నాన్నకి నాలుగుపెట్టి*
*ఎడంకాలితో తన్నిబయటికెల్దామనా!"*

అని ప్రశ్నించి దళిత స్త్రీకి దాని పర్యవసానాలు ఎలా ఉంటాయో వర్ణించారు.

హిందూమతంలోని అసమానత్వం వల్లే ఆ మతంలో వివక్షకు గురవుతున్నవాళ్ళు ముఖ్యంగా దళితులు ఆధునిక కాలంలో వలస పాలకులు మన దేశంలోకి తీసుకొచ్చిన క్రైస్తవమతంలోకి మారారు. విద్యా వైద్యం, ఆత్మగౌరవం వంటి సదుపాయాలు ఆ మతం ద్వారా వాళ్లు పొందగలిగారు. ఇటీవల హిందూమతోన్మాదులు ఈ కారణాన్ని గుర్తించకుండా క్రైస్తవమత ప్రచారకులపైన, క్రైస్తవ మత అనుయాయులపైన దాడులు చేశారు. ఈ దుర్మార్గాన్ని కూడా నన్‌లమీద దౌర్జన్యాలు జరిగినప్పుడు స్వరూపారాణిగారు విమర్శించారు. హిందూమతం తమను సవతి తల్లిచూపు చూస్తున్నదని తీర్మానించారు. హిందూమతం నుండి దళిత స్త్రీలు ఎందుకు మతం మారారోచెప్పి, చివరికి

*" వాళ్ల దేవుళ్ళో దెయ్యాలో*
*అయినవారో కానివారో*
*తర్కించి తెల్సుకోవడానికి*
*ఈతత్వాలేవి నాకు తెలియవు*
*ఈ దేశంలో కడుపునిండని వాడు*
*కడుపు మండినవాడు*
*ఎప్పుడు భౌతికవాదే"*

అని నిర్ధారించారు.

స్వరూపరాణిగారు సమస్యల్ని, బాధల్ని పట్టిక చేసి ఏ కరువు పెట్టి ఇతరుల్ని తిట్టి శాపాలు పెట్టి నిష్ఠూరం చేసి నోటి తీట తీర్చుకొని చేతులు కడుక్కునే బాపతు కవయిత్రి కాదు. ఆమెను సామాజిక సమస్యలు, వాటికారణాలు, వాటికి ప్రత్యామ్నాయాలు, అందుకు మార్గాలు కూడా తెలుసు. సమగ్ర రచయితకు ఉండవలసిన అర్హత ఇదే. దళిత స్త్రీల దుస్థితికి కారణాలైన అర్థిక సాంఘిక మత లైంగిక కారణాన్నిటినీ విశ్లేషించి, వర్తమాన సమాజం కన్నా భిన్నమైన సమాజాన్ని ఆమె కోరుకుంటున్నారు.

*"గుప్పెడు స్వేచ్ఛా వాయువు*
*పిడికెడు మనిషితనం*
*ఇపుడు*
*నా ప్రాథమిక అవసరాలు"*

స్వేచ్ఛా ప్రేమ సమానత్వాలతో నిండిన మానవీయ సమాజం స్వరూపరాణిగారు ప్రతిపాదిస్తున్నసమాజం, అయితే అది అంతసులభంగా గాలిలోంచి ఊడిపడదనీ ఆమెకు తెలుసు. ఉద్యమించందే సాధ్యం కాదని ఆమెకు స్పష్టంగా తెలుసు.

*"ఇక నాకు పరుగెత్తే ఓర్పులేదు*
*ఈ కష్టాల మంటల్లోనే*
*బతుకుని కడుక్కొని*
*మంకెనపూవులా విచ్చుకుంటాను*
*అగచాట్ల అడవుల్ని దాటి*
*సెలయేరులా దూకుతాను"*

అని శపథం చేశారు. కులం పునాదుల్ని పెకలించి కులరహిత సమాజానికి పిలుపునిచ్చారు.

*"కులంకంపు కొడుతున్న*
*ఈ దేశం రోడ్లన్ని*
*బంగాళాఖాతంలోకి వూడ్చుదాం"*

చెంచిత జీవిత విధానాన్ని వర్ణించి చివరికి

*"నీ విల్లమ్ములతో*
*ధ్వంసం చేద్దువుగానిరా"*

అని ఆహ్వానించారు.

*" ఇక్కడ పూలన్‌వైనా*
*మదికెర (మార్తామ్మవైనా)*
*కదిలే ఆయుధాగారాలు కావాల్సిందే"*

నని పిలుపునిచ్చారు.

అసమవ్యవస్థను యుద్ధభూమిగా భావించి, ఆ యుద్ధభూమిలోకి తాను వెళుతున్నానని ప్రకటించారు. మనిషితనం నిండిన సమాజ నిర్మాణ కోసం కవిత్వ కవాతు చేస్తున్న సైనిక చల్లపల్లి స్వరూపరాణి. ఈమెది జరుగుబాటు కవిత్వం కాదు తిరుగుబాటుకవిత్వం.

■

# మైకేల్ జాక్సన్ నలుపు తెలుపు



*అప్పులే మిగిలాయి...*

**జూన్ 26** న కన్నుమూసిన పాప్ సంగీత దిగ్గజం మైకేల్ జాక్సన్ పాప్ సంగీతంలోనే కాదు నిజజీవితంలో కూడా రారాజులా బతికాడు. అయితే చివరకు దాదాపు 40 లక్షల డాలర్ల రుణ భారంతో కన్నుమూశాడు. మ్యూజిక్ వీడియోల ద్వారా సంగీత ప్రియులకు దగ్గరయిన జాక్సన్ 1981లో కేబుల్ ఛానల్ ఎంటీవీ ద్వారా విశ్వవిఖ్యాతి నార్జించాడు.

1982లో ఆయన అందించిన 'థ్రిల్లర్' అమెరికాలో బెస్ట్ సెల్లర్ ఆల్బమ్స్‌లో రెండో స్థానంలో నిలిచింది. జాన్‌లెండిస్ దర్శకత్వంలో వచ్చిన ఆ మ్యూజిక్ వీడియోను ఎంటీవీ ప్రతి గంటకూ ప్రసారం చేసి సంగీత ప్రియులను ఆకర్షించే ప్రయత్నం చేసింది. ఐదేళ్ల తరువాత ఆయన విడుదల చేసిన 'బ్యాడ్' మ్యూజిక్ వీడియో 2.2 కోట్ల కాపీలు అమ్ముడు పోయింది. ఈ వీడియో రూపకల్పన కోసం జాక్సన్ సోనీ కంపెనీతో 6.5 కోట్ల డాలర్ల మేర ఒప్పందం కుదుర్చుకున్నాడు. 1986లో వాల్ట్ డిస్నీ కంపెనీ ద్వారా ఆయన మరింత స్టార్‌డంను సంపాదించుకున్నాడు. ఆయన కీర్తి ప్రతిష్టలను పతాక స్థాయికి తీసుకెళ్లింది-ఎటివీ మ్యూజిక్ ఛానల్‌తో కుదుర్చుకున్న ఒప్పందం. దాదాపు 4.75 కోట్ల డాలర్ల విలువైన ఈ ఒప్పందం ద్వారా బీటిల్స్, జాన్ లెనన్. పాల్ మెక్ కార్ట్నీ వంటి రచయితల గీతాల హక్కులను కూడా ఆయన సొంతం చేసుకున్నారు. ఈ గీతాల కేటలాగ్‌తో స్థిరమైన ఆదాయం సమకూరడంతో ఆయన విలాసవంతమైన జీవితానికి అలవాటు పడ్డాడు. 1988లో ఆయన నెదర్లాండ్‌లో రాంచ్ ఎస్టేట్‌ను 46 కోట్ల డాలర్లకు కొనుగోలు చేశాడు. అయితే అదే ఏడాది 13 ఏళ్ల బాలుడిపై అత్యాచారానికి పాల్పడినట్లు వెలువడిన అభియోగాలు ఆయన కీర్తిని అధఃపాతాళానికి దిగజార్చాయి. ఆ బాలుడి కుటుంబానికి నష్టపరిహారం చెల్లించి ఆ కేసును రూపుమాపినా నాటి నుండే కెరీర్ గ్రాఫ్ కూడా తిరోగమనం పట్టింది.

1995లో ఎటివి సోనీ కంపెనీతో విలీనం కావడంతో జాక్సన్‌కు 9.5 కోట్ల డాలర్ల నష్టం వాటిల్లింది. ఆ తరువాత 2001లో ఎటివి ఆస్తులను తనఖా పెట్టి 20 కోట్ల డాలర్లను బ్యాంకాఫ్ అమెరికా నుండి రుణంగా తీసుకున్నాడు. ఆర్థిక సమస్యలు చుట్టుముడుతుండడంతో భారీ యెత్తున రుణాలు చేశాడు. 2002లో ఆయనపై దాఖలైన ఒక దావాలో ఆయన 1.2 కోట్ల రూపాయల ఫీజులు కోర్టు ఖర్చులు బకాయిపడ్డాడు.

*కెరీర్ గ్రాఫ్...*

ఇండియానా రాష్ట్రంలో 1958 ఆగస్టు 29న గారీ దంపతులకు 7వ సంతానంగా మైఖేల్ జోసఫ్ జాక్సన్ జన్మించాడు. కొన్ని సంవత్సరాల శిక్షణ అనంతరం 1963 ప్రాంతంలో జాక్సన్ 5 అనే ట్రూప్‌లో ఒక సభ్యుడుగా ప్రేక్షకుల ముందుకొచ్చాడు.

1970లో తొలి ఆల్బమ్ 'డయానా రోజ్ ప్రెజెంట్స్ ద జాక్సన్ 5' వెలువడింది. 'ఐ వాంట్ యు బ్యాక్', 'ఐ విల్ బి దేర్' మొదలైన హిట్స్ ఇందులోనివే. ఓ వైపు జాక్సన్ 5 ట్రూప్‌లో కొనసాగుతూనే... మరోవైపు తానొక్కడే రూపొందించిన 'గాట్ టు బి దేర్' 1970 విడుదలైంది.

1979లో సోలోగా రూపొందించిన ఆల్బమ్ 'ఆఫ్ ద వాల్'. ఇందులోని నాలుగు పాటలు టాప్ 10లో చేరాయి. ఒక సోలో ఆర్టిస్ట్ ఈ ఫీట్‌ను సాధించడం మొట్టమొదటిసారి. 1982లో వచ్చిన 'థ్రిల్లర్' ఎనిమిది గ్రామీ అవార్డులను గెలుచుకొని ప్రపంచ సంగీతాభిమానుల్ని ఉర్రూతలూగించింది. అత్యధిక సంఖ్యలో అమ్ముడుపోయిన ఆల్బమ్‌గా ఆల్‌టైమ్ ప్రపంచ రికార్డు సృష్టించింది 'థ్రిల్లర్'.

1983లో తొలిసారిగా టెలివిజన్ తెరపై తన నృత్య ప్రదర్శనతో, పాటలతో 5 కోట్ల వీక్షకుల్ని మైమరిపించజేశాడు.

1985లో ఇథియోపియన్ శరణార్థులను ఆదుకోవడం కోసం 'వి ఆర్ ద వరల్డ్' అనే ఆల్బమ్ విడుదల చేశాడు. 1987లో వచ్చిన 'బ్యాడ్' ఆల్బమ్ 2.2 కోట్ల కాపీలు అమ్ముడుపోయి రికార్డు సృష్టించింది.

1993లో తాను చర్మ సంబంధిత క్యాన్సర్‌తో బాధపడుతున్నట్టు ఓ టీవీ ఇంటర్వ్యూలో చెప్పాడు.

1994లో లీసా మ్యారీ ప్రిస్లేను జాక్సన్ వివాహమాడాడు. రెండేళ్ల అనంతరం వారు విడాకులు తీసుకున్నారు. 1997లో డెబ్బోరితో రెండో పెళ్ళి జరిగింది.

2002లో తన ఇంట్లో ఉంటున్న పిల్లాడిపై లైంగిక అత్యాచారానికి పాల్పడ్డాడనే ఆరోపణలు ఎదుర్కొన్నాడు. ఆ తరాత వాటిలో నిర్దోషిగా తేలాడు.

2006లో తీవ్రమైన అప్పుల ఊబిలో జాక్సన్ కూరుకుపోయాడు. చివరికి తన సొంత ఇంటిని సైతం విడిచిపోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. కాలిఫోర్నియాలోని 2,600 ఎకరాలలో అత్యంత ఖరీదైన నెవర్‌లాండ్ రాంచ్ ఎస్టేట్‌ను కూడా అప్పులవాళ్లు జప్తు చేశారు. తాను దివాళా తీసినట్టు జాక్సన్ ప్రకటించాడు. ■

◆ కథ



# శివయ్య అటుకులు మెషీను

- బుద్ధి యజ్ఞమూర్తి

మహాశివరేత్రి అనేకంటే అటుకుల పండగ అంటేనే మా పిల్లకాయలకి ఎక్కువగా తెలుసుద్ది. ఆ పండక్కి రెండోరాల దాకా రైలు స్టేషనుకాడి శివయ్య అటుకుల మిషనుకి అలుపూ సొలుపూ ఉండదు. మిగతా రోజుల్లో అటుకులు యేయించుకోడానికి ఎవురొత్తారా అని ఎదురుచూసే శివయ్య, ఆ రెండు వారాలు మాత్తరం వొచ్చినోళ్లని లైన్లో నించొమ్మని గదుంతా ఉంటాడు. పొద్దున ఎనిమిదింటికి మొదలయ్యే మిషను రేత్రి పదింటిదాకా ఆడతానే ఉంటుంది. పండగరోజు మా నాన్న రేత్రి ఏడు గంటలకి దేవుళ్ల పటాల ముందు తెల్ల పంచె కట్టుకుని పూజకి కూర్చుంటాడు. ఇస్తరాకులో అటుకులు, బెల్లం, అరటిపళ్లు కలిపి పిసికి, ముద్ద చేయడం సూత్తంటే నాకు భలేగా అన్పిత్తుంది. నాన్న పక్కనే బుద్ధిగా కూర్చుని, ఆయన అటుకుల ముద్దని నైసుగా చేత్తా వుంటే అట్టాగే చూసేవోణ్ణి. పూజ ఐపోయాక భోజనానికి కూర్చున్నప్పుడు ఒక అటుకుల ముద్ద తినడం అంటే నాకు శానా ఇట్టం. ఎప్పుడెప్పుడు అన్నాలేళ అవ్వుద్దా, ఎప్పుడు అటుకుల ముద్ద తిందామా అని వొకటే యావ నాకు.

ప్రెతి మహాశివరేత్రికీ అటుకులు పోయించుకోవడం కోసమని మా నానమ్మ వొడ్లు తెచ్చిచ్చేది. మ నాన్నోళ్లు మొత్తం ఐదుగురు అన్నదమ్ములు. మా నాన్న మధ్యలోవోడు. అందుకే అంతా మా నాన్నోళ్లని పాండవులనీ, నాన్నని అర్జునుడనీ అనేవోళ్లు కానీ సాధనాలప్పుడు నాన్న గద తిప్పుతాడు కదా.. అప్పుడు మాత్తరం భీముడితో పోల్చేవాళ్లు. మాకు సెంటు పొలం కూడా లేదు. తాతయ్యకే కొంచం - అదీ ఎకరంన్నర మాత్తరం ఉంది.

ఏడాదికోసారి వొరి యేస్తారందులో. నాకు రెండో యేడప్పుడే ఇప్పుడు మేం వుంటున్న ఇంటికి వొచ్చేశాం. ఇది కూడా తాతయ్య కట్టించిన ఇల్లే. రెండు వాటాల డాబా. ఓ వాటాలో మా పెద పెదనాన్న, రెండో వాటాలో మేం ఉంటన్నాం. రెండో పెదనాన్నా, ఇద్దరు బాబాయిలతో కలిసి తాతయ్యావోళ్లు పాత పెంకుటింటో వుంటన్నారు. కలిసుంటం వల్ల పొలం పనులు తాతయ్యా, రెండో పెదనాన్నా చూసుకుంటన్నారు. మేం ఆళ్లతో లేం కాబట్టి, వొడ్లలో మాకేమీ వాటా లేదు. ఉత్త నేతమీదనే ఆధారం.

పెంకుటింట్లో ఉండే వొంటింట్లో కుదేపు 'పురి' యేసి వొడ్లని అందులో దాత్తుంటారు. మిగతా రోజుల్లో మాకెప్పుడూ వొడ్లుగానీ, బియ్యంగాని ఇచ్చేవోళ్లు కాదుకానీ ఈ అటుకుల పండక్కే నానమ్మ రెండు మానికల వొడ్లు తెచ్చిచ్చేది. ఇప్పుడు కూడా అట్టాగే తెచ్చింది. "అమ్మాయ్ సరోజినే" అని కేకేసింది, ఇంట్లోకి రాకుండానే గడపల మీద కూర్చుంటా. అమ్మ గుడ్డలు ఉతుకుతా ఉంటే నేను ఆటిని నీళ్లలో గుంజి పక్కన పెడతన్నా. నాన్న మగ్గంలో ఉన్నాడు. "ఏంటమ్మా?" అడిగాడు నాన్న 'వాటు' యెయ్యడం ఆపి.

"వొడ్లు తెచ్చాన్రా. సరోజ్ని లేదా?" అని నానమ్మ అంటుండగల్నే అమ్మ వొచ్చింది, తడి చేతుల్ని కొంగుతో తుడ్సుకుంటా. "అమ్మాయ్! ఏదైనా గిన్నె తీస్కురా. వొడ్లు పోస్తా" అని నానమ్మ చెప్పంగాల్నే వొంటింట్లోంచి స్టీలు గిన్నె తెచ్చిందమ్మ. ఇత్తడి బిందెలో తెచ్చిన వొడ్లని మానికతో కొలిచి గిన్నెలో పోసింది నానమ్మ.

"ఇట్టా ఎవరికాళ్లే యేరుగా పండగ చేస్కునేకంటే అంతా కల్సి ఒక్కచోట చేస్కుంటే ఎంత బాగుంటదిరా. నా మాట యినిపిచ్చుకునేవోళ్లు వొక్కరూ లేరయ్యే" అంది నానమ్మ బాదపడ్తా.

"యెందుకు యినిపిచ్చుకోరమ్మా. ఇప్పుడేదో నువ్వు మాట వరసకి అన్నట్టు అంటన్నావు గానీ యెవురూ ఆ సంగతి ఇంతదాకా అనుకోలేదు గదా" అన్నాడు నాన్న వాటు యెయ్యడం ఆపి.

"అవున్రా. తెగ యినిపిచ్చుకుంటన్నారు నా మాట. యెవడి దెగ్గిర ఈ మాటన్నా ఇట్టాగే జవాబు చెబ్తున్నాడు. ఈ పెద్దోడూ అంతే. వొక్కడన్నా ముందుకు వొత్తేగా" అంది మోకాలు చేత్తో వొత్తుకుంటా.

ఇంక నాన్నేం మాట్టాడతాడు? మనసులో ఉన్నది బయటకి తీస్క రావడానికి యెవళ్లయినా ప్రెయత్నం చేత్తే గదా. నానమ్మ "మీరింతేరా మారరు" అంటా లేచింది, కళ్లు తుడ్సుకుంటా.

నేను గబగబా ఆడికొచ్చి "అమ్మోయ్. నువ్వు ఉత్కిన గుడ్డలన్నీ గుంజేశానే. మరి నానమ్మ వొడ్లు తెచ్చింది కదా. అటుకులు యెప్పుడు యేస్కరావాలి?" అనడిగా.

"ఆ.. దీనికి మాత్తరం అబ్బాయి అడక్కుండానే రెడీ. గుడ్డలు

గుంజేందుకు పదిసార్లు అరిత్తేగానీ రానోడు దీనికి సిద్ధం" అందమ్మ మళ్లా దొడ్లోకి పోతా.

"రేప్పొయి యేసుకొద్దువ్‌గానీ లేరా.. సరేకానీ.. అరిటాకు పచ్చ కండెలు ఐపోయొచ్చాయ్. తొందరగా చుట్టియ్యి" అన్నాడు నాన్న.

ఆయనొంక బిక్కమొకం పెట్టుకుని జూత్తా 'రేబ్బళ్లో తెలుగు మాస్టార్కి పాటం వొప్పజెప్పాల్నాన్నా, అచ్చదూకోవాలి" అన్నా, నాన్న చెప్పిన పని తప్పించుకోవాల్నని.

"నాకు తెల్సులేరా నీ యేశాలు. పనంటే చాలు అబ్బాయికి చదువు గుర్తుకొత్తుంది. సోమారినాయాల. ముందు కండెలు చుట్టిచ్చి, తర్వాత చదూకో పో" కసిరాడు నాన్న.

ఈసారి ఎదురుచెబితే సువ్వ తీస్కుని ఈపు ఇమానం మోత మోగిత్తాడేమోనని బయపడ్తా రాట్నం కాడ కూర్చున్నా, కండెలు చుట్టేదానికి.

* * *

అయ్యాళ ఆదోరం.

"అమ్మోయ్. పెందళాడే పోతే ఎవురూ ఉండరు. తొందర్గా అటుకులు యేయించుకుని రావొచ్చు" అన్నా, నిద్రమొకం తోటే. "నీకీ అటుకుల పిచ్చి పట్టిందేంట్రా నాయినా. అల్లు సాయాలి. అదయ్యాక పోదువ్‌గానీలే" చెప్పిందమ్మ పాలు పొయ్యిమీద పెడ్తా.



**బద్దల్తో చిన్నా, పెద్దా కొత్త కచ్చులెయ్యాలి. దంత్రం జరపాలి. కచ్చులు పోనిచ్చేప్పుడు పోగులు తెగితే అత్కుతుండాలి. కచ్చులు ఆఖరుదాకా పోయాక బొగ్గు మసితో కానీ, తెల్లరాయితో కానీ గజానికో అంటేస్కుంటా రావాలి.**

అల్లు సాయాలనేసర్కి ఏడ్పు వొచ్చినంత పనైంది. ఆ అల్లుకాడ ఉండటం యెంత కట్టమో. పాగళ్లు పట్టుకోవాలి. కచ్చులు పోనియ్యాలి. బద్దల్తో చిన్నా, పెద్దా కొత్త కచ్చులెయ్యాలి. దంత్రం జరపాలి. కచ్చులు పోనిచ్చేప్పుడు పోగులు తెగితే అత్కుతుండాలి. కచ్చులు ఆఖరుదాకా పోయాక బొగ్గు మసితో కానీ, తెల్లరాయితో కానీ గజానికో అంటేస్కుంటా రావాలి. కచ్చులు ఇనుప సువ్వకి తగిలించి దోనె తిప్పుకుంటూ వొస్తుంటే మళ్లా కచ్చెలు జరుపుతూ పోవాలి. ఇన్ని పనులు! అంతసేపూ అల్లుకాడ వుండటం ఎంత కష్టం? దోనెతో పడుగు మొత్తం చుట్టేశాక అల్లు సాయడాన్కి యేసిన కచ్చి బద్దలన్నీ యేరుకుంటా అన్నిట్నీ కలిపి కట్ట కట్టాలి. లేకపోతే ఈపు ఇమానం మోత మోగినట్లే.

నాన్నకి రోజూ పొద్దున్నే చిన్నబజార్కి పోయి, టిఫిను తిని, తన సావాసగాళ్లతో లోకాభిరామాయణం, రాజకీయాలు ఓ అరగంట మాట్లాడితే కానీ రోజు గడవదు. అయ్యేళ నాన్న చిన్నబజార్కి పోయొచ్చేలోపల నేను పుణ్యావతి కొట్టుకాడికెళ్లి అమ్మకీ, నాకూ, చెల్లాయిలిద్దరికీ కలిపి పన్నెండు ఇడ్లీలు తెచ్చా. ఆదోరాలూ, సెలవులూ వొచ్చినప్పుడే మాకు ఇడ్లీలు కానీ, అట్లు కానీ తినే ఛాన్సు వొచ్చేది. బడున్న రోజుల్లో ఐతే పొద్దున్న పున్నీళ్లన్నమే. టిఫిన్లు అయ్యా అవకముందే నాన్న అల్లు సాయడానికి కర్రులు పాతాడు. దాయకర్రలు వేశాడు. ఇంట్లోకొచ్చి అచ్చు తీస్కపోయాడు. నేను ఇడ్లీలు తిని చేయికి అతుక్కున్న కొబ్బరి పచ్చడ్ని సమ్మగా నాక్కుంటా ఉంటే 'రేయ్ అబ్బాయ్. తొందర్గా రారా. ఎంతసేపు ఎదుర్చూడాలి" అని కేకేశాడు నాన్న.

అల్లు సాయడం ఐపోయాక గబగబా మొకం కడుక్కుని వొడ్ల సంచీ పట్టుకుని ఆమైనే లగెత్తా, మళ్లా అమ్మో, నాన్నో ఇంకేదైనా పని చెప్తారేమోనని. చిన్నబజార్దాటి గొల్లపూడోళ్ల సందులో నడుత్తుంటే కొండలు మావయ్య, ఎదురయ్యి "యేడకిరా?" అనడిగాడు. "అటుకులు యేయించుకోడానికి" చెప్పా.

"సరే. యేయించుకున్నాక మనింటికిరా. ఇద్దరం కల్సే మీ ఇంట్కి యెళ్దాం" అన్నాడు మావయ్య. "ఓ అట్టాగే" అని నడిచా. సరస్వతీ హాలు కాడ ఆగి గోడలికి అంటించిన పెద్ద పెద్ద సినిమా బొమ్మలు చూత్తా నిల్చున్నా. 'చిక్కడు దొరకడు' వాల్ పోస్టర్లో ఎన్టీ రామారావు, కాంతారావు కత్తుల్తో ఫైటింగు చేత్తన్నారు. అళ్ల పోజుల్ని అట్టాగే చూత్తా "నే కూడా కత్తిసాము తొందర్గా నేర్చుకోవాలి" అనుకున్నా, అళ్ల మాదిరే కత్తి పట్టుకున్నట్టు పోజులు పెడతా. నాకప్పట్కే కర్రతిప్పడం వొచ్చు. చెప్పనే లేదు కదా. మావోళ్లు సాధనం అంటే సాములు చెయ్యడంలో కూడా మొనగాళ్లే, నేతలోనే కాకుండా.

"ఏంది బేటా. ఏం చూత్తన్నావక్కడ. ఇందాకట్నించీ చూత్తన్నా. చేతులు బలేగా ఆడిత్తున్నావే" అన్నాడు పక్కనే ఉన్న కిళ్లీ బొంకు సాయిబు నవ్వుతా. సిగ్గుపడి "ఆ.. యేంలే" అని పళ్లికిలిత్తా సర్రున లగెత్తా. గరల్స్ హై స్కూలు ముందునుంచి లగెత్తుతా ఉంటే సంచిలోని వొడ్లు ఎగిరెగిరి పడ్డాయి. సంచి చినిగిపోద్దేమోనని బయపడి, ఆగి మళ్లా మామూలుగా నడుత్తున్నా. పంచాయితీ పార్కు దాట్టంతోటే మనుషుల లైను అవుపించింది.

'అమ్మయ్యో. అప్పుడే శానా జనం వొచ్చేశారే' అనుకుంటా పోతే.. మరీ యెక్కువ మందేం లేరు. ఇరవై మందిదాకా లైనుగా నిల్చోనున్నారు. అళ్లలో వొకర్రెండు నాకు తెల్సిన మొకాలు అవుపించాయి కానీ అళ్లకి మాత్తరం నేను తెలుసో, లేదో తెల్వదు. పోయి ఆఖర్న నిల్చున్నా. లైన్నో నిలబడకపోతే శివయ్య కేకలేత్తాడు.

"అందరూ వొడ్లుని తడిపి ఆరబెట్టి తెచ్చారా? లేపోతే అట్కులు సరిగా రావు" అని ఎచ్చరించాడు శివయ్య. అందరూ ఆరబెట్టే తెచ్చామన్నారు. అటుకుల మిషను గరగరమంటా తిర్గతా ఉంటే ఈ చివర్నించి ఆ చివర్దాకా నవ్వారు బెల్టు కూడా సుయ్యిమంటా తిర్గుతా ఉంది. వొడ్లుని పైన దొప్పలో యేసినాక మద్దిమద్దిలో చూస్కుంటా అటుకులు సరిగా వొచ్చినాయనుకున్నప్పుడు గొట్టాం తెర్చి అటుకుల్ని కింద డబ్బాలో పడేట్లు చేసి ఎవురివి అళ్లకిత్తున్నాడు శివయ్య. వొక్కక్కరే యెళ్లిపోతన్నారు. నా ముందింకా యిద్దరే ఉన్నారు. అప్పుడే ఆడికి సురేషు వొచ్చాడు. ఆడు నాకు తెల్సు. నాయుడుగోరి మనవడు. మా బళ్లోనే తొమ్మిది చదూతున్నాడు. నాయుడు గోరంటే ఊళ్లో హడల్. ఆయన కుర్రోడిగా వున్నప్పుడు ఊళ్లో గుర్రంమీద కొరడా పట్టుకుని తిర్గేవోడంట. ఎవురైనా తనకి చేతులెత్తి దణ్ణం పెట్కపోతే కొరడాతో కొట్టేవోడంట. అప్పట్లో ఊళ్లో సగం పొలంపైనే ఆయన చేతికింద ఉండేదంట. ఇప్పుడందులో శానావరకు పోయింది. ఆయనకూడా పచ్చవాతం వొచ్చి మూతొంకరపోయి, కాలు చచ్చుబడిపోయి మంచానికి అతుక్కుని వున్నాడు. ఐనా అళ్లకి జనం బయపడ్డం మానలా.

సురేషు లైన్లో ఉన్న మమ్మల్ని దాటుకుని ముందుకెళ్లి "ఓయ్ శివయ్యా. ముందు నాకీ అటుకులు యేసియ్యి" అన్నాడు దబాయిత్తా.

"వొక్క నిమిషం ఆగు బాబూ యేసిత్తా. అయినా మీరొచ్చారేంది బాబూ. ఆ సుబ్బిగాడు లేడా" అంటూనే గబగబా ఆ

# ఆ నాలుగు చేతులు

అడిగోపుల వెంకటరత్నం



వెలుగులో క్రీడించిన శరీరానికి
పొదగటానికి చీకటి విరామం!
పరస్పరం ఆలింగనం చేసుకున్న
ఆ నాలుగు చేతులు
ఆ రెండు మనసులు
స్నేహ హస్తం చాస్తాయి
స్వాగతాలు సుస్వాగతాలు
వీడ్కోలు ఘనవీడ్కోలు
నడకల్లో మహాపథం చూపటాలు
మాటల్లో అమృతం వర్షించటాలు
ఆదిపర్వం ముగిసాక
కపోతాలు సమూహాలై
సౌహార్ధం రాశులుపోస్తాయి
సీతాకోక చిలుకలు పరదాలుకట్టి
కాన్వాసులు చిత్రిస్తాయి
వెండిమబ్బు తొలకరి చినుకులు చల్లి
గంధానికి సుగంధం పూస్తుంది
చీకటి రంగులు మారుతాయి
సంజె చీకట్లో జీవులు గూటికి చేరి
రాక్షస కృత్యాలకు బీజం వేస్తాయి
చీకట్ల సామ్రాజ్యానికి
కటిక చీకటి రారాజు
అరాచకాలు అత్యాచారాలు
స్వయంవరానికి సిద్ధమౌతాయి
స్నేహహస్తం చాచిన
ఆ నాలుగు చేతులు
మూడు సింహాల కాపలా సాక్షిగా
ప్రత్యర్థులై హత్యలౌతాయి!
రక్తాన్ని కడిగిన క్రౌంజీకటి
ధవళవస్త్రం ధరించి
తేటతేట వెలుగులోకి నడుస్తుంది!
మళ్ళీ మరో నాలుగు చేతులు
రెండు మనసులు నేస్తాలై-

---

అబ్బాయి చేతిలో ఉన్న స్టీలు టిపిను అందుకున్నాడు. దొప్పని కాళీచేసి నా ముందున్నాయన వొడ్లని యెయ్యబోతంటే "ఏందోయ్ శివయ్యా. యేమనుకుంటన్నావ్. నన్నిక్కడే నిలబెడ్తావా? ముందు నాకు యేసియ్" అన్నాడు గదుంతా సురేషు.

"లైన్లో మడుసులున్నారు కదా బాబూ. ముందు మీకేసిత్తే ఆళ్లూర్కుంటారా. మీరింటికెళ్లి సుబ్బిగాణ్ణి పంపియ్యండి బాబూ" చెప్పాడు శివయ్య.

"ఆ సుబ్బిగాడుంటే నేనెందుకొత్తాను. జరమని ఆడు పక్లోకి రాలా ఇయ్యాళ. అందుకే మమ్మ నన్ను పంపిచ్చింది. ముందేసియ్యి. ఎపుడద్దుగ్తాడో జూత్తా" అన్నాడు జమీందారు మాదిర్గా.

నాకు కోపం వొచ్చేసింది. ఊరుకోలేకపోయా. "ఇగో శివయ్యా. మేమంతా గంట సేపట్నించీ లైన్లో నించున్నాం. ఆ అబ్బాయికి యేసియ్యడం ఎట్టా కుదురుద్ది" అన్నా. అంత ధైర్నం ఎట్టా వొచ్చిందో తెలీదు నాకు. "అవును" అన్నారు లైన్లో నించున్నాళ్లంతా.

"యేందిరోయ్ బుడంకాయిలా ఉన్నావ్. నోరేంది తెగ పెగుల్తుంది. నోర్మూసుకో నాయలా" అన్నాడు సురేషు.

బుడంకాయనేప్పటికి నాకు రోషం పొడుసుకొచ్చింది. "మాకో రూలు, నీకో రూలా. అదేం కుదర్దు. లైన్లో వున్నోళ్లకి యేసినాకే నీకు" అన్నా మొండిగా. పెద్దోళ్లు కూడా "అవును బాబూ. ఆ పిల్లాడు అన్నదాంట్లో తప్పేముంది. మేమందరం శానా సేపట్నించీ బారులో నిల్చున్నాం. వరస పెకారమే నువ్వూ యేయించుకో" అన్నారు నాకు సపోర్టుగా.

సురేషు నావొంక తినేసేట్టు చూత్తా యేమనలేక మా యెన్క చివర లైన్లో నిల్చున్నాడు. నాకు హీరో అయిపోయినంత ఆనందమేసింది.

ఇంటికెళ్లాక అమ్మతో ఈ సంగతి చెబ్తే "భడవా యేలెడంత లేవుగానీ అప్పుడే ఇంత పంతమేందిరా నీకు" అని బుగ్గలు పుణికింది.

* * *

శానా రోజులు గడిశాయి. దసరా సెలవులొచ్చాయి. మేం తిరపతి ప్రయాణం పెట్టుకున్నాం. తిరపతిలో నాకూ, చెల్లాయిలకీ చెవులు కుట్టిత్తారంట. మేం రైలు స్టేషనుకి నడుచుకుంటా పోతున్నాం. పార్కు దాటంగాల్నే నా కళ్లు శివయ్య అటుకుల మిషనేపు పోయాయి. బిత్తరపోయా. అక్కడ అటుకుల మిషనుగానీ, శివయ్య ఉండే గుడిసె కానీ లేదు. అక్కడిదాకా రోడ్డు యెడల్పు జేశారు. మనసులో శానా



**అంతదాకా కళకళలాడతా అవుపిచ్చిన ఆ చోటిప్పుడు ఖాళీగా, బోసిగా, యేదో పోగొట్టుకున్నదాని మాదిర్గా అవుపిచ్చింది. శివయ్య అటుకుల మిషను యేమైంది? నాన్నకు తెలుసేమోనని అడిగా.**

బాద కలిగింది. అంతదాకా కళకళలాడతా అవుపిచ్చిన ఆ చోటిప్పుడు ఖాళీగా, బోసిగా, యేదో పోగొట్టుకున్నదాని మాదిర్గా అవుపిచ్చింది. శివయ్య అటుకుల మిషను యేమైంది? నాన్నకు తెలుసేమోనని అడిగా. "ఈడ రోడ్డు పెద్దజ్జేసి ఆర్నెల్లు అయిపోయిందిరా. శివయ్య మిషన్ని పంచాయితీవోళ్లే బలవంతాన తీసేశారు, ఆడెంత యేడుత్తున్నా ఇనకుండా. ఇప్పుడాడు రైలుకట్ట అవతల గుడిసేసుకుని ఉంటన్నాడు. కూలీ పనులకి పోతున్నాడంట" చెప్పాడు నాన్న.

"మరైతే ఈసారి నేను అటుకులు యెక్కడేయించుకు రావాలి?" అడిగా. "కూరగాయల మార్కెట్టైనకాల ఉందిగా. అక్కడేయించుకొద్దువ్ గానీలే" అన్నాడు నాన్న.

కంట్లో తిరిగిన నీటి చుక్కల్ని రెండు భుజాలతో తుడ్చుకున్నా అమ్మకీ, నాన్నకీ కనిపిచ్చకుండా. ■

# బుచ్చిబాబు - కథారచన

డా. యు.ఎ. నరసింహమూర్తి



సాహిత్యకారుడిగా బుచ్చిబాబు తనతోవ తాను వేసుకుని తన నడక తాను నేర్చుకున్నాడు. ఎవరో కొందరు ఈ మలుపు దగ్గరా, ఆ మలుపుదగ్గరా తోవకాచి ఈతోవ ఇతనిది కాదని అడ్డుకట్టవేసినా నడకమాత్రం పూర్తిగా ఆయనదేనని ఒప్పుకోకతప్పదు. ఎడతెరపిలేని అధ్యయనం, స్వీయానుభవాలు బుచ్చిబాబు చేపట్టిన ప్రతి ప్రక్రియమీద ఆయన ముద్రవేసాయి. కథ, నవల, నాటకం, వ్యాసం వంటి సాహిత్య ప్రక్రియలు బుచ్చిబాబు చేతిలో కొత్త సొగసులు దిద్దుకున్నాయి. తెలుగులో మంచి కథలు రాసినవారిలో బుచ్చిబాబు పేరు తప్పక ఉంటుంది. కథలు రాయడమే కాదు కథా నిర్మాణాన్ని గూర్చి ఆయన కొంత విమర్శ చేసాడు. చలం, సోమర్ సెట్ మామ్, మొపాసా, చెకోవ్ వంటివారి కథా నిర్మాణ కుశలతను ఆకళించుకోవడంతోపాటు వారి అభిప్రాయాలను గూర్చిన ఆలోచనలను కూడా చేసాడు. మనుష్యులనూ, ప్రకృతినీ సమన్వయపరచి కవిదృక్పథంతో చిత్రించగల చలంగారి ప్రతిభ బుచ్చిబాబును ప్రధానంగా ఆకర్షించి అందులో స్వీయప్రతిభను మేళవించి ఒక కొత్తతోవ తొక్కేలా చేసింది. బుచ్చిబాబు హాస్యప్రియుడు కాదు. అయినా అసాధారణరీతిలో ఊహను, హాస్యాన్ని, విషాదాన్ని మేళవించే చలం ధోరణి ఆయనకు నచ్చింది. తన కొత్త సంస్కారాన్ని అందరిలో నాటుకునేలా చెప్పడానికి ఒకే విషయాన్ని పదేపదే చెప్పే చలం ధోరణిని గుర్తించిన బుచ్చిబాబు తన రచనలలో పునరావృత్తి లేకుండా జాగ్రత్తపడ్డాడు. ఒక రచయిత ప్రభావంలో పడడమేకాక ఆ ప్రభావం నుండి తప్పించుకోవడం కూడా బుచ్చిబాబుకు బాగా తెలుసు. ఆయన కథలు ఈ విషయాన్ని ఋజువుచేస్తాయి.

బుచ్చిబాబు దృష్టిలో అనుభవం, ఊహ కథకు ప్రధానావసరాలు. ఈ అనుభవాన్ని మళ్ళీ ఆయన స్వానుభవం, పరోక్షానుభవం అని రెండుగా విభజించాడు. అనుభవం లేనిదే ఊహ లేదంటాడాయన. అనుభవంలోంచే పాత్రలు, సన్నివేశం పుట్టుకొస్తాయి. వస్తువు సన్నివేశాన్ని నిర్ణయిస్తుంది. బుచ్చిబాబు కథలలో కథకంటే ఒక మానసికవ్యవస్థను చిత్రించడం ప్రధానంగా కనిపిస్తుంది. ఆధునిక కథాస్వరూపాన్ని మార్చిన ఈ ధోరణిని కాథెరిన్ మాన్స్ ఫీల్డ్ వంటివారి కథల పరిచయంతో తాను గుర్తించినట్లుగా ఆయన చెప్పుకున్నాడు. తాత్వికచింతనకు, చైతన్యస్రవంతి మార్గానికే చెందిన కథానిర్మాణరీతి కూడా ఆయన పాశ్చాత్య సాహిత్య పఠనంవల్ల తెలుసుకున్నదే. ఇదంతా చూస్తే కథానిర్మాణానికి బుచ్చిబాబు చెప్పిన అనుభవం, ఊహ మాత్రమేకాక ఇంకా అదనపుశక్తి ఏదో ఉందని తెలుస్తుంది. బుచ్చిబాబుకు ఆ శక్తీ ఉందీ, దానిపట్ల అభినివేశమూ ఉంది. కానీ అది కథకు గల ప్రాథమిక అవసరాలలో ఒకటిగా ఆయన భావించలేదు.

కథకు మూలాధారమైన అనుభవాన్ని గూర్చి బుచ్చిబాబు మరికొంత విమర్శ చేసినట్లు కనిపిస్తుంది. రచయితకు ఒక సంస్కారం ఉంటుంది. ఆ సంస్కారానికి అనుగుణమైన బాహ్యాజగత్తులోని సంవేదనలు అతని అంతరంగంలో ప్రవేశిస్తాయి, పేరుకునిపోతాయి. అలా పేరుకున్న అనుభవాలకు అనుగుణమైన ఊహ పొటమరించినప్పుడు అవి కథగా బైటపడతాయి. కథకు అసాధారణమైన ఊహలుండాలని, అవి ఆకాశం నుంచి ఊడిపడాలని అనుకోవలసిన పనిలేదు. అనుభవంలో అసాధారణత్వం ఉంటే ఊహ దానికి ప్రాణంపోస్తుంది. ఊహలో ఇతివృత్తాన్ని మథనంచేసిన కొంతకాలానికి కథకు రూపంవస్తుంది. అంతటితో కథారచన పూర్తికాదు. ఇతివృత్తం ఊహకనుగుణమైన రూపాన్ని పొందిన తరువాత అందులో కళాత్మకమైన సత్యాన్ని ప్రదర్శించగలగాలి. ఈ సందర్భంలో కథకుణ్ణి ఒక ఆవేశం కమ్ముకుంటుంది. ఇతివృత్తంలోను, సన్నివేశాలలోను, పాత్రలలోను ఉబికివచ్చే ఆ ఆవేశంలో కథకుడు లీనం కాకుండా తటస్థుడై ఉండాలన్నది బుచ్చిబాబు ప్రధాన ఆశయం. దానినే ఆయన కళాత్మక శిక్షణ అంటాడు. బుచ్చిబాబు కథల్లో ఊహప్రకర్ష ఉంటుంది. బిగువు నిండిన కవితాత్మకశైలి ఉంటుంది. ఎల్లోరాలో ఏకాంతసేవ, అరకులోయలో కూలిన శిఖరం వంటి కథలు

చదివిచూడండి ఈ ప్రకర్ష బిగువు మాత్రమేకాక దృఢమైన సంయమనాన్ని కూడా పాటించగలగడం బుచ్చిబాబుకు అధ్యయనంవల్ల సిద్ధించిన వరం. ఈ అధ్యయనంతోపాటు జిజ్ఞాస, కళాత్మకశిక్షణ కూడా ఆయనకు అలవడ్డాయి. కథలో భావాల చర్చలకు, స్థితిగతుల వ్యాఖ్యానాలకు చోటు లేదంటాడు బుచ్చిబాబు. ఈ అభిప్రాయం సమకాలీన కథలో బుచ్చిబాబు కథలకు ఒక ప్రత్యేకతను సమకూర్చింది.

**గొప్ప కథకుల అభిప్రాయాలను మన్నించే స్వభావం ఉన్న బుచ్చిబాబు కొన్ని విషయాలలో వారిని వ్యతిరేకించడం కూడా కనిపిస్తుంది. చెకోవ్ కథలంటే ఆయనకిష్టమే, కానీ కథలో కనిపించే తుపాకీ ఎక్కడో అక్కడ పేలక తప్పదనే సూత్రం మాత్రం ఆయనకిష్టంలేదు. కథలో ప్రధానాంశాలతో పాటు ప్రాధాన్యం లేని అంశాలకు కూడా చోటు కల్పించాలంటాడు.**

బుచ్చిబాబు కథను నిర్వచిస్తూ కథకు, నవలకు ఉండే తేడాను గూర్చి ఇలా చెప్పారు.

(1) ఒక రూపాన్ని, ఒక భావాన్ని కానీ వూహల్లో అతిలేకుండా సన్నిహితంగా చూడ గలిగిందే - వ్రాయగలిగిందే మంచికథ. అదే ప్రకృతిని వూహించి ప్రవేశించే చిత్రలేఖనం. అవి రెండు ఒక ఫ్రేములో చూపగలిగితే ఒక మంచి నవల అనిపించుకుంటుంది.

(2) క్షయరోగిని గూర్చిన కథ రాసినప్పుడు ఆ వ్యాధి లక్షణాలను, చరిత్రను గూర్చి వైద్యులను అడిగి తెలుసుకున్నాను. ఈ రకం వైజ్ఞానిక విషయాల సమీకరణ, పాండిత్యం నవలకి అవసరంగాని కథానికకు అక్కర్లేదు.

(3) కథకు అవసరం లేనంత పరిజ్ఞానాన్ని సేకరించడం వల్ల కథాంశాన్ని లోతుగా అవగాహన చేసుకోవడానికి, దానిని కళాత్మకంగా అభివ్యక్తం చేయడానికి వీలు కలుగుతుంది.

(4) కల్పన లేకుండా మంచికథ వ్రాయవచ్చు, కానీ అది గొప్ప కథ అవుతుందా అని నా అనుమానం.

ఇలా కథను గూర్చి అనేక విషయాలను విశ్లేషించి తన దృక్పథాన్ని వివరించడమేకాక కథాప్రక్రియకు సమకాలీనులలో ఉన్న ఆదరణను గూర్చి కూడా ఆలోచించాడు బుచ్చిబాబు.

కథలంటే తెలుగువారికి అభిమానమే. ఆ ప్రక్రియ స్వతంత్రానికి ముందే విస్తరిస్తూవచ్చింది. కానీ ఆ కాలంలో పద్యానికున్న సాహిత్య గౌరవం గద్యానికి లేకపోయింది. కవిత్వం లేని పద్యాన్ని కూడా తలకెత్తుకుని కవితా మయంగా ఉన్న కథను కూడా ఆదరించకపోవడం బుచ్చిబాబుకు కొంత బాధను కలిగించింది. ఆ అసంతృప్తిని తొలగించుకోడానికి మంచి కథలు రాసాడు. మధుర పదార్థాలు తినగా తినగా వెగటు కలిగించినట్లుగా మంచి కథలు కూడా చదవగా చదవగా విసుగు పుట్టిస్తాయేమోనని భయపడ్డాడాయన. అందుకే మంచికథ ఎంత చదివినా మళ్లీ చదవాలనిపించే ఖండకావ్యంలా ఉండాలని ఆశపడ్డాడు. కవితా గౌరవంతోపాటు అక్కడక్కడ ఛలోక్తులు కూడా ఉండాలని బుచ్చిబాబు ఆశయం. ప్రతి రచయితకు మౌలికమైన రచనా సూత్రం ఒకటుంటుంది. ఆ మౌలికాశయాన్నే అతడు అనేక రూపాలలో అనేక గ్రంథాలలో రాస్తూంటాడని విమర్శకులంటారు. బుచ్చిబాబు కూడా ఈ విషయాన్ని గుర్తించి కథకుడు ఎన్ని కథలు రాసినా అందులో రెండు మూడు రీతులే ఉంటాయని గుర్తించాడు.

గొప్ప కథకుల అభిప్రాయాలను మన్నించే స్వభావం ఉన్న బుచ్చిబాబు కొన్ని విషయాలలో వారిని వ్యతిరేకించడం కూడా కనిపిస్తుంది. చెకోవ్ కథలంటే ఆయనకిష్టమే, కానీ కథలో కనిపించే తుపాకీ ఎక్కడో అక్కడ పేలక తప్పదనే సూత్రం మాత్రం ఆయనకిష్టంలేదు. కథలో ప్రధానాంశాలతో పాటు ప్రాధాన్యం లేని అంశాలకు కూడా చోటు కల్పించాలంటాడు. వాటి వెనుకనే ఒక సమాజము, నాగరికత ఉంటాయని కథకుడు ఈ అనవసర విషయాల ప్రస్తావనతోనే వాటిని ధ్వనింపజేస్తాడని బుచ్చిబాబు అభిప్రాయం. తన కథకు మొదలు, తుది ఉండాలని చెకోవ్ కథలలో ఆ రెండూ ఉండవని బుచ్చిబాబు నిక్కచ్చిగా చెప్పాడు. కులాసాకోసం, వినోదం కోసం కథ అనే అభిప్రాయానికి కూడా బుచ్చిబాబు వ్యతిరేకి, బుచ్చిబాబు మరమేకులు - చీరమడతలు అనే కథను రాసి రస్సెల్‌కి అంకితమిచ్చాడు. నైతికత కంటే మానవత శ్రేష్ఠమైనదనే రస్సెల్ తత్వాన్ని అనుసరించి ఇతివృత్త కల్పనచేసి ఆయన అనుమతితో ఈ కథ రాసాడు బుచ్చిబాబు. ఇలాంటిదే ఇంకొక సందర్భం కూడా ఉంది. తన కుక్కపిల్ల చనిపోయిన వ్యథ నుండి బైటపడడానికి ఆయనొక కథ రాసాడు. ఆ రచనకు అంతర్గత ప్రేరణ, రాసిన తీరు తనకే స్పష్టంగా తెలియలేదని స్కాట్లండ్ రాణి మరణ శిక్షోదంతం చదవడానికి, ఆ కథా రచనకు సంబంధం ఉందని ఆయన భావించాడు. ఇలాంటి సందర్భాలను పేర్కొనడం వల్ల కథానిర్మాణంలో ఒక తాత్త్విక ప్రేరణకు లేదా అజ్ఞాత ప్రేరణకు ఉండే స్థానమేమిటో బుచ్చిబాబు సూచించినట్లయింది. బుచ్చిబాబు కథకు సంబంధించి చెప్పిన ఇంకొక విషయం చిత్రంగా కనిపిస్తుంది. తెలుగు వాళ్లు కథలు బాగా రాస్తున్నారని, తెలుగు కథ వికాసదశలో ప్రపంచపాఠకులను ఆకర్షించగల స్థాయికి ఎదిగిందని ప్రకటిస్తూనే అందుకు కారణంగా ఆంధ్రులలో కాస్త మామ్ తత్వం ఉంది. మామ్‌లో కాస్త ఆంధ్రతత్వం ఉందని తీర్మానించాడు. బుచ్చిబాబు ఊహించినతత్వం ఆంధ్రులలోను, మామ్‌లోను మాత్రమేకాక ఉదారబుద్ధులైన అన్నిదేశాల, అన్ని జాతుల జనులలోను కనిపిస్తుంది. తాను ఆంధ్రుడై మామ్ అభిమాని అయిన కారణంచేత మాత్రమే బుచ్చిబాబు ఇలా భావించాడని ఎవరికైనా తెలుస్తుంది. “తోటి మానవుణ్ణి కరుణించు, వీలైతే ప్రేమించు, దూషించకు, ద్వేషించకు, తీర్పుచేసి శిక్షించకు” అని మామ్ చెప్పిన మాటలు ఎందరెందరో చెప్పారు. “తోటి మానవుణ్ణి తీర్పు చేసి శిక్షించే అర్హత మానవుడికి లేదు” అని చెప్పడం మామ్ ప్రత్యేకతగా మనం భావిస్తే ఆ ప్రత్యేకత తెలుగువారిలో కూడా జాతిపరంగా ఉందనుకోవడం ఒక భ్రమ. ఇందులో బుచ్చిబాబు ఆంధ్రాభిమానమే కనిపిస్తుందిగానీ వాస్తవం మాత్రం లేదు. తెలుగువారికి, మామ్‌కి ఎంత దూరమో తెలుగు కథకు, మామ్ కథకు అంతదూరం. మామ్‌కున్న సాన్నిహిత్యమంతా బుచ్చిబాబుతోను, అతని కథలతోను మాత్రమే. “ఋజువు, ప్రమాణం

## స్పందన

**ఇందిర**



ప్రేమను గెలవడానికి
మనిషిగా ఓడాలా?!
పగతో రగిలిపోతే
మిగిలేది బూడిదేగా!

వక్రమార్కుని అవతారంలో
అవలక్షణాల
అష్టవక్రహస్తాల్లో
ఆసిడు–బ్లేడు
కొడవలి–గొడ్డలి
గ్యాసూ–కిరోసిను
కలుషిత రక్తం– కాగిన నూనె
కారుకూతలు
మారణాయుధాలు!
పిండదశలోనే దండయాత్రలు!

ఉలిక్కిపడి(న)
కంభకర్ణుడు
కళ్లనులుముకుని
తూతూ మంత్రంగా
తుపాకీ పేలుస్తాడు!
బతుకు జీవుడా అనుకుంటాడు!

బడిలో– గుడిలో
నడిబజారులో క్షణానికొక్కటిగా
అతివలపై జరిగే
అత్యాచారాలకు
నిమిషానికి 72సార్లు
నా గుండె
స్పందిస్తుంది!

## అదీ జీవితం!

**అవ్వారు శ్రీధర్ బాబు**



మనసు నిండా అసూయ
కళ్లనిండా కసి
వళ్ళు నిండా పొగరు
ఇదా జీవితం!
తలంపులో విషం
పనులలో స్వార్థం
మేలునపుడే మరవటం
ఇదా జీవితం!
జ్ఞానాన్ని వంచనకుపయోగిస్తూ.....
ఆప్యాయతకు తిలోదకాలిస్తూ
అధర్మాన్ని ఆచరిస్తూ....
ఇదా జీవితం!
కన్న వారికి కడగళ్లు మిగిలిస్తూ....
సంస్కృతులను కాలరాస్తూ
విలువలను వదిలేస్తూ
ఇదా జీవితం!
కాదు నేస్తం కాదు
ఇక ఆ వికృత రూపం చాలించు!
మంచిని మనిషివై పాలించు!!
తోటి వారిని ప్రేమించు
ఆపదన్న వారిని ఆధరించు
మనుషులలో
మహనీయుడవనిపించు
అదీ జీవితం!!

లేనిదే మనం దేన్నీ సత్యంగా స్వీకరించనక్కరలేదు. అన్న రసెల్ నిర్వచనాన్ని నేనిప్పుడు అంగీకరించలేకపోతున్నాను” అన్న బుచ్చిబాబు వాక్యాన్ని అనుసంధానించుకుని మనం ఈ సందర్భంలో సమాధానపడవలసి ఉంటుంది.

మామ్ కథలలాగే కథను గూర్చిన మామ్ అభిప్రాయమన్నా బుచ్చిబాబుకు గౌరవం ఉంది. శంకలు, అనుమానాలూ మిగలక సూటిగా మనస్సుకి హత్తుకుపోయి తృప్తి కలిగిస్తేనే కాని అది ఉత్తమకథ కాదన్నది మామ్ సిద్ధాంతం. ఆ సిద్ధాంతం బుచ్చిబాబుకు నచ్చింది. అందువల్లనే తనలో శంకలు, అనుమానాలూ మిగిల్చిన మామ్ రాసిన రెయిన్ కథను ఉత్తమ కథ అని బుచ్చిబాబు అంగీకరించలేదు. ఇది గొప్పకథ కాదంటూనే మామ్ కథలు తనకెందుకు నచ్చుతాయో బుచ్చిబాబు ఇలా వివరించేడు. “గొప్పకథ చదివాక ఒక జీవితరహస్యం మనకి తెలిసిపోయిందనిపిస్తుంది. మనం మారతాం. మన దృక్పథానికి మరోకొత్త పరిణామం సంక్రమించినట్లవుతుంది. మానసికంగా ఎదుగుతాం. జీవితసమరం సాగించేటందుకు మరోకొత్త పరికరం, మరో ఆయుధం తెచ్చుకుంటాం. కథ పరమావధి సంతోషపెట్టడం, వినోదం కలిగించడంమట్టుకే అంటాడు సోమర్ సెట్ మామ్. ఆయన కథలు యీ లక్ష్యాన్ని సాధిస్తాయి. వినోదం సాహితీ ప్రయోజనమైతే జీవితానుభవం పరమసత్యాన్ని తెలుసుకున్న మహదానందం. అంతకంటే ఉన్నతమైన ప్రయోజనాన్ని సాధించేటందుకు ఉపకరించింది గొప్పకథ. సంస్కృతీ సాహిత్యాల ప్రయోజనం పూరికే కబుర్లు చెప్పుకునేందుకు, వాదించేటందుకూ మటుకు కాదు. వాటి ప్రాబల్యం శీలంపై, ప్రవర్తనపై కనబడాలని మామ్ మరో సందర్భంలో అన్నదానితో నేనంగీకరిస్తాను. సర్వమానవవ్యవస్థ మనం గుప్పెట్లోకి లాక్కుని మనదిగా చేసుకోవడానికి ఉపకరించేదే ఉత్తమకళ అనుకుంటే అట్లాంటి కథలు కొన్ని వ్రాశాడు మామ్. “బుచ్చిబాబుకు, సోమర్ సెట్ మామ్‌కు గల సాహిత్యానుబంధాన్ని తెలియజేయడానికి పై విషయమంతా ఉదహరించవలసి వచ్చింది. కథకు సంబంధించిన వివిధ విషయాలలో వారిద్దరి మధ్య సాధర్మ్యం ఎలా ఉందో, భావసంవాదం ఏ విధంగా ఉందో ఇప్పుడు మనకు తెలిసింది. తనను ప్రభావితం చేసిన పుస్తకాలలో సోమర్‌సెట్ మామ్ రాసిన "The Summing up" ఒకటని బుచ్చిబాబు స్వయంగా చెప్పుకున్నాడు. అంత మాత్రం చేత బుచ్చిబాబు మామ్ కథలకు అంటుకట్టి తన కథలను తయారుచేసాడనడం అవివేకం. అనుకరణసాధ్యం కాని కథలను రాసిన బుచ్చిబాబు ఒకరిని అనుకరించడం ఊహకు అందే విషయం కాదు. నన్ను గురించి కథ వ్రాయవూ?, మేడమెట్లు! నాగాజుమేడ, మీరు–నేను–మాఘమ్, సౌందర్యాన్వేషణ, ఎల్లోరాలో ఏకాంత సేవ, అరకులోయలో కూలినశిఖరం, మరమేకులు–చీరమడతలు వంటి బుచ్చిబాబు గొప్ప కథలెన్నో ఇప్పటికీ మంచి విలువలు గల కథలుగా కాలపరీక్షకు నిలచి ఉన్నాయి. ఇందుకు కథా నిర్వచనం, నిర్మాణసూత్రాలు, తాత్త్విక స్పర్శ, ప్రయోజనం అనే ప్రముఖ అంశాలపట్ల ఇతర తెలుగు కథలకంటే బుచ్చిబాబు ప్రదర్శించిన విలక్షణవైఖరి కారణమని చెప్పాలి. ■

# మార్క్సిస్టు నిబద్ధత గల కవి ఆరుద్ర

- అల



ఈ నెల 4న ఆరుద్ర వర్ధంతి సందర్భంగా విజయనగరం సాహితీ స్రవంతి స్థానిక గురజాడ కేంద్ర గ్రంధాలయంలో సభ నిర్వహించింది. ఈ సభకు సంస్థ సభ్యులు, కృష్ణారావు అధ్యక్షత వహించారు. కాకినాడకు చెందిన డా॥ భరతలక్ష్మి 'ఆరుద్ర సాహిత్యంలో పాశ్చాత్య సాహిత్య ప్రభావాలు' అంశంపై మాట్లాడారు. తెలుగు సాహిత్యంలో అరుదైన ప్రతిభాశాలి ఆరుద్ర అని కొనియాడారు. ఆయన విస్తృత సాహిత్య అధ్యయనమే ఆయనను మార్క్సిస్టుగా మలిచిందన్నారు. టి.ఎస్. ఇలియట్, ఎజ్రాపేండ్ వంటి ఎందరో ఆంగ్ల, ఫ్రెంచి కవులు రోణంకి అప్పలస్వామి సాంగత్యం ఆరుద్ర సాహిత్యభిలాషకు సానపట్టి విలువైన వజ్రంగా మారడానికి దారి చూపాయన్నారు. నావికా దళంలో పని చేసిన సందర్భంలో నానా ఫెడ్రోవా రచించిన పేమలీ నవలలు ఆరుద్ర చదవడం జరిగింది. ఆ నవల ఆనాటి జపాన్ స్థితిగతుల్ని ఆయనకు తేటతెల్లం చేసింది. జేమ్స్ జాయిస్, దేవిడ్ గోస్కోయిన్‌లను అధ్యయనం చేశారన్నారు.

'కళ పోరాటం నుండి ఉద్భవిస్తుంది' అన్న క్రిస్టోఫర్ కాడ్వెల్ ఆరుద్ర సాహిత్యానికి అందునా ఆయన త్వమేవాహమ్‌కి అచ్చంగా అతుకుతుంది. ఇలియట్ రచించిన వేస్ట్‌కాండ్ నీతి భ్రష్టమైన సమాజానికి గొప్ప ప్రతీక అదే విధంగా త్వమేవాహంలోని ప్రతీకలు కూడా కాలానికి, సమాజానికి ప్రతీకలు. రచనా సంవిధానంలోనూ, ప్రతీకల స్వీకారంలోనూ ఆరుద్ర ఇలియట్‌ను అనుసరించారు. విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానాన్ని ప్రతీకలు ద్వారా దృశ్యీకరించారు. పైథాగ్రస్ సిద్ధాంతాన్ని కవిత్వంలో ఎలా ఎంత చక్కగా ఆవిష్కరించారో!

"చిన్న చిన్న చీమలు వగైరా/ అదుగు భుజం అనుకోండి బలవంతమైన సర్పం /గ్రేటా ఎట్ సట్రా/ అదుగు భుజం ఉత్పత్తి చేస్తే /ఆహారం మీద ఆధారపడ్డం వల్ల /లంబం అవదామరి? / ఈ భుజాల పరస్పర సంఘర్షణల ఫలితం/ ఈ భుజాల కర్ణం మీద చతురస్రం/ అవునా? సరి.".

ఆధునిక తెలుగు సాహిత్యంలో కవుల లక్షణాలున్న మొదటి గ్రంధంగా త్వమేవాహాన్ని చెప్పవచ్చన్నారు. గాయాలు, గేయాలు, సాహిత్యోపనిషత్, సినిమాలు, నలమ్మల పదాలు, ఇంటింటి పజ్యాలు, పైలా పచ్చీసు, ఏటికేడాది, అరబ్బీమరబ్బీలు శుద్ధ మధ్యక్కరలు, స్త్రీ పురాణం అన్నింటా అరుదైన ప్రయోగాలు కనిపిస్తాయని, ఆయన సాహిత్య మంతటా ఆయన వ్యక్తిత్వం స్ఫురిస్తుందన్నారు.

ఆ తరువాత కూడా డా॥ రామసూరి ఆరుద్ర సినీ సాహిత్యం గురించి ప్రసంగించారు. తెలుగు సినిమా ప్రపంచంలో సినీ జర్నలిస్టుగా, అసిస్టెంట్ డైరెక్టర్‌గా, పాటల రచయితగా, సంభాషణా రచయితగా ఆరుద్ర తెలుగు సినిమాకు ఒక గొప్ప మలుపు తెచ్చారన్నారు. ఆయన సుమారు 150 చిత్రాలకు సంభాషణలు రాశారని సుమారు 500 చిత్రాలకు పాటలు రాశారని చెప్పారు. 1950లో విడుదలైన బీదల పాట్లు సినిమాకు ఆరుద్ర తొలిసారి పాటలు రాసారని తెలిపారు. కొండగాలి తిరిగింది పేరుతో వి.ఎ.కె. రంగారావు తొలిసారిగా ఆరుద్ర పాటల సంకలనాన్ని తెచ్చారని ఆయన చెప్పారు. ఉయ్యాల జంపాల చిత్రంలోని కొండగాలి తిరిగింది/ గుండె ఊసులాడింది./ గోదావరి కెరటంలో కోరిక చెలరేగింది" అనే పాట ఆయనకు మంచి పేరు తెచ్చిందని, అందాల రాముడు సినిమాలో 'ఎదగడానికి ఎందుకురా తొందరా" పాట ఏలీల పాడెద అనే మురిపించే మువ్వలలోని పాట, అలాగే పవిత్రబంధంలోని 'గాంధి పుట్టిన దేశమా? ఆయన ప్రతిభకు తార్కాణాలని కొనియాడారు. తేలు కుడుతుంది, తీతువు తిడుతుంది, తోడేలు హింసిస్తుంది. మనిషి ఒక్కడే ఈ అన్నీ చేస్తాడని ఆరుద్ర భావించే వారని ఆయన అన్నారు. బాధ హృదయంలో అనుభవింపజేసినప్పుడే మంచిపాట పుడుతుంది. ఫ్రెంచికవులు జర్మన్ కవులు కవిత్వం వినిపించకూడదు, కనిపించాలని అంటారని ఆరుద్ర పాటల్లో ఆ లక్షణాలు అచ్చంగా కనిపిస్తాయని చెప్పారు. చర్చల ద్వారా సినిమాల్ని మెరుగు పరచవచ్చని ఆరుద్ర అభిప్రాయ పడ్డారని రామసూరి చెప్పారు. భారతీయ సంప్రదాయం, ఛందస్సు పాత్రల మౌళిక జీవితాల అధ్యయనం ఆయన ప్రతి పాటలోనూ ఉంటుందని అన్నారు. సంభాషణల్లో అశ్లీలత ప్రవేశించకుండా చేసి ప్రేక్షకుల అభిరుచి ఆరోగ్యకరంగా మలచవచ్చని ఆరుద్ర భావించేవారని చెప్పారు. ఆరుద్ర గేయాల్లో జానపద సంగీత ప్రభావం కనిపిస్తుందని ఆయన తెలిపారు.

తెలుగు వారి సంప్రదాయం ఆరుద్రకు తెలిసినంతగా ఆధునిక గేయ రచయితల్లో చాలా మందికి తెలియదని అందుకు ఉదాహరణకు "ముత్యమంతా పసుపు ముఖమంత ఛాయ" అన్న పాటను చెప్పొచ్చన్నారు.

కార్యక్రమం చివరిలో నిర్మలానంద 'కలాల కవాతు' అనువాద కవితా సంకలనాన్ని డా॥ చాగంటి తులసి ఆవిష్కరించారు. తమ ప్రసంగంలో ఆరుద్రకు తమ కుటుంబంతో గల అనుబంధాన్ని తెలిపారు. ప్రపంచ భాషల్లో ఆధునిక కవితా సంకలనాలు గాని, కావ్యాలు గాని కవులు యుక్త వయస్సులోనే రాసారని తెలిపారు. ఆరుద్ర తన యుక్త వయస్సులోనే త్వమేవాహం రాశారన్నారు. అనంతరం కవి అల 'కలాల కవాతు' పుస్తకాన్ని పరిచయం చేశారు. సభకు చీకటి దివాకర్ ఆహ్వానం పలకగా శ్రీమతి ఆదిలక్ష్మిగారు వందన సమర్పణ చేశారు. ■

# నల్లగొండ జిల్లాతో శ్రీశ్రీ ఆత్మీయ అనుబంధం

మేరెడ్డి యాదగిరి రెడ్డి



శ్రీశ్రీతో మేరెడ్డి యాదగిరి రెడ్డి, శివారెడ్డి తదితరులు

సృజనకు, చైతన్యానికి,పోరాటాలకు, నిజాంనిరంకుశ పాలనకు, దొరల, రజాకార్ల, బాంచన్‌దొరా, సంస్కృతికి ఎదురొడ్డి నిలిచి తెలంగాణా సాయుధ పోరాటానికి పుట్టినిల్లయిన నల్లగొండతో మహాకవి శ్రీశ్రీ కి ఆత్మీయ అనుబంధమేవుంది.

నల్లగొండకు శ్రీశ్రీ రెండుసార్లు వచ్చాడు. మొదటిది 1966లో శ్రీశ్రీకి జిల్లాపరిషత్ ప్రజల పౌరసన్మానం.రెండవసారి 1983లో జరిగిన జిల్లా రచయితల మహాసభల సందర్భంగా రావడం జరిగింది.

1966 లో నల్లగొండ జిల్లా పరిషత్ చైర్మన్‌గా కమ్యూనిస్టు పోరాటయోధుడు ఆరుట్ల లక్ష్మీనర్సింహారెడ్డి ఎంపిక గావడం జరిగింది.శ్రీశ్రీ మహాప్రస్థానం సాహితీపరులందరి నోళ్ళల్లో నానుతున్న రోజులవి. ఛైర్మన్ ఆరుట్ల లక్ష్మీనర్సింహారెడ్డి, ప్రముఖసాహితీ వేత్త కాంచనపల్లి చినవెంకటరామారావు ఇంకా అనేక మంది సాహితీ మిత్రులు సమాలోచనలు జరిపి శ్రీశ్రీని నల్లగొండకు రప్పించి పౌరసన్మానం చేయాలని నిర్ణయించారు.అంపశయ్య "నవీన్" గూడా అప్పట్లో నల్లగొండకాలేజీలో లెక్చరర్‌గా పనిచేసేవారు. కాంచనపల్లి, నవీన్, అనేక మంది సాహితీ మిత్రులు నల్లగొండ టౌన్ హాలులో శ్రీశ్రీ పేర సన్మాన కార్యక్రమం నిర్వహించారు.

1983 ఏప్రియల్,7,8,9 తేదీల్లో నల్లగొండ జిల్లా రచయితల మూడవ మహాసభలు జరిగాయి.ఈ మహాసభలకు శ్రీశ్రీ ని రప్పించడానికి కాంచనపల్లి చినవెంకటరామారావు అప్పటి నల్లగొండ ఆర్డీవో ప్రముఖరచయిత ఫణికుమార్ ముఖ్యకారకులు. అప్పటి కలెక్టర్ శర్మ గూడ ఈ మూడు రోజుల సభల నిర్వహణకు చేయూతనిచ్చారు.

టౌన్‌హాలులో జరిగిన ఈ మూడురోజుల జిల్లారచయితల సభలకు శ్రీశ్రీతోపాటు ఆంధ్రదేశంలోని ప్రముఖ రచయితలంతా హాజరయ్యారు. రావిశాస్త్రి, సోమసుందర్, అంపశయ్య నవీన్, అద్దేపల్లి రామమోహన్‌రావు, కె.శివారెడ్డి, గజ్జలమల్లారెడ్డి,రాంభట్ల కృష్ణమూర్తి రాంషా, చలసాని ప్రసాద్, ఆకెళ్ళ సూర్యనారాయణమూర్తి, సిరివెన్నెల సీతారామశాస్త్రి, ముదిగొండ వీరభద్రయ్య, యన్.గోపి లాంటి వారెందరో హాజరయ్యారు.

శ్రీశ్రీ ఉపన్యాసం వినడానికి వచ్చిన సాహిత్యాభిమానులతో నల్లగొండ టౌన్ హాలంతా నిండిపోయింది. లోపల చోటు చాలక వరండాలో నిల్చుని శ్రీశ్రీ ఉపన్యాసాలు విన్నారు.

మూడు రోజులు జరిగిన జిల్లా రచయితల మహాసభలలో శ్రీశ్రీ పాల్గొన్నారు.

ఇవి నల్లకొండలు కావు ఎర్రెర్రటికొండలన్నాడు. తెలంగాణా రైతాంగసాయుధ పోరాటానికి పుట్టినిల్లయిన నల్లగొండ సభలలో పాల్గొనడం సంతోషదాయకం అన్నారు. దొడ్డి కొమరయ్య అయిలమ్మ, బందగీ పోరాట యోధుల సాయుధ స్ఫూర్తిని స్మరించారు. ఇవి జిల్లా రచయితలమహాసభలు కావు. ప్రపంచ తెలుగు మహాసభలు అని అన్నారు.

శ్రీశ్రీ వారి సతీమణి సరోజనితో కలిసి ఈ సభలకు వచ్చారు. ఈ సభలలో వారి "పాడవోయిభారతీయుడా" పుస్తకాన్ని ఆవిష్కరించారు. ముఖ్యంగా టౌన్ హాల్ గోడలు 'మహాప్రస్థానం గేయాలు, శ్రీశ్రీ బొమ్మలతో అలంకరించబడ్డాయి. దాసి సుదర్శన్, పిట్ల రామచంద్రం, నాగార్జునరామ్మూర్తి, వేణుసంకోజు మున్నగువారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

నల్లగొండలో వున్న మూడురోజులు ఇటు టౌన్‌హాలులో అటు ఆయన బసచేసిన హోటల్‌లోనూ సందడేసందడి. ఎడతెగని సాహిత్య చర్చలు."పతితులారా ၊ భ్రష్టులారా၊బాధాసర్పద్రష్టులారా၊ దగాపడినతమ్ముల్లారా၊ ఏదవంకందేదవకండి ၊ మీ బాధలు మీగాథలు అవగాహననాకవుతాయి" అంటూ శ్రీశ్రీ నల్లగొండకు వచ్చిన సందర్భంగా చివరి రోజున కేతేపల్లి మండలం మారుమూల గ్రామం తుంగతుర్తిలో జరుగుచున్న పౌరహక్కుల సభలో పౌరహక్కుల ఉద్యమనేతగా ప్రసంగించారు.

శ్రీశ్రీ షష్టిపూర్తి కార్యక్రమానికి నల్లగొండ నుండి చాలామంది సాహిత్యాభిమానులు విశాఖ వెళ్లిరావడం జరిగింది. డా॥ బోయజంగయ్య 'వెలుతురు' కవితాసంపుటికి శ్రీశ్రీ ముందుమాట రాశారు. అదే విధంగా నాగార్జున యూనివర్సిటీలో వారి పేరుమీద ఏర్పాటు చేయబడిన మొట్టమొదటి స్మారక పురస్కారం బోయజంగయ్య 'ఎచ్చరిక' కథాసంకలనానికి లభించింది. శ్రీశ్రీ ఒకటి రెండు పుస్తకాలకు నల్లగొండ చిత్రకారుడు 'దాసి' సుదర్శన్ ముఖపత్రం వేయడం జరిగింది.

శ్రీశ్రీజూన్15, 1983న మరణించారు. శ్రీ.శ్రీ.పాల్గొన్న చివరి సాహితీ సమావేశాలు నల్లగొండ జిల్లా రచయితల మహాసభలు కావడం గమనార్హం. ■

## మహాకవిని ప్రభుత్వం విస్మరించడం బాధాకరం

మహాకవి శ్రీశ్రీ శతజయంతోత్సవాలను ప్రభుత్వం విస్మరించడం బాధాకరమని సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి అన్నారు. ప్రజల కోసం కవిత్వం రాసి, భాషకు, భావానికి మధ్యనున్న సంబంధానికి సరికొత్త అర్థం చెప్పిన శ్రీశ్రీని అధికారభాషా సంఘంగానీ, రాష్ట్ర సాంస్కృతిక మండలిగానీ పట్టించుకోకపోవడం మరింత విస్మయం కలిగిస్తోందన్నారు. తమిళులకు సుబ్రహ్మణ్యభారతిలా తెలుగువారి జాతీయకవిగా శ్రీశ్రీని గుర్తించాల్సిన అవసరముందని అన్నారు. సిపియం విశాఖజిల్లా కార్యదర్శి సిహెచ్. నర్సింగరావు అధ్యక్షతన జూన్ 22న విశాఖపట్నంలోని సిరిపురంలో గల ఉడా బాలల థియేటర్లో జరిగిన శ్రీశ్రీ శతజయంతోత్సవ సభలో తెలకపల్లి రవి ప్రసంగించారు. శ్రీశ్రీ అనే రెండక్షరాలు తెలుగు సాహిత్యంలో మహత్తర యుగానికి నాంది పలికాయని, శ్రమైక జీవన సౌందర్యాన్ని కష్టజీవుల్లో దర్శించి, కార్మికలోకపు కళ్యాణానికి అంకితమిచ్చిన మహాయోధుడని అభివర్ణించారు. భావానికి తగ్గట్టు భాషను సమకూర్చుకోవడం శ్రీశ్రీ కవిత్వానికి మరింత సార్థకతనిచ్చిందని అన్నారు. ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కన్పించని బతుకు వెతలకు అక్షర రూప మిచ్చిన శ్రీశ్రీ మహాప్రస్థానంలో అడుగడుగునా మాతృస్పర్శ కనిపిస్తోందని, అది మరింత సజీవతను సంతరించిపెట్టిందని అన్నారు. ప్రస్తుత సంక్షోభ సమయంలో శ్రీశ్రీ కవిత్వం ఆవశ్యకత మరింత పెరిగిందని అన్నారు. ఉత్తరాంధ్ర శాసన మండలి సభ్యులు ఎంవిఎస్ శర్మ మాట్లాడుతూ శ్రీశ్రీ శతజయంతోత్సవాలను ప్రభుత్వమే నిర్వహించాలని డిమాండ్ చేశారు. తెలకపల్లి రవి రాసిన 'శ్రీశ్రీ సాహిత్యం-సమకాలీనత' మూడో ముద్రణను ప్రముఖ కవి, విమర్శకుడు రామతీర్థ ఆవిష్కరించి, వ్యాసాలపై మాట్లాడారు.

## కరీంనగర్‌లో శ్రీశ్రీ శతజయంతి

శ్రీశ్రీ శతజయంతి ఉత్సవాల సంవత్సరాన, ప్రతీ సందర్భాన్నీ అతని జ్ఞాపిక చిహ్నంగా మలచుకోవాలని వక్తలు పేర్కొన్నారు. శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా జూన్ 14న సాహితీ స్రవంతి కరీంనగర్ జిల్లా శాఖ, కుల వివక్ష వ్యతిరేక పోరాట సంఘం కరీంనగర్ సంయుక్త ఆధ్వర్యంలో సమావేశం జరిగింది. స్థానిక ఫిలింభవన్‌లో జరిగిన ఈ సమావేశానికి సాహితీ స్రవంతి కన్వీనర్ వేణుశ్రీ అధ్యక్షత వహించారు. శ్రీశ్రీ కవిత్వం గురించి సాహితీ లోకపు నాలుకలపై నర్తించిందని తెలిపారు. అతని సినిమా పాటల్లో కూడా ప్రబోధాత్మకత, శిల్ప సౌరభం తొణికిసలాడిందని పేర్కొన్నారు. మరో వక్త డా॥బి.వి.ఎస్. స్వామి శ్రీశ్రీ కథల గురించి మాట్లాడినారు. కథారచనలో కథలల్లి వినూత్న శైలిని కథా రంగానికి అందించాడని అభిప్రాయపడ్డారు. కె.వి.పి.ఎస్ జిల్లా ఉపాధ్యక్షులు బి. సారంగపాణి, శ్రీశ్రీతో తనకు గల పరిచయాలను అందరితో పంచుకున్నారు. మహాప్రస్థాన గీతాలలో తను ఏ విధంగా ఉత్తేజం పొందాడో తెలిపారు. సభకు ప్రసాద్ వందన సమర్పణ చేశారు. ఈ సభలో కథా రచయితలు పంజాల జగన్నాథం. దామోదర్ రావు,, గాజుల నాగభూషణం, అనంతాచారి, గోపాల్, కులవివక్ష వ్యతిరేక పోరాట సంఘం కార్యకర్తలు తదితరులు పాల్గొన్నారు.

## ఘనంగా జరిగిన మహాకవి శ్రీశ్రీ సాహిత్య సభ




భద్రాచలం డివిజన్ శాఖ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో స్థానిక లిటిల్ ఫ్లవర్స్ విద్యా సంస్థల ప్రాంగణంలో జూన్ 15న సాయంత్రం ఆరు గంటలకు మహాకవి శ్రీశ్రీ సాహిత్య సంస్మరణ సభ ఘనంగా జరిగింది. మహాకవి శ్రీశ్రీ శతజయంత్యుత్సవ సంవత్సర సందర్భంగా సాహితీ స్రవంతి తల పెట్టిన శ్రీశ్రీ సాహిత్య సదస్సులలో మొదటగా శ్రీశ్రీ వర్ధంతిని జరుపగా ఈ సభకు అతిధిగా శ్రీ మాగంటి సూర్యం విచ్చేసారు. సాహితీ స్రవంతి అధ్యక్షులు మాల్యశ్రీ సమన్వయ కర్తగా విచ్చేశారు. సభకు ప్రధాన వక్త, గౌరవ అతిధిగా శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటి అసిస్టెంట్ ప్రొఫెసర్ డా॥ మేడిపల్లి రవికుమార్ విచ్చేసి, సాహితీ స్రవంతి నిర్వహించే శతజయంత్యుత్సవాల్లో ప్రథమ సభకు ప్రధానవక్తగా నన్ను భద్రాచలంకి ఆహ్వానించినందుకు ఎంతో గర్వపడుతున్నానన్నారు. శ్రీశ్రీ స్ఫూర్తి మనందరిలోనూ వున్నది. మనమంతా శ్రీశ్రీ వారసులమేనన్నారు. ఏ కవి అయితే – సమాజంలో క్రింది స్థాయి జనజీవనంలోకి తొంగి చూసి మమేకమై కవిత్వం వ్రాస్తాడో అతడు శాశ్వతంగా కవిగా మనగల్గుతాడు. అలా మనగల్గిన తొలి మహాకవి శ్రీశ్రీ అన్నారు. నేటి సమాజానికి క్రింది స్థాయి గురించి ఆలోచించే అవసరం ఎంతైనా ఉందన్నారు.

ప్రధాన కార్యదర్శి – తాతోలు దుర్గాచారి శ్రీశ్రీ గీతాన్ని ప్రారంభగీతంగా పాడగా,వ ఈధుల రాంబాబు స్వాగతవచనాలతో అతిధులను ఆహ్వానించారు. మహాకవి శ్రీశ్రీ చిత్ర పటాన్ని మాగంటి సూర్యం, మేడిపల్లి రవికుమార్ పూలమాలలతో అలంకరించి నివాళులర్పించారు.

అనంతరం సాహితీ స్రవంతి భద్రాచలం శాఖ గౌరవ అతిధి మేడిపల్లి రవికుమార్‌ని దుశ్శాలువాతో, మెమెంటోతో సత్కరించింది.

ఈ కార్యక్రమాన్ని తిరుపాలు, ఆర్ఎస్‌రావు, రామరాజులు నిర్వహించగా జిల్లా వ్యాప్తంగా వచ్చిన – కవులు– జాతశ్రీ, రూత్‌మేరి, జ్వలిత, కాసర్ల రంగారావు, ఎస్, కాంతారావు, టి.వి. రత్నం, డా॥ కావూరి పాపయ్య శాస్త్రి, శంకర్ సింగ్, శ్రీ దిరాల వెంకటాచారి, తులసీ దాసు, ఐ.వి. (ప్రజానాట్య మండలి) జీవా, జి. గోపాలకృష్ణ సర్వోత్తమ్, రామకృష్ణ ప్రసాద రాజు, శ్రీనివాసరెడ్డి, అమ్మిన శ్రీనివాసరాజు, స్వామి దుర్గా ప్రసాద్, అనూష, నీహారిక, కృష్ణకుమార్, అలేఖ్య తదితరులు పాల్గొన్నారు. తాతోలుదుర్గాచారి వందనసమర్పణతో సభ ముగిసింది.

## కర్నూలులో శ్రీశ్రీ వర్ధంతి



శ్రీశ్రీ మరో ప్రపంచ మార్గదర్శకుడని సాహితీ స్రవంతి కర్నూలు జిల్లా కన్వీనర్ రఘుబాబు అన్నారు. కర్నూలు పట్టణంలోని కర్షక భవన్‌లో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో శ్రీశ్రీ వర్ధంతి సభ జరిగింది. ఈ సభకు నేషనల్ తెలుగు కళాశాల ప్రిన్సిపాల్ నిస్సార్ అహ్మద్ అధ్యక్షత వహించాడు. శ్రీశ్రీ చిత్రపటానికి ప్రముఖ కవి గిరిధర్‌రావు పూలమాల వేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమంలో రఘుబాబు మాట్లాడుతూ 'తెలుగు సాహిత్యం ఉన్నంతకాలం శ్రీశ్రీ పీడితుల హృదయాల్లో చిరంజీవిగా ఉంటారన్నారు. బాల్యం నుంచి వృద్ధుల వరకు అనేక కోణాల నుండి కవితలు రాశారన్నారు. సామాజిక స్పృహతో మరో ప్రపంచ నిర్మాణానికి తన సర్వశక్తినీ ధారపోశారన్నారు. నేను సైతం అని యువతకు విప్లవ మార్గాన్ని చూపారని, కాదేదీ కవితకనర్హం అంటూ అగ్గిపుల్ల, కుక్కపిల్ల, సబ్బుబిళ్ళ లాంటి పదాలతో అందరూ కవితలు రాయొచ్చని శ్రీశ్రీ తెలుగు సాహిత్యలోకానికి చాటారన్నారు. ప్రముఖ కథారచయిత ఇనయతుల్లా మాట్లాడుతూ శ్రీశ్రీ 1910 నుంచి 1983 చివరి వరకూ మహాప్రస్థానాన్ని కొనసాగించారన్నారు. రామాయణం, భగవద్గీత, ఖురాన్‌లను ఎలా స్మరించుకుంటున్నామో అలాగే ఈనాడు శ్రీశ్రీ కవితల్ని వల్లె వేస్తున్నామన్నారు. కవిత్వానికి ఛందస్సు, అలంకారాలు ముఖ్యం కాదని, పేదల హృదయాలను కదిలించే విధంగా శ్రీశ్రీ కవితలు ఉంటాయన్నారు. అందుకే భావితరాలకు ఆదర్శపురుషుడు కాగలిగారన్నారు. ఒక శ్రీ 20 శతాబ్దమైతే ఇంకొక శ్రీ అన్ని దశాబ్దాలకూ వర్తిస్తుందని అన్నారు. శ్రీశ్రీ నా హృదయంలో నిదురించే చెలి ఎవరంటే విప్లవమే అన్నారని తెలిపారు. వ్యంగ్యాస్త్రాలతో అనేక సభల్లో అప్పటికప్పుడు కవితా ఛలోక్తుల్ని విసిరేవాడని అన్నారు. రచయిత శుభాకరరావు మాట్లాడుతూ కవులెందరో వున్నా శ్రీశ్రీ వంటి కవులు లేరని అన్నారు. తెలుగు లెక్చరర్ బాలశౌరి మాట్లాడుతూ శ్రీశ్రీ సినిమాలకు పాటలు రాసి ప్రజలను చైతన్యవంతం చేసేందుకు పాటుపడ్డారన్నారు. కర్నూలులో శ్రీశ్రీ విగ్రహాన్ని, గ్రంధాలయాన్ని ఏర్పాటుచేయాలని సభ డిమాండ్ చేసింది. సభలో మునిస్వామి పాడిన పాట ఆకట్టుకుంది.

## ఆధునిక సాహిత్య యుగకర్త శ్రీశ్రీ



శ్రీశ్రీ శతజయంతిని పురస్కరించుకొని పాలమూరు పట్టణంలో పాలమూరు సాహితీ ఆధ్వర్యంలో శ్రీశ్రీ శతజయంతి సభను నిర్వహించింది. మే 24న రెవెన్యూ భవన్‌లో జరిగిన ఈ సమావేశంలో ప్రముఖ రచయిత, కవి పెంటమరాజు నరసింగరావు మాట్లాడుతూ తెలుగు సాహిత్యంలో ఒక ఝుంఝూ మారుతంలా ఎగిసిపడే కెరటంలా దూసుకొచ్చిన శ్రీశ్రీ తెలుగు సాహిత్యంలో ఒక యుగకర్తగా నిలిచి పోయారన్నారు. తెలుగు పదాలపై శ్రీశ్రీ అదుపు సాధించాడని, ఆ పొందికే ఆయనను మహాకవి చేసిందన్నారు. అనంతమైన భావాలను అల్పాక్షరాలలో చెప్పడం శ్రీశ్రీకే సాధ్యమన్నారు. మరో వక్త జనజ్వాల మాట్లాడుతూ శ్రీశ్రీ జీవితంలో అనేక ఆటుపోట్లను ఎదుర్కొన్నారన్నారు. తన జీవితంలో జరిగిన సంఘర్షణలు, సంఘటనలు, కుటుంబ నేపథ్యమూ ఆయనను మహాప్రస్థానాన్ని రచించేలా చేసిందన్నారు. పల్లా విజయ్‌కుమార్ ప్రారంభోపన్యాసం చేస్తూ శ్రీశ్రీ సంప్రదాయక కవిగా, అభ్యుదయ కవిగా దర్శనమిస్తాడన్నారు. నేటి సమాజానికి ఏది అవసరమో దానిని శ్రీశ్రీ తన రచనల ద్వారా తెలియజెప్పారన్నారు. సభాధ్యక్షులు కె. లక్ష్మణ్‌గౌడ్ మాట్లాడుతూ శ్రీశ్రీ స్ఫూర్తి ద్వారానే తెలుగు సాహిత్యంలో అనేక మంది కవులుగా రాణిస్తున్నారన్నారు. శ్రీశ్రీ జీవితం తెరిచిన పుస్తకమన్నారు. ముఖ్య అతిథి, డిప్యూటి కలెక్టర్ ఎం. బాలయ్య మాట్లాడుతూ శ్రీశ్రీ సమాజానికనుగుణంగా రచనలు చేశారన్నారు. విశిష్ట అతిథి పోతుల రాంగోపాల్ మాట్లాడుతూ శ్రీశ్రీ లేని తెలుగు సాహిత్యాన్ని ఎవరూ ఊహించలేమన్నారు. తనదైన శైలిలో సాహిత్యాన్ని సృజయించిన శ్రీశ్రీ ఎప్పుడూ మహాకవిగా, గొప్ప కవిగా మిగిలిపోతారన్నారు. పాలమూరు సాహితీ అధ్యక్షుడు భీంపల్లి శ్రీకాంత్ మాట్లాడుతూ శ్రీశ్రీ కవిగా, కథారచయితగా, నాటక కర్తగా, పద్యకవిగా బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరు గడించారన్నారు. అనంతరం నేటి కవిత– 2008 ను,. సి.డి.లను వక్తలు ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో చంచల రవికుమార్, దేవదానం, సత్తూరు రాములుగౌడ్, బెక్కం జనార్ధన్ తదితరులు పాల్గొన్నారు.

## ఆదోనిలో శ్రీశ్రీ వర్ధంతి




కర్నూలు జిల్లా ఆదోని పట్టణంలో సాహితీస్రవంతి కన్వీనింగ్ కమిటీ ఆధ్వర్యంలో మహాకవి జూన్ 15న శ్రీశ్రీ వర్ధంతి సభ జరిగింది. పట్టణంలోని ఈవా ఇనిస్టిట్యూట్ ఆఫ్ స్పోకెన్ ఇంగ్లీషు కార్యాలయం వద్ద ఈ సభతో పాటు శ్రీశ్రీ ఫోటో ఎగ్జిబిషన్ ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిధులుగా కథా రచయిత వియోగి, ఆదోని ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల విశ్రాంత అధ్యాపకులు ఎ.ఆర్.వి. సుబ్బారెడ్డి హాజరై ప్రసంగించారు. సభాధ్యక్షులుగా సాహితీస్రవంతి ఆదోని సభ్యులు ప్రేమ్‌కుమార్ వ్యవహరించగా సభను భాషాపండితులు బసప్ప నిర్వహించారు. శ్రీశ్రీ చిత్రపటానికి పూలమాల వేసి నివాళి అర్పించిన అనంతరం వియోగి మాట్లాడుతూ శ్రీశ్రీ తెలుగు సాహిత్యంలో ధృవతారగా నిలిచిపోతారని, శ్రీశ్రీ మహాప్రస్థానం నేటి ఆధునిక సమాజానికి సైతం స్ఫూర్తిదాయకమని అన్నారు. ఎ.ఆర్.వి. సుబ్బారెడ్డి మాట్లాడుతూ శ్రీశ్రీ సాహిత్యంలో సామాజిక ప్రయోజనం ఉందని, శ్రీశ్రీ వర్గరహిత సమాజం స్వర్గంతో సమానమని భావించాడన్నారు. శ్రీశ్రీ సాహిత్యం చదివిన ప్రతి మానవునిలో మార్పుబీజం ఉందనే విషయం తెలిసిందని అన్నారు. డా॥ సంజన్న మాట్లాడుతూ సాహిత్యంలో శ్రీశ్రీ సాహిత్యం కొత్త ఒరవడి చూపించిందన్నారు. సాహితీస్రవంతి సభ్యులు కెంగార మోహన్ మాట్లాడుతూ పేదప్రజలే ఊపిరిగా అక్రమాలు, అన్యాయాలు, దోపిడీలు తన శత్రువులుగా భావించి శ్రీశ్రీ సాహితీ వ్యవసాయం చేశాడని అన్నారు. కల్పనా ప్రపంచంలో నుండి కవిత్వాన్ని వాస్తవ ప్రపంచంలోకి మళ్ళించిన వ్యక్తి శ్రీశ్రీ మాత్రమే అన్నారు. ప్రపంచం గర్వించదగిన కవిని మన ప్రభుత్వాలు విస్మరించడం శోచనీయమన్నారు.

## రచయిత శుభాకరరావుకు 'చినుకు' ప్రథమ బహుమతి



జిల్లా అమరజ్యోతుల చరిత్రలను అపూర్వంగా గ్రంథస్థం చేసి ప్రశంసలు పొందిన కర్నూలుకు చెందిన జి. శుభాకరరావుకు సాహిత్య మాస పత్రిక 'చినుకు' నిర్వహించిన 'సాహితీ సృజన' పోటీలో ప్రథమ బహుమతి లభించింది. డా॥ అద్దేపల్లి రామ్మోహన్ రావు ప్రసిద్ధ కవితా సంపుటి 'పొగచూరిన ఆకాశం' పుస్తకంపై విశ్లేషణాత్మకమైన సమీక్ష రాసినందుకు ఆయనకు బహుమతి లభించిందని చెప్పారు. విజయవాడలో చంద్ర రాజేశ్వరరావు గ్రంథాలయంలో జరిగిన బహుమతి ప్రధానోత్సవ సభలో శుభాకరరావు బహుమతి అందుకున్నారు.

## శేషేంద్ర ద్వితీయ వర్ధంతి



మే 29న జరిగిన శేషేంద్ర శర్మ ద్వితీయ వర్ధంతి సభకు సాహిత్య ప్రముఖులందరూ హాజరై ఆయనకు ఘనంగా నివాళులు అర్పించారు. శేషేంద్ర చిత్రపరానికి పూలమాలవేసి, జ్యోతి ప్రజ్వలనం చేసి, ఆచార్య సి. నారాయణ రెడ్డిగారు నివాళి సభకు నేతృత్వం వహించారు. గుంటూరు శేషేంద్ర శర్మ మెమోరియల్ ట్రస్ట్ తరుపున శేషేంద్ర కుమారుడు సాత్యకి ప్రచురించిన కవితా సంపుటం (పక్షులు పద్యకావ్యం. సముద్రం నా పేరు వచనా కవితా సంకలనం, ఈ నగరం జాబిల్లి, గజల్ గీతి కావ్యం)ను ఆయన ఆవిష్కరించి, ప్రసంగిస్తూ శ్రీనాధుడి నుంచి విశ్వనాధవారి వరకూ పద్య కవులలో శేషేంద్ర ఒకరని వచన కవితలో అగ్రగణ్యుడని వ్యాఖ్యానించారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖకు చెందిన ఆచార్య ననుమాస స్వామికి దుశ్శాలువా కప్పి కిన్నెరా ఆర్ట్స్ వారి శేషేంద్ర స్మారక జ్ఞాపికను, శేషేంద్ర ట్రస్టు తరపున తొలి శేషేంద్ర స్మారక పురస్కారం, మరో జ్ఞాపిక, కూ. 1116/- ను అందజేసి సత్కరించారు. సభకు అధ్యక్షత వహించిన ఆచార్య ఎన్. గోపీ ఆధునిక కవులలో శేషేంద్రది శిఖరాయమానమైన వ్యక్తిత్వమని అభివర్ణించారు. శేషేంద్ర సామగ్ర సాహిత్య వక్తిత్వాన్ని ఆచార్య ననుమాస స్వామి తన స్మారకోపన్యాసంలో సోదాహరణంగా విశ్లేషించారు. హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ శరత్ జ్యోత్స్నా రాణి, శేషేంద్ర శర్మ కవితా సంపుటాన్ని సమీక్షిస్తూ శేషేంద్ర కవిత్వ తత్వాన్ని, సిద్ధాంతాన్ని ఆలోచనా స్ఫోరకంగా విశదీకరించారు. ముఖ్య అతిధిగా పాల్గొన్న ఆచార్య ముక్తేవి భారతి శేషేంద్ర జయంతి, వర్ధంతులకు అతీతుడైన సాహితీ మూర్తుల కోవకు చెందిన వాడని, గురజాడ, శ్రీశ్రీ, విశ్వనాధలా నిత్యం జనజీవనంలో మిళితమైపోయి ఉండే కవియని తన ప్రసంగంలో వెలిబుచ్చారు. శేషేంద్ర వరసవేది ఆల్కెమిని కరతలామలకం చేసుకున్న కవియని స్పృశించిన ప్రతి వస్తువును కవిత్వంగా మార్చివేస్తాడని డాక్టర్ రావూరి భరద్వాజ అన్నారు.

నగ్నముని, ఆచార్య చేకూరి రామారావు 'కాకరాల, రంగస్థల ప్రముఖులైన చాట్ల శ్రీరాములు, అక్కినేని నాటక పరిషత్ తరపున దీక్షిత్, రంగస్థల నటుడు దుగ్గిరాల సోమేశ్వరరావు, ప్రముఖ సినీ దర్శకుడు కె.బి. తిలక్, మిమిక్రీ పితామహుడు, నేరెళ్ళ వేణుమాధవ్ తదితర సాహిత్య కళారంగాలు ప్రముఖులు పాల్గొన్నారు. కిన్నెర ఆర్ట్స్ తరపున సాత్యకి వందన సమర్పణ చేశారు. కిన్నెర రఘురాం, గానసభ దీక్షితులు తదితరులు సభలో పాల్గొన్నారు.

## 'విమలాశాంతి' సాహిత్య పురస్కారం కోసం రచనలకు ఆహ్వానం

2009వ సంవత్సరం 'విమలాశాంతి' సాహిత్య పురస్కారాన్ని రచయితలకు అందజేయడానికి జాతీయ స్థాయిలో ఉత్తమ రచనల్ని ఆహ్వానిస్తున్నాం. కధకొకటీ కవితకొకటీ, రెండుగా ఇస్తున్న ఈ సాహిత్య పురస్కారాలను ఈ సంవత్సరం కథకు మాత్రమే పరిమితం చేస్తున్నాం. ఇప్పటి నుండి ఈ పురస్కారాన్ని ఒక యేడు కథాసంపుటికి ఒక యేడు కవితా సంపుటికి ఇవ్వాలని ట్రస్టు నిర్ణయించింది. ఈ నిర్ణయాన్ని సహృదయ సాహితీ మిత్రులు మన్నిస్తారని ఆశిస్తున్నాం. నిరుటి మాదిరే ఈ సాహిత్య పురస్కారాన్ని "శాంతి రజనీకాంత్ స్మారక అవార్డు" గా ఇవ్వబోతున్నాం.

ఎప్పటి మాదిరిగానే ఇతోధికంగా కథారచయితలు మా అభ్యర్ధనను మన్నించి తమ తమ కథా సంపుటాలను పంపి మా ప్రయత్నాన్ని ప్రోత్సహించాలని సవినయంగా కోరుతున్నాం. ఈ సంవత్సరం నుండి పురస్కారం కింద రూ. 15,000/-లు నగదును, జ్ఞాపికను అందజేసి పురస్కార గ్రహీతను సముచిత రీతితో సత్కరిస్తామని విన్నవిస్తున్నాం.

**నిబంధనలు:**

-రచనలు సమకాలీన సామాజిక జీవితాన్ని చిత్రించినవై వుండాలి. ప్రజాస్వామ్య ఫలితాలు అందక అన్ని విధాల బాధలకు గురవుతున్న ప్రజల జీవన విధానాలకు ప్రతిబింబించిన రచనలకు ప్రాధాన్యత వుంటుంది.

– జనవరి 2007 నుండి జూన్ 2009 మధ్య కాలంలో ప్రచురించిన పుస్తకాలు మాత్రమే పరిశీలనకు స్వీకరించబడతాయి.

-లఘురచనలు, గల్పికలు, 'కాలమ్'లు కథల పోటీకి స్వీకరించబడవు.

– రచయితలు తమ తమ కథా సంపుటాలను 15.7.09 తేదీలోగా యస్వీ ప్రసాద్, కథారచయిత డి.నెం. 28/4/271, విజయనగర్ కాలనీ, అనంతపురం – 5151 007 అనే చిరునామాకు పంపాలి.

పరిశీలన కోసం పంపే కథా సంపుటాలను నాలుగు కాపీల వంతున పంపాలి.

పురస్కారం కోసం వచ్చే రచనలను ప్రముఖులయిన స్థానిక కథా రచయితల ప్రాథమిక పరిశీలన తర్వాత, రాష్ట్రంలోని మూడు ప్రాంతాలకు చెందిన ముగ్గురు న్యాయ నిర్ణేతలకు పంపడం జరుగుతుంది. న్యాయ నిర్ణేతల నిర్ణయ ప్రాధాన్యతను బట్టి ఎంపిక వుంటుంది. ఇందులో "విమలా శాంతి సాహిత్య సాంఘిక సేవా ట్రస్టు" ఏ మాత్రం జోక్యం చేసుకోదని తెలియజేస్తున్నాం.

ఎంపికయిన కథాసంపుటికి 2009 సెప్టెంబర్ నెలలో జరిగే పురస్కారోత్సవ సభలో అవార్డు ప్రధానం చేస్తాం.

**- డా. శాంతినారాయణ**



విజయవాడలో చినుకు పత్రిక నిర్వహించిన సాహితీ సృజన పోటీలో బహుమతి పొందిన కోపూరి పుష్పాదేవిని సత్కరిస్తున్న ప్రముఖ కవి డా. అద్దేపల్లి మోహనరావు, డా.జి.వి. పూర్ణచంద్ తదితరులు



సాహితీవేత్త ద్వానా శాస్త్రిని 62వ జన్మదినోత్సవం సందర్భంగా సత్కరిస్తున్న డా.సి. నారాయణరెడ్డి చిత్రంలో ఉన్నవారు యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, మండలి బుద్ధప్రసాద్, కె. శివారెడ్డి ప్రభృతులు

## "తెలంగాణా పోరాట నవలల్లో స్త్రీ" ఆవిష్కరణ



ప్రముఖ రచయిత్రి, కవయిత్రి డా॥ అదువాల సుజాతగారి పరిశోధనా గ్రంధాలు "తెలంగాణా పోరాట నవలల్లో స్త్రీ" "డా॥ పి. యశోధారెడ్డి కథలు సమగ్ర పరిశీలన' పుస్తకాలు కరీంనగర్‌లో తెలంగాణా రచయితలు వేదిక కరీంనగర్ జిల్లాశాఖ అధ్యక్షతన ఇటీవల ఆవిష్కరింపబడినది. చిత్రంలో వరుసగా డా॥ బి.వి.ఎన్ స్వామి గారు డా॥ నలిమెల భాస్కర్ గారు దాస్యం సేనాధిపతి గారు, సంకేపల్లి నాగేంద్రశర్మ (తెరవే జిల్లా అధ్యక్షుడు) గారు, శ్రీ దాసరి మనోహర్ రెడ్డిగారు రచయిత్రి డా॥ అదువాల సుజాత, తెరవే రాష్ట్ర అధ్యక్షుడు జూకంటి జగన్నాధం గారు డా॥ గంగ్ర లక్ష్మణ్‌రావు గారు పద్మశాలి జిల్లా అధ్యక్షులు మెతుకు సత్యంగారు, అన్నవరం దేవేందర్ గారు ఉన్నారు.



కొవ్వలి సాహితీ పురస్కారాన్ని ప్రముఖ రచయిత సలీంకు ప్రధానం చేస్తున్న డా.సి.నారాయణరెడ్డి. చిత్రంలో ఉన్నవారు కొవ్వలి కుమారులు, ద్వానాశాస్త్రి, కిన్నెర రఘురాం, కళావేంకట దీక్షితులు.



మే 29న హైదరాబాద్‌లోని త్యాగరాయ గానసభలో గుంటూరు శేషేంద్ర స్మారక ప్రారంభ అవార్డుతో సీనియర్ కవి డా. నుమాసస్వామిని సత్కరిస్తున్న ప్రముఖ కవి సినారె. చిత్రంలో కళాదీక్షితులు, డా. గోపి, రావూరి భరద్వాజ, సాత్యకి ఉన్నారు.

## వై. శ్రీరాములు కవిత్వానికి పురస్కారం



[illegible] శ్రీ వై శ్రీరాములు గారి "మూడు ఎడారులు ఏడు సముద్రాలు ఒకే ఒక్క అనంతపురం" అన్న కవితా సంపుటికి సాహితీమిత్రులు మచిలీపట్నం వారు నిర్వహించిన శ్రీ కంఠంనేని బాబు రాజేంద్రప్రసాద్ స్మారక పురస్కారం లభించింది. అనంతపురం జిల్లా కరువు నుంచి అంతర్జాతీయ సమస్యల వరకు అన్ని విషయాలని కవిత్వ తత్వంతో ఆవిష్కరించిన ఈ కవితా సంపుటి రూ. 2000/- నగదు బహుమతితో పాటు పురస్కారానికి ఎన్నికయిందని న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించిన సాహితీవేత్తకవి విమర్శకులు డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ డా॥ రావి రంగారావు మరియు "విజ్ఞాన సుధ" మాసపత్రిక సంపాదకులు శ్రీ పాలెపు బాబూరావు గారు ఒక ప్రకటనలో తెలియజేశారు.



ద్వానాశాస్త్రి సంపాదకత్వంలో వెలువడిన 'శతాధిక కవుల నానీలు' సంకలనాన్ని ఆవిష్కరిస్తున్న డా.సి. నారాయణరెడ్డి, చిత్రంలో ఆచార్య ఎన్. గోపి, డా.పి. మధుసూదన్‌రావు, ఆచార్య శరత్‌జ్యోత్స్నారాణి, విశాలాంధ్ర రాజేశ్వరరావు తదితరులు.

## జాతీయస్థాయి శ్రీశ్రీ సాహిత్య అవార్డుకి ఎంపికయిన మోపిదేవి రాధాకృష్ణ కవిత



యుగకవి శ్రీశ్రీ శజయంతోత్సవాల సందర్భంగా . ..మో వెంకటేశ సపరివార మాసపత్రిక సాహిత్యానికి పెద్దపీరవేస్తూ రచనల పోటీ నిర్వహించింది. పోటికి రాష్ట్రం నుంచే కాకుండా 12 రాష్ట్రాల నుండి మొత్తం 316 మంది ఉత్సాహంగా రచనలు పంపారు. వాటిలోంచి శ్రీ మోపిదేవి రాధాకృష్ణ, హైదరాబాద్ రచించిన 'అక్షరాలు' కవితను ఉత్తమ కవితారచనగా ఎనిమిది మంది అవార్డు కమిటీ ఎంపిక చేశారు. ప్రతిష్టాత్మక జాతీయ శ్రీశ్రీ సాహిత్య పురస్కారంతో పాటు రూ. 5000ల నగదు సత్కారాన్ని శ్రీ మోపిదేవి రాధాకృష్ణ గారు ఒంగోలు.... వేమూరి కళ్యాణ మండపం లో జరిగే ఉత్సవాలలో అందుకుంటారని నిర్వాహకులు ఒక ప్రకటనలో తెలిపారు.



ఇందూరు భారతి, నిజామాబాద్ జిల్లా సాహితీ సంస్థల సమాఖ్య ద్వారా రచయిత అంబల్ల జనార్ధన్ గారికి మే 07 న ఆత్రేయ పురస్కార దృశ్యం. చిత్రంలో ఈర్ల రాజేందర్, రాంబత్రి గంగాధర్, వి.పి.చందన్‌రావు, అమరేశ్వర్, కందాళై రాఘవాచార్య, కొండా రాజశేఖర్‌గౌడ్, చింతల గంగాదాస్, యశ్వంత రెడ్డి, ఓంకార్

## విషవలయం (గల్పికలు)

పుప్పాల కృష్ణమూర్తి

వెల : 30 పేజీలు : 40

లభ్యత: సెల్: 9912359345

"'విషవలయం' పేరు దీనికి నిర్ణయించడం సరైనదే అనిపించింది. మనిషి జీవితమే ఒక చక్రంలా తిరుగుతుంటుంది. ఇందులోనే ఆనందాలైనా, విషాదాలైనా. భద్రమైన జీవితం కోసం ఆరాటపడే మనుషులం మనం. అది దక్కనప్పుడే ఆందోళనలు, హర్తాళ్లు, మొత్తంగా ప్రజల మీద నిర్బంధం. ఈ గల్పికల్లో నూతన ఆర్థిక విధానాల ఫలితంగా సమాజంలో ఏర్పడ్డ సంక్షోభం కనిపిస్తుంది. ఇలాగే ప్రతి గల్పికలోనూ ఏదో ఒక మేలుకొలుపు, వ్యంగ్యం, ఆలోచింపజేసే హెచ్చరికలు ఉండడం చెప్పుకోదగింది."

**తుమ్మా భాస్కర్**

## మారాజులు(మంచికంటి కథలు)

మంచికంటి

వెల : 40 పేజీలు : 120

లభ్యత: సెల్: 9949535695

"ఎన్ని వాద వివాదాలు, భేదాభిప్రాయాలున్నా సాహిత్యంలో అన్ని ప్రాంతాలకూ ఏకసూత్రత అనేది ఒకటి ఉంటుంది. ఇప్పుడు అది కొరవడింది. అందుకే రచనల్లో గాఢత తగ్గింది. సంఘర్షణ కరువైంది. దానికోసం ప్రయత్నం చెయ్యాలి. ఈ అన్ని సమస్యలకూ మూలాధారం అధ్యయనం కొరవడడమే. అది నిరంతరం కొనసాగితే రచన ఇంకా ప్రతిభావంతంగా, ప్రభావ వంతంగా తయారవుతుంది.... నిరంతరం అదే తపనతో ముందుకు సాగుతూ నా కథల్ని అందరి ముందుంచే ప్రయత్నమే ఈ మారాజులు"

**మంచికంటి**



## పక్షులు(పద్య కావ్యం), సముద్రం నాపేరు(వచన కవితా సంకలనం), ఈ నగరం జాబిల్లి (గజల్ లక్ష్య లక్షణాలను చెప్పే గీతికావ్యం)

శేషేంద్ర

వెల : 100 పేజీలు : 155

లభ్యత: సెల్: 9441070985

"శేషేంద్ర నినాదకవి కాదు, విధివిధాన కవి, యువకుల్లో వైజ్ఞానిక దృక్పథాన్ని పెంచడానికి తన కళ్ళనూ, కలాన్నీ విశాలం చేసుకున్న కవి. నిర్మోహమాటంగా, వ్యంగ్యంగానూ, వాచ్యంగానూ నిజాలను నిగ్గుతేల్చి చూపగల కవి, "నీకు సేవలందించిన వాడికి నీవు రుణగ్రస్తుడవు, మార్క్సుకు ప్రపంచ శ్రామికులంతా రుణగ్రస్తులన్న శేషేంద్ర చాలా లోతైన భావాలున్నవాడు. తన రచనల్లో ఆయన ఒకచోట గాలివానగా మారుతాడు; ఇంకోచోట గాంభీర్యంగా గొంతు విప్పుతాడు."

**ఎ.బి.కె. ప్రసాద్**

## వాన కడిగిన చీకటి

వచన కవితాసంపుటి

డా.ఎన్. గోపి

వెల : 60 పేజీలు : 86

లభ్యత: ఫోన్: 040-27037585

"భూగోళం మందుబిళ్లను
ఖగోళం మింగుతున్న వేళ
తూర్పు పెయింటింగ్‌ను ప్రదర్శించే
ఆర్ట్ గ్యాలరీల కోసం వేట.ఏ దృశ్యానికైనా
అనుభూతే భాష్యం' (వైమానికం)

జీవితంలో పొందే దానికీ
కోల్పోతున్నదానికీ పొంతన లేదు.
తుపాకి మొనతో
గులాబీని పూయమన్నట్టు
ప్రేమ పక్కనే ప్రేమోన్మాదం.
మార్క్స్ కూడా విస్తుపోయేంత
ఆర్థిక సంక్లిష్టత. (ఆలాపన)"

**డా. ఎన్. గోపి**



## కలల కవాతు(కవితా భారతీయం),

నిర్మలానంద

వెల : 65 పేజీలు : 128

"ఉద్యమ అవసరాల దృష్ట్యా నాలుగైదు హిందీ పత్రికలకి చందాలు కట్టి తెప్పిస్తుండేవాణ్ని. ఆ పత్రికల్లో హిందీ రచనలతో పాటుగా ఇతర భారతీయ భాషల రచనలు కూడా అచ్చవుతూ వుండేవి. భారతీయ భాషలే కాదు కొన్ని ప్రపంచ భాషలకు సంబంధించిన కవితలు కూడా హిందీలోకి అనువదించి వేస్తుండేవారు. వాటిలో ప్రగతిశీల ఉద్యమ దృక్పథం గల కవితల్ని అనువదించి మా సంస్థ పత్రిక 'ప్రజాసాహితి'లో ప్రచురింపజేస్తుండేవాడిని. ఈ కవితా సంపుటిలోని చాలా కవితలు 'ప్రజాసాహితి'లో అచ్చయినవే."

**నిర్మలానంద**



## అందని చందమామ

దీర్ఘకవిత

డా॥ కాసుల లింగారెడ్డి.

వెల : 75 పేజీలు : 63

లభ్యత: సెల్: 9703432211

"ఇది ఒక పద్నాలుగు పర్వాల ఆరోగ్య భారతం. తుది యుద్ధం ఇంకా జరక్కనే 'యుద్ధానంతర నిశ్శబ్ద బీభత్స దృశ్య సమాహారాలు' కన్పిస్తాయిందులో. ఇదొక శాస్త్ర కావ్యం. 'భౌతిక ప్రపంచమే సత్యం. తెలియనిదుండొచ్చు. తెలుసుకోలేనిదంటూ లేదు'- అన్నప్పుడు. 'శాస్త్ర పీఠం మీద నిలబడి, సామాజిక ప్రకటన చేస్తాను'- అన్నప్పుడూ, 'పదార్థం క్రమత్వ కిరీటం ధరించింది' అన్నప్పుడూ... 'జీవపరిణామ వృక్షశాఖ కొసల మీద వికసించిన పుష్పం మనిషి' అన్నప్పుడూ... సైన్సుకూ, కవిత్వానికీ, తాత్వికతకూ మధ్య చెదిరిపోయే సరిహద్దులు కనిపిస్తాయి."

**డా. గేయానంద్**



## నిశ్శబ్ద స్వరం

**వచన కవితాసంపుటి**

**అనువాదం: అద్దేపల్లి రామమోహనరావు**

**ఇంగ్లీషుమూలం: కొలకలూరి ఇనాక్**

**లభ్యత: ఫోన్: 040-24093403**

**వెల : 72 పేజీలు : 158**

"నాకు మొదట్నుంచీ ఇంగ్లీషు కవిత్వాన్ని తెలుగులోకి అనువదించడం మీద గొప్ప ఆసక్తి ఉంది. ఫిట్జిరాల్డ్ ఉమర్‌ఖయ్యాం పద్యాల అనువాదమొక్కటే మధుజ్వాల పేరుతో ప్రచురితమైందిగాని వందలాది అనువాద కవితలు ముద్రణకాలేదు. కిందటి సంవత్సరం డా॥ కొలకలూరి ఇనాక్‌గారి సాహిత్య సమాలోచన సభలో హైదరాబాదు కోఠీ ఉమన్స్ కాలేజీలో జరిగినప్పుడు, నన్ను డా॥ కొళ్ళాగుళ్ళ ఆనందన్, ఇనాక్ గారి Voice of Silence ఇంగ్లీషు కవితాసంపుటిపై మాట్లాడమన్నారు. ఆ పుస్తకం మీద మాట్లాడ్డమే, నాకు ఒక అవకాశమౌతుందని నేను అనుకోలేదు. "

**డా॥ అద్దేపల్లి రామమోహనరావు**



## ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంపై పరిశోధనం

**సంపాదకులు: ఆచార్య రాచపాలెం చంద్రశేఖర్ రెడ్డి , ఆచార్య కొళ్ళాగుంట ఆనందన్**

**వెల : 90 పేజీలు : 168**

**లభ్యత: ఫోన్: 040-24093403**

"ఈ పరిశోధన పత్రాలు నిశిత పరీక్షలుగా, నిశ్చల పరిశీలనలుగా ఉన్నాయి. ఇవి నా సాహిత్యం చదివి ఉంటే, కొత్త ఆలోచనలు కొంతమేర రేపుతాయి. చదివి ఉండకపోతే, నా సాహిత్యం కొంత పరిచయం కలిగిస్తాయి. పరిశోధకులకు నూత్న పథ ప్రదర్శనం చేస్తాయి. మొత్తం మీద నా సాహిత్యం స్థూలంగా అంచనా వేయటానికి సూక్ష్మదృష్టితో సహాయంగా ఉంటాయి. నా సాహిత్యం సమాజానికి మరింత సన్నిహితం అవుతుంది. నేను పునఃపరిచయమవుతాను."

**ఆచార్య కొలకలూరి ఇనాక్**

## నవతరం తెలుగు కథ

**వారధి రచయితల సహకారవేదిక.**

**వెల : 60 పేజీలు : 287**

**లభ్యత: సెల్: 9949535695**

"ప్రస్తుతం తెలుగు సాహిత్యంలో కథాప్రక్రియ ఎక్కువ పాఠకాదరణని పొందుతోంది. విరివిగా కథా సంకలనాలూ వస్తున్నాయి. వ్యక్తిగత సంకలనాలు, వార్షిక కథా సంకలనాలు, ప్రాంతాలవారీ, అస్తిత్వాలవారీ కథా సంకలనాలు వస్తున్నాయి. వీటితోపాటు ప్రత్యేక సందర్భాల్లో ప్రత్యేక అవసరాల దృష్ట్యా కథా సంకలనాలు వస్తున్నాయి. 'వారధి' వేదిక ద్వారా వస్తున్న ఈ కథా సంకలనం కథల ఎంపిక, ప్రచురణ, మార్కెటింగ్ మొదలయిన అంశాల్లో విలక్షణత కలిగివుంది. 24 మంది యువకథా రచయితల ఉత్తమకథలు ఈ సంకలనంలో వున్నాయి."

**కె.యన్. మల్లీశ్వరి**

## ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంపై విమర్శనం

**సంపాదకురాలు: డా. కొలకలూరి మధుజ్యోతి**

**వెల : 116 పేజీలు : 203**

**లభ్యత: ఫోన్: 040-24093403**

"ఇటీవలి నాలుగు గ్రంథాలు, రెండు నవలలు, సర్కారు గడ్డి, అనంతజీవనం, రెండు కథానికా సంకలనాలు కొలుపులు, కట్టడి మీద వేరు వేరు పత్రికల్లో వెలువడ్డ సమీక్షా వ్యాసాలు మరో భాగంగా; గ్రంథావిష్కరణ సందర్భం పురస్కరించుకొని, విమర్శనాత్మకంగా వెలువడ్డ సాహిత్య సమాచార దృక్కోణాలు ఇంకో భాగంగా, ఆచార్యుల జీవిత సాహిత్య దృక్పథాలు ఆధారంగా నిర్వహించిన ముఖాముఖులలోని వివిధాంశాలు వేరొక భాగంగా ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంపై విమర్శనం గ్రంథం రూపొందించాను."

**డా. కొలకలూరి మధుజ్యోతి**



## విశద

**విద్య-సామాజిక విశ్లేషణ**

**సి.యస్.ఆర్. ప్రసాద్**

**వెల : 60 పేజీలు : 204 లభ్యత: ప్రజాశక్తి, లభ్యత: విశాలాంధ్ర & ప్రముఖ పుస్తకాల షాపుల్లో**

"సి యస్ ఆర్ అనువాదాలకు ఎంచుకున్న విషయాలైనా, మనసుపడి రాసిన విషయాలైనా బిడ్డల శిక్షణ, విద్యా విధానం. బిడ్డల శిక్షణను ఆదర్శప్రాయమైన విద్యావిధానానికి ఆయన ఒక వికాసవంతమైన ఆరంభంగా ప్రతిపాదించాడు. 1994లో చలం జయంతి సందర్భంగా బిడ్డల శిక్షణ గురించి సిఎస్ఆర్ రాసిన సంపాదకీయం దానికదిగా ఒక ఉత్తమ అభిరుచిగల సాహిత్య కానుక. బాల్యమే జీవన స్వభావాన్ని నేర్పుతుందనే చలం భావనను విస్తరించి హృద్యంగా విశదపరిచారు."

**వి.వి.**




## కథావార్షిక 2008

**సంపాదకులు: డా.వి.ఆర్. రాసాని, మధురాంతకం నరేంద్ర**

**వెల : 100 పేజీలు : 146**

**లభ్యత: తిరుపతి-ఫోన్: 2245297, 2241588**

"రచనలో వెల్లడయ్యే రచయిత స్వభావంలాగే సంకలనాల వెనకుండే సంపాదకుల వ్యక్తిత్వాలను సైతం పాఠకులూ, విమర్శకులూ అర్థం చేసుకోలేకపోరు. యే కృషీ పరిపూర్ణంగాదు. అన్ని సంకలనాలకూ పరిమితులుంటాయి. పరిమితులున్నాయనే కారణంగా విమర్శనూ, సంకలనాలనూ పూర్తిగా విడనాడడం నబబుగాదు. సంకలనాలకు గొప్ప రచనలు ఆలంబనేగానీ, రచనలకు సంకలనాలు ఆలంబనగాదని గుర్తించాలి. "

**మధురాంతకం నరేంద్ర**

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అంటూ నినదించిన కవి దాశరథి కృష్ణమాచార్యులు . నిజాం నవాబుకు వ్యతిరేకంగా ప్రత్యక్షంగా ఉద్యమాలలో పాల్గొని జైలుకెళ్ళారు. ప్రసిద్ధ గేయం 'ఆ చల్లని సముద్ర గర్భంలో/దాచిన బడబాలనమెంతో/ ఆ నల్లని ఆకాశంలో కానరాని భాస్కరులెందరో/భూలోకం పుట్టుక కోసం/రాలిన సురగోళాలెన్నో' రాసింది దాశరథే. అగ్నివీణ, అగ్నిధార తదితర రచనలు సుప్రసిద్ధాలు.

ఫొటో: జిన్. భూషణ్

దాశరథి కృష్ణమాచార్యులు

(22-7-1925 - 05-11-1987)



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M293 |
| పుస్తకం పేరు | సాహిత్య ప్రస్థానం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Madhu MADHU |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | K.Daveed |
| పరీక్ష చేసినది | PRIYANKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |